అపరాధ పరిశోధన అనుబంధం—41

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

నాగ కనకదుర్గా బుక్ సెంటర్, రామచంద్రరావుపేట, ఏలూరు

## అజ్ఞాతవాసం

రచన : అజీజ్

## ఆడపిల్లలు-అరవై వజ్రాలు

రచన : శశిభూషణ్

## ఊరుకుంటేనే ఉత్తమం !!

రచన : వసుంధర

## శాన్యోరా

## అపూర్వ శిల్పం

రచన : ప్రభాకరదేవ్

'శాన్యోరా' సీరియల్ - ఆరవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—41
మే, 1977
వెల : 3-00 రూపాయలు
ఏడాది చందా 39 రూపాయలు
జీవిత చందా 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్ :
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం :
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. వీ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
కంచర్ల రమణ

కార్యాలయం :
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-36959

ముద్రణ :
క్రాంతి ప్రెస్,
12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

గేదా రంగారావు
నాగ కనకదుర్గా బుక్ సెంటర్
రామచంద్రరావుపేట, ఏలూరు

# అజ్ఞాతవాసం!

అజీజ్

"అమ్మాయిగారు పొద్దున్నే ముద్దుగా తయారవుతున్నారు. ఎక్కడికో?" అన్నారు వారు నన్ను సమీపిస్తూ.

"ఈ రోజు మధ్యాహ్నం ఓ ఫ్రెండు ఇంటికెళ్ళాలి. ఈ లంకంత ఇంట్లో రోజంతా ఒకర్తినీ గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోడం నావల్ల కాదు బాబూ! మీకేం ఉదయమనగా వెళ్ళి సాయంత్రం ఏ ఆరింటికో తిరిగొస్తారు" అన్నాను జడలో మల్లెచెండు తురుముకుంటూ.

బ్లౌజుకీ, చీరకీ మధ్య వున్న నా శరీరాన్ని మృదువుగా స్పృశిస్తూ నడుం చుట్టూ చెయ్యివేసి, "ఎంత బావున్నావో తెలుసా?" అన్నారు మత్తుగా.

నా నరాలన్నీ ఝల్లుమన్నాయి తియ్యగా. వారి స్పర్శ

తగిలితే అంతే! అసేం మాయో మరి! ఒళ్ళంతా తంత్రులు మీటినట్లూ, మనసు సుడిపింజగా మారి గగనంలోకి ఎగిసినట్లూ అనుభూతి కలుగుతుంది.

వారు నా గుండ్రని భుజాలమీద చేతులు వేసి తనవైపు తిప్పుకుంటోంటే మరబొమ్మలా తిరిగేను.

"ఇన్నాళ్ళూ నా రీసెర్చిలో అవిరామంగా మునిగి తేలుతూ, నిద్రాహారాలు మాని పాటుపడ్డ నా శ్రమ చివరికి విజయవంతంగా ముగిసింది. ఆ రీసెర్చి తాలూకు కోడ్ స్క్రిప్టు షేర్ చేసి కంపెనీవారికి అందివ్వడం మాత్రం మిగిలింది. అదేమంత రిస్కు వర్కు కాదు.

ఈ రోజుతో సగం పని పూర్తవుతుంది. రేపు మిగతా సగం కానిచ్చి కొన్నాళ్ళు సులభంగా ఏ కాశ్మీర్ కో చెక్కేద్దాం!" అంటూ రెండు చేతుల్లో నా మొహం దగ్గరికి లాక్కుని గట్టిగా పెదాలు బిగించేరు.

కళ్ళు మూసుకున్నాను. తన్మయత్వం. చిత్రమైన తన్మయత్వం అది.

అంతటితో వారి చేతులు ఊరుకోడం లేదు. మెల్లిగా వీపు నిమురుతూ బ్లౌజు బటన్స్ విప్పడానికి ప్రయత్నిస్తున్నారు.

"అబ్బ! ఊరుకోండి! దేనికైనా వేళాపాళా ఉండాలి!" అంటూ అతికష్టంమీద విడిపించుకున్నాను.

వారి కళ్ళల్లో చిలిపితనం చిందులు తొక్కుతోంది. నా బుగ్గమీద చిటికవేసి, టై కట్టుకుంటూ సోఫాలో చతికిలబడ్డారు. "ఈ రోజు ఏ బూట్లు తొడుక్కుంటానో?" అడిగేను షూ రాక్ వైపు నడుస్తూ.

రకరకాల జోళ్ళతో రాక్ నిండుచూలాలిలా ఉంది.

రామచంద్రరావుపేట


"ఆ బ్లాక్ బెల్ పట్రూ!"

"అయ్యో, నా మతి మండిపోయింది! బ్రౌన్ షూ పాలిష్ చేసేనండీ!"

"ఆఁ, ఏదో ఒకటి కానిద్దూ!"

జోళ్ళూ, మేజోళ్ళూ అందుకుని వారి కాళ్ళదగ్గర కూర్చున్నాను.

"దేనికిలా రోజూ శ్రమపడతావ్? ఆమాత్రం నేను తొడుక్కోని విప్పుకోలేనూ?" అని వారించబోయేరు.

"మీరు తొడుక్కోనూ గలరు, విప్పుకోనూ గలరు. ఆ పనేదో నా చేత్తో చేస్తే నాకెంత తృప్తిగా, ఆనందంగా ఉంటుందో మీకేం తెలుసు?" అన్నాను కాళ్ళకి మేజోళ్ళు తొడిగిస్తూ.

వారు తయారయ్యేక ఇద్దరం కలిసి డైనింగ్ హాల్లో కెళ్ళాం. బ్రేక్‌ఫాస్ట్ కానిచ్చి, చివరిసారి నా పెదాలు తడిపి, సెలవు తీసుకుని, కారెక్కి వెళ్ళిపోయేరు.

ఆయన కనుమరుగయ్యేవరకూ గుమ్మంలో చూస్తూ నిల్చుని తలుపు మూసేను. మళ్ళీ ఒంటరితనం! ఇంట్లో వంటమనిషి ఫూల్‌చంద్ ఉన్నా, అతని పనేదో అతనిది. కిచన్ వదిలి ఇవతలికి రాడు.

అంతక్రితం బసంతీ అనే వంటలక్క ఉండేది. తన పనేదో అటు చేసుకుంటూనే, ఇటు నాతో వసపిట్టలా వాగుతుండేది. రోజు ఎలా దొర్లిపోయేదో తెలిసేదికాదు.

ఈమధ్య ఏవో కారణాలు చెప్పి పని మానుకుంది. ఈ ఢిల్లీ నగరంలో పనిమనుషులు అంత త్వరగా దొరకరు. వంటమనిషి కావాలని స్థానిక ఏజెన్సీకి కబురుపెడితే ఈ ఫూల్‌చంద్ వచ్చి చేరేను.

మెట్లెక్కి పైకెళ్తూ రిస్ట్‌వాచీ చూసుకున్నాను. తొమ్మిదిన్నర.

నా జీవితం ఇటువంటి మధురమైన మలుపు తిరుగుతుందనీ, ఒక గొప్ప వ్యక్తికి అర్ధాంగినవుతాననీ, ఇలా నిశ్చింతగా ఏ లోటూ లేకుండా జీవిస్తాననీ ఎన్నడూ అనుకోలేదు. అంతా కలలోలాగా అనూహ్యంగా జరిగిపోయింది.

పెళ్ళికి పూర్వం టెలివిజన్లు తయారుచేసే ఓ పెద్ద కంపెనీలో స్టెనోగా పనిచేసేదాన్ని. ఒక రోజు ఏదో పని మీద అక్కడికి వచ్చేరు వారు. అప్పుడు పరిచయం ఏర్పడింది మా మధ్య.

ఆ పరిచయమే క్రమేపీ స్నేహమై, ఆ స్నేహం కాస్తా హృదయస్పందనై, వివాహబంధనంలో శాశ్వత రూపు దాల్చింది. శాంతారామ్ అనబడే ఓ పారిశ్రామిక వేత్త తాలూకు ప్రైవేట్ లేబొరేటరీలో పనిజేస్తున్నారు వారు. ఈ ఇల్లూ, ఇంట్లోని ఫర్నిచరూ వగైరా అన్నీ ఆ కంపెనీ సమకూర్చినవే.

ఆ లేబొరేటరీలో అమూల్యమైన ఒక ఫార్ములాకోసం పరిశోధన సాగిస్తున్నారు వారు. అడపాదడపా వారే చెబుతుంటారు దాని గురించి. మసిబొగ్గులోనూ, వజ్రంలోనూ ఉండే మూలపదార్థాన్ని కార్బన్ అంటారు.

ఆర్టిఫిషియల్ డైమండ్స్ తయారుచెయ్యడానికి ఇదివరకెందరో ప్రయత్నించేరుట. అది చాలా ఖర్చుతో కూడుకున్న పనిట. పదార్థాలను క్రిస్టల్ స్ట్రక్చర్ గా మార్చడానికే వారేదో ప్రయోగం చేస్తున్నారు. అది ఫలిస్తే, పదివేల రూపాయలు విలువజేసే వజ్రాన్ని సుమారు ఐదు వందల ఖర్చుతో తయారుచెయ్యవచ్చుట!

ఆ రీసెర్చి ముగిసింది గనక కంపెనీ వారికి పెద్ద మొత్తం ఇవ్వబోతోంది. ఆ డబ్బుతో కొన్నాళ్ళు ఏ కాశ్మీర్‌లోనో ప్రశాంతంగా రెస్టు తీసుకోవాలనుకుంటున్నారు వారు.

బెడ్‌రూంలో టెలిఫోన్ గణగణ మోగడంతో గబగబ వెళ్ళి రిసీవర్ అందుకున్నాను.

"సారథిగారేనా?" అవతలినించి పలికింది మగకంఠం.

"కాదు. వారి భార్య కృపాలిని!"

"వారెక్కడ?"

"ఇప్పుడే వెళ్ళేరు లేబొరేటరీకి. మీరెవరు?"

అవతల నిశ్శబ్దం!

"హలో! హలో!!"

ఠపీమని రిసీవర్ దించిన చప్పుడు.

నివ్వెరబోయేను!

అవతలి వ్యక్తి మర్యాదస్తుడై వుంటే ఇలా ప్రవర్తించడు.

"అమ్మగారూ!"అన్న పిలుపువిని తలుపువైపు చూసేను.

వంటమనిషి ఫూల్‌చంద్.

"ఏమిటి?"

"లంచ్‌లో ఏం చెయ్యమంటారు?"

కాగితంమీద వారికీ, నాకూ ఇష్టమైన విజిటేరియన్ ఐటమ్స్ రాసిచ్చేను. వారానికి సరిపడే కూరగాయాలూ అవీ ఫ్రిజ్‌లో ఎప్పుడూ సిద్ధంగా ఉంటాయి.

స్లిప్ అందుకుని వెళ్ళిపోయేడు ఫూల్‌చంద్.

## 2

సాయంత్రం వారు వచ్చేవేళకి గుమ్మంలో నిల్చుని ఎదురుచూడటం అలవాటైపోయింది నాకు. ఆ ఆరాటం

ఎందుకో స్పష్టంగా చెప్పలేను మరి. ఆయన ఎంత త్వరగా ఇంటికి వస్తే అంత ఆహ్లాదంగా వుంటుంది మనసు.

ఒకటిరెండుసార్లు బాగా చీకటిపడేవరకూ గుమ్మం లోంచి కదలకుండా కాచుకున్న సంఘటనలూ ఉన్నాయి.

సరిగ్గా ఆరుంబావుకి కార్లో హడావుడిగా వచ్చారు. "తయారైవున్నావన్నమాట. వెరీ గుడ్!" అన్నారు లోనికి వస్తూ.

"దేనికండీ ఈ హడావుడి?" అడిగాను అర్థంకాక.

"శ్రీ స్క్వేర్‌లో ఓ కొత్త ఇంగ్లీష్ పిక్చర్ రలీజైంది. మనకోసం రెండు టికెట్స్ రిజర్వ్ చేసాను. త్వరగా తెములు మరి. అట్టే టైంలేదు" అన్నారు తొందర పెడుతూ.

సినిమాకెళ్ళి చాలా రోజులైంది. ఆదరాబాదరా కాఫీలు తాగి, తిరిగి వచ్చి భోంచేస్తామని, మేల్కొనే వుండమని ఫూల్‌చంద్‌తో చెప్పి కారెక్కాం.

"రీసెర్చి తాలూకు కోడ్ స్క్రిప్టు ఫేర్ చెయ్యడం సగం పూర్తయింది. ఈనాటికి నా శ్రమ ఫలించింది. ప్రపంచంలో ఎవ్వరూ కనుక్కోలేని ఒక అమూల్య విష యాన్ని శోధించి సాధించాను. ఇహ జీవితాంతం కాలూ చెయ్యీ కదపకుండా నిశ్చింతగా బ్రతకవచ్చు.

కొద్దిరోజుల్లో అన్ని ఏర్పాట్లూ చూసుకుని ఓ శుభ ముహూర్తాన వజ్రాలు తయారుచెయ్యడం ప్రారంభిస్తారు. లాభాల్లో పాతిక శాతం వాటా నాకు వచ్చేలా ఒప్పందం కుదుర్చుకున్నాను" అంటున్నారు వారు కారు తోలుతూ.

సడన్‌గా జ్ఞాపకం వచ్చింది, ఉదయం ఎవ్వరో అనా మకుడు ఫోన్ చెయ్యడం, పేరు అడిగేసరికి ఫోన్ పెట్టెయ్యడం.

అదే చెప్పేను వారికి.

"రోజూ ఎందరో ఫోన్ చేస్తుంటారు స్నేహితులు! తొందర్లో ఉన్నాడేమో, నీ మాటలు పట్టించుకోకుండా లైన్ కట్ చేసేడు" అన్నారు ఆయన నవ్వుతూ.

థియేటర్ ఇంటికి చేరువలోనే ఉంది. సినిమా చాలా బావుంది. నా అభిమాన నటుడు క్లింట్ ఈస్ట్‌ఉడ్ నటించిన 'హేంగ్ హిమ్ హై' చిత్రం అది.

ఇంటర్వెల్లో వారు లేచి బైటికెళ్తూ_ "ఏమైనా తీసుకురావాలా?" అడిగేరు.

"చిప్స్!" అన్నాను నవ్వుతూ.

చిప్స్ నవుల్తూ పిక్చర్ చూడ్డం బావుంటుంది. ఇంటర్వెల్ తర్వాత వచ్చేరు వారు. మొత్తానికి చాల రోజులకి మంచి రిలీఫ్ లభించింది ఈ చిత్రం ద్వారా.

పిక్చర్ పూర్తయ్యేక పదినిముషాల్లో ఇల్లు చేరాం. తలుపు మూసి వుంది. పోర్టికోలో కారాపి, డోర్స్ లాక్ చేస్తున్నారు వారు. ఈలోగా మెట్లెక్కి, గుమ్మానికున్న కాలింగ్ బెల్ వత్తేను. లోపల బెల్ మోగుతున్న శబ్దం లీలగా వినిపిస్తోంది.

పదినిముషాలు గడిచినా తలుపు తెరుచుకోలేదు. ఫూల్‌చంద్ నిదరబోతున్నాడా యేం? మరో మారు వత్తేను బెల్. ఓపిక నశిస్తోంది మాకు. కడుపులో ఎలుకలు పొర్లుతున్నాయి మరి.

"నిదురుపోయాడో ఏమో!" అన్నారు వారు.

గట్టిగా తలుపు తట్టాలని చెయ్యి వేసేను. కిర్రుమంటూ తెరుచుకుంది. ఒకరి మొహాలొకరం చూసుకున్నాం.

"లక్షసార్లు చెప్పేను. రాత్రివేళ గడియవెయ్యకుండా

వదలొద్దని. జాగ్రత్తగా ఉండమని" ముఖం చిట్లిస్తూ లోనికి నడిచేను.

నా వెనకే వారూ వచ్చి, బట్టలు మార్చుకోడానికి పైకెళ్ళేరు.

"ఫూల్ చంద్!" పిల్చేను.

ఇల్లంతా నిశ్శబ్దం!

ఈసారి కాస్త గట్టిగా పిల్చేను.

జవాబు లేదు.

ఎక్కడికెళ్ళాడు చెప్మా, అనుకుంటూ వంటింటివైపు నడిచేను. వంటింటి తలుపు దగ్గరగా వేసివుంది. చిన్న శబ్దం జేస్తూ తెరుచుకుంది.

లోపల చీకటి!

కోపంతో నాకు కళ్ళు మండిపోతోంది. గోడ తడిమి లైటు వేసేను. నేలమీద కనిపించిన దృశ్యం చూసి కెవ్వుమన్నాను.

ఫూల్ చంద్ వెల్లకిలా పడున్నాడు. సరిగ్గా అతని ఛాతీ మధ్య రంధ్రం. అది పిస్తోలు గుండు చేసిన రంధ్రం! చొక్కామీద కల్లాపి చల్లినట్టు ఇంకిన రక్తం. కళ్ళు తెరిచి గది కప్పు చూస్తున్నట్టు పడున్నాడు. నోరు సగం తెరిచి వుంది.

గొంతు బొంగురు బోయేలా, పిచ్చిదానిలా, గావు కేకలు పెడుతూ మేడమీదికి పరిగెత్తేను.

అప్పటికే నా కేకలు విని— "ఏం జరిగింది కృపా?" అంటూ గది బైటికి రాబోతున్నారు వారు కంగారుగా.

భయంతో నా నోరు పెగలడం లేదు. ఫిట్స్ వచ్చిన రోగిలా వణుకుతూ ఆయన ఛాతీమీద వాలిపోయేను.

"ఏం జరిగింది కృపా? దేనికలా వణుకుతున్నావ్? ఫూల్‌చంద్ ఎక్కడ?" అడుగుతున్నారు వారు నా వీపు చరుస్తూ.

అతికష్టంమీద నోరు విప్పి చెప్పగలిగేను చూసిన దృశ్యం. ఆశ్చర్యంతో ఆయన కళ్ళు పెద్దవయ్యేయి. అమాంతం నన్ను తీసుకెళ్ళి సోఫాలో కూర్చోబెట్టి_ "మనింట్లో హత్య జరగడమేమిటి? నువ్వేదో భ్రమ పడుంటావ్. ఇక్కడే కూర్చో. నేవెళ్ళి చూస్తాను!" అంటూ నన్ను వంటరిగా అక్కడే వదిలి వెళ్ళేరు.

కొద్ది సేపటికి తిరిగి వచ్చి_ "నువ్వు చూసిందంతా నిజమేనా?" అడిగేరు అనుమానంగా.

"అదేమిటి?" అన్నాను నివ్వెరబోతూ.

"ఐతే శవం ఏది అక్కడ?"

"శవం లేదా?" అడిగేను దిమ్మెరపోయి.

"శవం లేదూ చచ్చుబండలూ లేవు. అనవసరంగా భ్రమపడ్డావ్."

నాకు నమ్మశక్యం గావడంలేదు.

"నా మాటమీద నమ్మకం లేకుంటే, రా చూద్దువుగాని!" అంటూ నన్ను వెంటబెట్టుకుని కిందికి తీసికెళ్ళేరు.

వంటింట్లో కెళ్ళి చూడగానే, నా కళ్ళల్లో నింగీ నేలా గిరగిర తిరగసాగేయి. కనీసం నేలమీద చిన్న రక్తపు మరకకూడా కనిపించటంలేదు.

ఏమిటీ మాయ?

వారు భుజం తడుతూ_ "పద!" అన్నారు.

"మరి ఫూల్‌చంద్ ఏమయ్యేడు?" అడిగేను అయోమయంగా.

"ఎక్కడికో వెళ్ళుంటాడు. వస్తాడులే. పద!" అంటూ నన్ను పైకి తీసుకెళ్ళి- "కాసేపు రెస్టు తీసుకో!" అన్నారు.

"దేనికైనా మంచిది. ఓసారి పోలీసులకి ఫోన్ జేసి పిలిపించండి" అన్నాను వణుకుతూ.

"పిచ్చిదానా! వాళ్ళని పిలిపించడానికి కారణమంటూ ఏదైనా ఉండాలిగా? తెల్లారేలోగా, ఫూల్‌చంద్ రాకపోతే అప్పుడాలోచిద్దాం! ముందు భోంచేసి శుభ్రంగా నిదరపో!"

"నాకాకలిగా లేదు. మీరు తినండి."

"నువ్వు లేకుండా నేనొక్కణ్నీ తినాలా? బావుంది. చెరో గ్లాసు పాలు తాగి పడుకుందాం" అని పాలల్లో ఓవల్టిన్ కలిపి ఓ గ్లాసు అందించేరు.

కళ్ళు మూసుకుని గట గట తాగేను కషాయంలా. వారు ఇంటి తలుపులు మూసి, లైటార్పి పక్కన జేరేరు. నా కళ్ళముందు మాత్రం ఆ దృశ్యమే గిర గిర తిరుగుతోంది. నేను నిజంగా భ్రమపడ్డానా? ఐతే ఫూల్‌చంద్ ఏమయ్యేడు? ఎక్కడికెళ్ళేడు?

ఆలోచిస్తూ అలాగే నిదరలోకి జారుకున్నాను.

# 3

ఉదయం చాలా పొద్దెక్కేక నిదర లేచాం ఇద్దరం. లేవగానే ఆదరాబాదరా మంచం దిగి ఇల్లంతా వెతికేను ఫూల్‌చంద్ కోసం. ఆవిరి గాలిలో అదృశ్యమైనట్టు జాడ లేకుండా ఉన్నాడతను.

"నాకంతా అయోమయంగా ఉంది. దేనికైనా మంచిది వెళ్ళి పోలీసులకి జరిగిందంతా తెలియజెయ్యండి"

అన్నాను వారితో. గబ గబ స్నానం అదీ జేసి, తయారై, కాం ఫ్లీబిస్కట్లతో టిఫిన్ కానిచ్చి వెళ్ళిపోయేరు.

పడగ్గదిలో తలుపులు బిగించుకుని కూర్చున్నాను భయంతో. ఆ ఇంట్లో తిరగడానికి చచ్చేంత భయంగా ఉంది.

సరిగ్గా పదిగంటలకి కాలింగ్ బెల్ మోగింది.

వారే అయుంటారనుకుని కిందికెళ్ళి హాలు తలుపు తెరిచేను.

పేపర్ కుర్రాడు!

పేపర్‌తోబాటు ఓ కవర్ చేతికిస్తూ_ "గేటుగుండా మీ ఇంట్లోకి వస్తుంటే ఓ వ్యక్తి అడ్డుపడి ఈ ఉత్తరం మీ ఇంట్లో ఇవ్వమన్నారు" అన్నాడు.

కవర్ మీద కేవలం వారి పేరుమాత్రం రాసి వుంది. గమ్‌తో ఓ పెన్ ప్లేస్ అతికించి లేదు! లోపల మడత పెట్టిన ఎర్రని కాగితం కనిపిస్తోంది.

కుర్రాణ్ణి వెళ్ళమని, తలుపు మూసి, కవర్లోంచి ఆ కాగితం తీస్తూ సోఫాలో కూలబడ్డాను. ఇంగ్లీష్‌లో టైప్ జేసిన ఉత్తరం అది.

"మిస్టర్ సారథీ!

'చాలా రోజుల్నుంచి మా మనుషులు నీమీద ఓ కన్నేసి ఉన్నారు. ఇన్నాళ్ళూ నీవు ఆ లాబొరేటరీలో దేనిమీద పరిశోధన సాగిస్తున్నావో మాకు తెలుసు. ఆ విషయం ఇతరెవ్వరికీ తెలియకుండా మీరెన్ని జాగ్రత్తలు పడ్డా లాభం లేకపోయింది.

అవిరామంగా కృషి జేస్తూ ఎట్టకేలకి ఈ మధ్యే నీ లక్ష్యాన్ని సాధించేవు. కంగ్రాచ్యులేషన్స్! ఇక్కడ నా

దాక చిన్న విన్నపం. మొక్క నాటి, నీరు పోసి, పెంచి పెద్దజేసి, దాని ఫలాన్ని తను తినకుండా ఇతర్లకి పంచి పెట్టడం అర్థంలేని పని.

నీ మేధస్సునంతా ధారపోసి కనుగొన్న ఆ అమూల్య ఫార్ములాని, ముందే కోట్లతో కులుకుతున్న శాంతారాం కెందుకిస్తావ్? మాకు తెలుసు. నీవు పేద కుటుంబంలో పుట్టి, స్వయంకృషితో ఇంతవాడివయ్యేవని.

మాతో చేతులు కలుపు. వజ్రాలు తయారుజెయ్యడాని క్కావలసిన యంత్రసామగ్రి సొంతం మేము ఏర్పాటు జేస్తాం. వచ్చేదాంట్లో ఇద్దరం ఫిఫ్టీ ఫిఫ్టీ! కొద్ది రోజుల్లోనే నీవు శాంతారాంని తలదన్నే కుబేరుడివైపోతావ్.

లేనిపోని ఆదర్శాలకి పోయి మా అభ్యర్థన తృణీకరిస్తే నీకే నష్టం. మేము అనుకున్నది సాధించేవరకు నిదరపోము. దురదృష్టశావత్తూ మేం కోరింది మాకు దక్కకపోతే దాన్ని మీకూ దక్కనివ్వం!

బాగా ఆలోచించి ఓ నిర్ణయానికి రా. ఒకరోజు గడు విస్తున్నాను. నీ నిర్ణయం తెలుసుకోడానికి సరిగ్గా రేపు రాత్రి ఏడుగంటలకి ఫోన్ జేస్తాను. నీవు సరేనంటే, సంప్ర దింపులకోసం మనం ఎక్కడ కలుసుకోవాలో తెలియ జేస్తాను.

అనాలోచితంగా నిన్న రాత్రి మావల్ల చిన్న పొరపాటు జరిగిపోయింది. ఆ ఫార్ములా లేబొరేటరీలో ఉంచకుండా నీ దగ్గిరే ఇంట్లోనే ఉంచుకుంటావనుకుని, నీవూ నీ భార్యా సినిమాకెళ్ళేక మీ ఇంట్లో ప్రవేశించాం.

ఫార్ములాకోసం వెదుకుతుంటే మీ నౌఖరు చూసి అడ్డు పడ్డాడు. వాణ్ణి కాల్చిపారేసి ఇల్లంతా వెతికాం. మా శ్రమ

వృధా అయింది. వెళ్ళిపోదామనుకుంటుండగా మీరు సినిమానుంచి వచ్చేరు. ఇంట్లో నక్కిదాక్కున్నాం. నీ భార్య నాఖరు శవం చూసి పైకి పరిగెత్తగానే శవాన్ని మోసుకు పారిపోయాం.

నీ భవిష్యత్తు సగం నీ చేతిలో, సగం మా చేతిలో ఉంది. అతి తెలివికిపోయి మా ఆగ్రహానికి గురికాక. తరవాత చింతించి నిష్ప్రయోజనం. ఇట్లు

ఎర్ర దీపం!"

నా గుండెల్లో గుర్రాలు దౌడు తీసేయి. సన్నగా జ్వరం వచ్చినట్టు వళ్ళు వేడెక్కుతోంది. నిశ్చలంగా, ప్రశాంతంగా ఉన్న నీటిలో గులకరాయి పడ్డట్టు మన సంతా అల్లకల్లోలమయింది.

క్షణం ఆలస్యం జెయ్యకుండా వారికి ఫోన్ జేసి, తక్షణం ఇంటికి రమ్మని చెప్పేను.

అరగంట తర్వాత హడావుడిగా వచ్చి "మళ్ళీ ఏం జరిగింది?" అన్నారు.

వణికే చేత్తో ఉత్తరం అందించేను.

చదివి తెల్లబోయేరు. "ఇలాంటి విపత్తు ఏదో ముంచుకు వస్తుందనే నా ప్రయోగాన్ని అతిరహస్యంగా కొనసాగించేను. ఐనా, ఎవ్వరికో తెలిసిపోయిందన్నమాట. ఇదేదో ఇంటర్నేషనల్ ముఠా అయివుంటుంది. ఉండు, ఇప్పుడే కాంతారాంగారితో మాట్లాడి వస్తాను."

నేనేదో చెప్పబోతుండగానే, వచ్చినంత వేగంగా వెళ్ళిపోయేరు. ప్రాణాలరచేతిలో పెట్టుకుని, నిమిషాలు లెక్కపెడుతూ కూచున్నాను.

సాయంత్రం ఆరుగంటల ప్రాంతంలో తిరిగివచ్చి-

"కృపా! ముఖ్యమైన సామానేదో ప్యాక్ చేసి వెంటనే తయారవు. శాంతారాం గారితో మాట్లాడేను. మూడో కంటికి తెలీకుండా మనం ఢిల్లీనించి జారుకుని కొన్నాళ్ళు ఏ మారుమూలో అజ్ఞాతంగా గడపమని సలహా ఇచ్చేరు.

ఆ ముఠావాళ్ళు నాకోసం ఢిల్లీ అంతా గాలించి, విసిగి నా సంగతి మరిచేక, రహస్యంగా తిరిగి వచ్చి నా కార్య కలాపాలు కొనసాగించమన్నారు.

ఆ ముఠావాళ్ళకి బెదిరి, ఇన్నాళ్ళూ నన్ను పోషించి ఆదరించే నామీద ఎన్నో ఆశలు పెట్టుకున్న శాంతారాం గారికి నమ్మకద్రోహం చెయ్యలేను. ఈ సంగతి చెప్పగానే ఆయన మన రక్షణకోసం క్షణాల్లో అన్ని ఏర్పాట్లూ చేసేరు. రాత్రి తొమ్మిదింబావుకి కలకత్తా వెళ్ళే ప్లేన్‌లో మనకోసం రెండు సీట్లు బుక్ అయి సిద్ధంగా ఉన్నాయి.

కలకత్తా చేరగానే ఏదైనా ఇల్లు చూసుకుని, శాంతారాంగార్నించి మెసేజ్ అందేవరకూ గోప్యంగా ఉందాం. ఆలోగా ఆయన ఆ ముఠా సంగతేమిటో కను క్కుంటారు. త్వరగా తెములు మరి!" అన్నారు తొందర పెడుతూ.

నా మస్తిష్కం ఆలోచించే ఓపిక కోల్పోయింది. ఆదరాబాదరా కావలసిన బట్టలూ, నిత్యావసర వస్తు వులూ సూట్‌కేసుల్లో సర్ది గబగబ తయారయ్యేను.

వారుకూడా ఏవో కాగితాలూ, రెండు మూడు ఫైళ్లూ బ్రీఫ్‌కేస్‌లో సర్దుకున్నారు. తరవాత ఇంటికి తాళంవేసి ఇద్దరం కార్లో కూర్చున్నాం.

## 4

రెండు మూడు వీధులు తిప్పి, పెద్ద హోటల్ ముందు ఆపేరు కారు. "వెర్రిదానిలా దిక్కులు చూస్తూ కూర్చోక!

త్వరగా పద!'' అన్నారు సామానందుకుంటూ.

ఇద్దరం హోటల్లో కెళ్ళాం.

వారు కౌంటర్ క్లర్క్‌తో మాట్లాడి, ఏదో తీసుకుని, లిఫ్ట్ వైపు నడిచేరు. మరబొమ్మలా ఆయన్ని అనుసరించేను.

నాలుగో అంతస్థులో లిఫ్ట్ ఆగగానే నన్ను రమ్మన్నట్టు సైగ చేసి, నడవాకిరుపక్కలా వున్న రూం నెంబర్స్ చెక్ చేసుకుంటూ వెళ్ళి ఓ గదిముందు ఆగేను. తలుపు మూసి ఉంది. జేబులోంచి కీ తీసి, తాళం తెరిచి—''రా'' అన్నారు లోనికి నడుస్తూ.

నేను లోనికెళ్ళగానే తిరిగి డోర్ మూసేరు. సరిగ్గా అదే క్షణంలో, లోపల బెడ్ రూం తలుపు తెరుచుకుంది. అందులోంచి ఇవతలికి వస్తున్న ఇద్దరు స్త్రీ పురుషుల్ని చూసి కొయ్యబారిపోయేను.

ఆ వ్యక్తి అచ్చు మా వారిలాగే వున్నాడు. ఆ స్త్రీ ముమ్మూర్తులా నాలాగే వుంది. అద్దంలో నన్ను నేను చూసుకుంటున్నానా అనిపించింది క్షణంపాటు. ఏమిటీ గారడీ?

''హలో మిస్టర్ సారథీ! మీ కోసమే ఎదురు చూస్తున్నాం. సమయానికి వచ్చేరు. ఇహ మమ్మల్ని వెళ్ళమంటారా?'' అంటున్నాడతను మా వార్ని చూస్తూ.

ఆ యువతి నన్ను సమీపించి— ''మమ్మల్ని చూసి నిర్ఘాంతబోతున్నారా?'' అంది నవ్వుతూ.

అప్పుడు గమనించేను. వాళ్ళ రూపాలు మావే అయినా కంఠాలు మావి కావని.

వారు నా వైపు తిరిగి నవ్వి—''మనం ఇంటినుంచి బైలుదేరితే ఎవ్వరైనా మనల్ని వెంబడించి, మనం ఎక్కడి

కళ్లామో కనుక్కుంటారని శాంతారాంగారే ఈ ఏర్పాటు చేశారు.

మన వేషాల్లో వీరు బైటికెళ్ళి మనం వచ్చిన కార్లో వెళ్ళిపోతారు. నిజంగా ఎవ్వరైనా మనల్ని వెంబడించి ఇక్కడికి వచ్చివుంటే, వీళ్ళని ఫాలోజేస్తూ వెళ్ళిపోతారు. అప్పుడు మనం మారువేషాల్లో టాక్సీ ఎక్కి ఏర్‌పోర్ట్ చేరుకుందాం,'' అన్నారు.

ఈ ఏర్పాటు నాకు నచ్చింది,

''సరే, మీరు వెళ్ళండి,'' అన్నారు వారు వాళ్ళని.

ఇద్దరూ వెళ్ళిపోయేరు.

తిరిగి తలుపుమూసి—''రా యిలా!'' అంటూ పడగ్గదిలోకి నడిచేరు వారు. అక్కడ మా కోసం మారువేషాలు సిద్ధంగా వున్నాయి. ముస్లిం స్త్రీలు వేసుకునే బురఖా తీసిస్తూ—''ఇది తొడుక్కుని ముఖం దాచుకో'' అన్నారు.

తంటాలుపడి ఎలాగో తొడుక్కున్నాను.

వారు గడ్డం, మీసాలు అతికించుకుని, కళ్ళకి తెల్ల కళ్ళద్దాలు పెట్టుకున్నారు. తలమీద కుచ్చు టోపీ పెట్టుకుని మనిషి దాదాపు మారిపోయారు.

ఇద్దరం సామానులతో తిరిగి హోటల్లోంచి బైటపడి, ఓ టాక్సీని ఎక్కి ఏర్‌పోర్ట్ చేరుకున్నాం. కలకత్తా వెళ్లే విమానం ఎక్కేక గానీ మనసు కుదుటపడలేదు.

పదిన్నరకి విమానం వెళ్ళబోతున్నట్టు ఎనౌన్స్ జేసేడు పైలెట్. కావలసినంత ఎత్తు ఎగిరేక బెల్టులు తీసి వెయ్యవచ్చని చెప్పింది ఏర్‌హోస్టెస్, మైక్‌లో.

''నిద్రవస్తే నా భుజంమీద తలపెట్టుకు పడుకో!'' అన్నారు వారు.

ఇటువంటి పరిస్థితిలో ఇహ నిద్ర కూడానా?

విమానంలో ఒక్క సీటుకూడా ఖాళీలేకుండా ప్రయాణీకులతో నిండివుంది. అనాలోచితంగా పక్కవరుసలోని ప్రయాణీకుల్ని చూస్తూ కూర్చున్నాను.

సరిగ్గా మాకు కాస్త వెనక ఓ సీట్లో ఉన్న వ్యక్తి మీద దృష్టి పడగానే ఉలిక్కిపడ్డాను. అంతవరకూ అతను మమ్మల్నే గమనిస్తున్నవాడల్లా నేనటు చూడగానే చటుక్కున తల తిప్పుకున్నాడు.

నా ఉలికిపాటుకి కారణం లేకపోలేదు. అంతక్రితం ఏర్‌పోర్ట్‌లో విమానం ఎక్కకముందు మేమిద్దరం కాంటీన్‌లో కూర్చుని కాఫీ, టిఫిన్‌లు తీసుకున్నాం. అప్పుడే గమనించేను. ఈ వ్యక్తి మాకాస్త దూరంలో కూర్చుని మమ్మల్నే గమనిస్తుండటం. అప్పుడంతగా పట్టించుకోలేదు. కాని, ఇప్పుడు దేనికో మనసు కీడును శంకిస్తోంది.

పక్కవాళ్ళకి వినిపించకుండా, మావారివైపు ఒదిగి, రహస్యంగా చెప్పేను అతని గురించి.

ఆయన కాసేపాగి, తల కొద్దిగా తిప్పి, ఓరగా అతన్ని చూసేరు. "మనం ఇంత జాగ్రత్తపడ్డాక, ఎవ్వరో మనల్ని వెంబడిస్తున్నాడంటే నేన్నమ్మను. అనవసరంగా భయపడుతూ మనసు పాడుచేసుకోక!" అన్నారు తేలిగ్గా తీసిపారేస్తూ.

నేను పలకలేదు.

విమానం రెండు మూడు నగరాల్లో దిగుతూ, ఎగురుతూ తెల్లవారుజాము ఆరుగంటలకి కలకత్తా చేరింది.

సామానుతో సరాసరి ఓ హోటల్ చేరుకున్నాం.

దాన్లో ఆ వ్యక్తి మమ్మల్ని వెంబడిస్తున్నాడేమోనని జాగ్రత్తగా గమనించేను. అతను ఎక్కడా కనిపించలేదు.

# 5

హోటల్లో ఓ సింగిల్ రూం తీసుకుని, మారు వేషాలు తీసేసి శుభ్రంగా స్నానం అదీ కానిచ్చి, కాఫీ టిఫిన్లు తెప్పించుకు తిన్నాం.

వారు సోఫాలో కూర్చుని ఏవో కాగితాలు చూసుకుంటున్నారు.

కిటికీ గుండా బైటి దృశ్యాలు చూద్దామని, కిటికీవైపు నడిచేను. దూర దూరంవరకూ ఎటు చూసినా ఎత్తయిన మేడలూ మిద్దెలూ కనిపిస్తున్నాయి. కింద హోటల్ ముందు విశాలమైన రోడ్ వుంది. వచ్చేపోయే జనంతో, వాహనాలతో చాలా రద్దీగా ఉంది.

సరిగ్గా రోడ్ కవతలివైపు ఓ రెస్టారెంట్ కనిపిస్తోంది. అందులో కూర్చున్న సగం జనం ఇక్కణ్నుంచి స్పష్టంగా కనిపిస్తున్నారు. సడన్ గా నా దృష్టి ఓ కుర్చీలో కూర్చున్న వ్యక్తిమీద పడగానే అదిరిపడ్డాను.

అతనే!

అంతక్రితం విమానంలో కనిపించిన వ్యక్తి! సిగరెట్ కాలుస్తూ అప్పుడప్పుడూ తలెత్తి హోటల్ వైపు చూస్తున్నాడు.

"ఏమండీ!" అన్నాను దాదాపు అరుస్తూ.

"ఏం జరిగింది?" అంటూ వచ్చేరు కంగారుగా.

వేలితో చూపించి– "అతన్నెక్కడైనా చూసేరేమో జ్ఞాపకం చేసుకోండి" అన్నాను.

వారి కళ్ళు పెద్దవయ్యేయి. "విమానంలో నీవు చూపించిన వ్యక్తే కదూ?" అన్నారు ఆశ్చర్యంగా.

"ఔను. అతనే!"

వారు పలకలేదు. మునిపంటితో పెదవి నొక్కిపట్టి కాసేపు ఏదో ఆలోచించి సాలోచనగా తలూపేరు. “వీడెవడో ఇప్పుడే తేల్చుకుందాం! పద” అన్నారు అద్దంవైపు నడుస్తూ.

“మళ్ళీ బురఖా వేసుకోనా? నావల్ల కాదు బాబూ!” అన్నాను.

“నీకు మారువేషం అక్కర్లేదు. ఇలాగే పద!” అంటూ గబ గబ గెడ్డం మీసాలు అతికించుకోసాగేరు.

తరవాత గది లాక్ చేసి ఇద్దరం కిందికెళ్ళాం.

“వీధిలో నా వెంట నడుస్తూ, అప్పుడప్పుడు ఓరగా అతను మనల్ని ఫాలో అవుతున్నాడేమో గమనించాలి. దాంతో, శత్రువులు ఆవులిస్తే పేగులు లెక్కపెట్టేవారనీ, ఢిల్లీనించి మనల్ని వెంబడిస్తూ ఇక్కడివరకూ వచ్చేరనీ, ఎన్ని ఎత్తులు వేసినా వాళ్ళముందు చిత్తు కావలసిందేననీ స్పష్టంగా తెలిసిపోతుంది” అన్నారు వారు.

చిన్నగా తలూపేను.

ఇద్దరం వీధిలో పడి నడవసాగాం.

కొద్దిదూరం వెళ్ళేక ఓరగా వెనక్కి చూసేను. నా అనుమానమే నిజమైంది. కొద్ది దూరంలో అతను మా వెనకే వస్తున్నాడు. చెప్పేను వారికి. సాలోచనగా తలూపేరు.

ఇంకాస్త దూరం వెళ్ళేక మరో మారు చూసేను. నా గుండె వేగం అందుకుంది. జేబుల్లో చేతులు పెట్టుకుని, రోడ్డుమీది జనంలో మేమెక్కడ తప్పిపోతామో అన్నట్టు నిశితంగా మమ్మల్నే చూస్తూ వస్తున్నాడు.

“సందేహంలేదు. అతను శత్రుపక్షం మనిషే. రా ఇలా!” అంటూ ఓ ఫోటోగ్రాఫిక్ గూడ్స్ డీలర్

దుకాణం వైపు నడిచేరు వారు. ఏం చేస్తారో మాట్లాడమన్న క్యూరియాసిటీతో అనుసరించేను. ఆ షాప్ లో రకరకాల కెమెరాలూ, ఫోటోగ్రఫీ కవసరమయ్యే అన్ని వస్తువులూ దొరుకుతాయి.

వారు ఓ కెమెరా, ఫిల్మ్ తీసుకుని, గబగబ ఫిల్మ్ కెమెరాలో ఎక్కించేశారు. "వీధిలో నడుస్తూ ఓ చోట ఫోటో తీసుకుంటున్నట్టు ఫోజ్ పెట్టి నిల్చో. నీ ఫోటోలో ఆ వ్యక్తి కూడా పడేటట్టు స్నాప్ తీస్తాను. ఈ సిటీలో నాకు తెలిసిన ఓ పోలీస్ ఇన్స్పెక్టర్ వున్నాడు. ఆ ఫోటో ఎన్లార్జ్ చేసి, అతని సహాయంతో వీడు అంతు చూస్తాను," అన్నారు.

"త్వరగా ఏదో ఒకటిచేసి వీడి పీడ విరగడ జెయ్యండి. ఏ ఆపద తెచ్చిపెడతాడో ఏమో?" అన్నాను భయంగా.

షాప్ లోంచి బైటికెళ్తూ తలతిప్పి చూశాను. ఆ వ్యక్తి కొద్ది దూరంలో టెలిఫోన్ స్తంభాని కానుకుకి నిల్చున్నాడు ఫుట్ పాత్ మీద. ఇద్దరం మళ్ళీ ముందుకి సాగాం.

వారు చెప్పినట్టు, ఫోటో తీసుకోడానికనుకూలంగా ఉన్న ఓ చోట ఫోజు పెట్టి నిల్చున్నాను. వారు కెమెరా లోంచి ఏంగిల్స్ చూసుకుంటూ క్లిక్ మనిపించేరు.

ఇద్దరం తిరిగి నడక సాగించాం.

"ఫోటోలో వాడూ పడ్డాడా?" అడిగేను మెల్లిగా.

ఆయన తలూపి– "ఏదైనా స్టూడియోలో ఈ ఫిల్మ్ కడిగించి, కాపీలు తీయించి టాక్సీలో ఇన్స్పెక్టర్ దగ్గరికెళ్తాను. నీవు కాసేపు అక్కడక్కడా తిరిగి హోటల్ వెళ్ళిపో!" అన్నారు.

ఆయన్ని ఒంటరిగా వదలడానికి మనస్కొప్పడం లేదు. చేసేది లేక తలూపేను.

కొద్దిదూరం వెంట నడిచి, ఓ టాక్సీ ఆపి ఎక్కి వెళ్ళిపోయేరు. నేను వెంటనే పక్కనున్న ఓ ఫాన్సీషాప్‌లో దూరి, ద్వారం పక్క నక్కి ఆ వ్యక్తి చర్యలు గమనించసాగేను.

రోడ్డు పక్క ఆగివున్న టాక్సీ దగ్గర ఒంగి డ్రైవర్‌తో ఏదో అంటున్నాడు. తరవాత బాక్ డోర్ తెరిచి లోన కూర్చున్నాడు. ఆ టాక్సీ స్టార్టయి, వారు వెళ్ళినవైపు పరిగెత్తింది.

దానిలాగే నా గుండెలూ ఉరకలు వేసేయి భయంతో. ఆ షాప్‌లో నాకక్కరసిన కాస్మోటిక్ ఐటమ్స్ రెండు మూడు కొని, కొన్ని గంటలు అక్కడక్కడా తిరిగి కాలి నడకనే హోటల్‌కి బైలుదేరేను.

లిఫ్ట్‌ద్వారా పైకెళ్ళి రూం జేరుకున్నాను. పర్సులోంచి తాళంచెవి తీసి లాక్ తెరిచేను. తలుపు తోసి లోనికెళ్ళి తిరిగి మూసేను. బాగా తిరగడంవల్ల చమటపోసి చటపటమంటోంది.

వారెప్పుడు తిరిగొస్తారో ఏమో! ఈలోగా కాస్త చన్నీళ్ళు పోసుకుంటే మనసు తేలిక పడుతుంది - అనుకుంటూ టవల్, సోప్ అందుకుని బాత్‌రూంవైపు నడిచి, తలుపు తోసేను.

లోన అడుగు పెట్టి భయంతో గావుకేక పెట్టేను. బాతింగ్ టబ్‌లో, నీళ్ళ మధ్య కూర్చుకుంది ఓ ఆకారం. ఫుల్ సూటు. మెడలో టై. సరిగ్గా గుండెదగ్గిర రంధ్రం! ఆ రంధ్రం గుండా కారి టబ్‌లోని నీళ్ళను ఎర్రగా

మార్చిన రక్తం! కళ్ళు మూతలు పడుతున్నాయి. చేతులు రెండూ ఆకుకూర కాడల్లా టబ్ కిరుపక్కలా వేలాడుతున్నాయి.

అతనెవ్వరో కాదు.

అంతక్రితం మమ్మల్ని వెంబడించిన వ్యక్తి!

ఇక్కడికెలా వచ్చేడు? ఎవ్వరు చంపేరు?

# 6

నా కాళ్ళూ చేతులూ వేపాకులా గజగజ వణుకుతున్నాయి. హోటల్ వాళ్ళకి మా గదిలో ఓ శవం వుందని తెలిస్తే ఏం గొడవ ముంచుకొస్తుందో? ఏదిఏమైనా, వారు వచ్చేవరకూ కింద రిసెప్షన్‌లో కూర్చోడం ఉత్తమం.

అనుకుంటూ గభాల్న బాత్‌రూం తలుపు మూసి గదిలోంచి బైటపడ్డాను. తలుపుకి తాళం వేసి, లిఫ్ట్‌లో కిందికెళ్ళి, ఓ సోఫాలో చతికిలబడ్డాను. అక్కణ్ణించి హోటల్లోకి వచ్చే పోయే జనం కనిపిస్తున్నారు.

తల భారంగా ఉంది. మస్తిష్కం ఆలోచనా రహితమై మొద్దుబారిపోయింది. ఎక్కువసేపు కాచుకునే అవసరం లేకుండా, అరగంటలోనే వారు హోటల్లో ప్రవేశించేరు.

అంతకిముందు నిండుగా వున్న ఆయన మొహం ఇప్పుడు వాడిపోయి, పీక్కుపోయింది. టైఫాయిడ్ రోగిలా చాలా నీరసంగా కనిపిస్తున్నారు.

ఉన్నపళాన లేచి ఆయన దగ్గరికెళ్ళేను.

"నువ్వెప్పుడొచ్చావ్?" అడిగేరు ఆశ్చర్యంగా.

"ఇప్పుడే..." అంటూ ఏదో చెప్పబోయేను.

ఆయన చెప్పనివ్వకుండా, "ష్!" అని వారించి, తనతో

రమ్మని సైగ చేసి లిఫ్ట్ వైపు నడిచేరు.

మౌనంగా అనుసరించేను. ఇద్దరం పైకెళ్ళి గదిని సమీపించాం. ఆయన తలుపు తెరుస్తూ– "నువ్వేం చెప్పదలచుకున్నావో నాకు తెలుసు!" అన్నారు.

"ఎలా తెలుసు?" అడిగేను నివ్వెరబోయి.

"ఆ వ్యక్తిని చంపింది నేనే!" అన్నారు గదిలో అడుగు పెడుతూ.

నా నోట మాట పెగల్లేదు.

"ఇంకా అక్కడే నిల్చున్నావేం? రా లోపలికి!" అంటూ నా చెయ్యి పట్టి లాగి తలుపు మూసేరు.

"నిన్ను బజార్లో వదిలి, నేను టాక్సీలో తిన్నగా ఓ స్టూడియో కెళ్ళాను. దార్లో సగందూరం వరకు అతను నన్ను వెంబడించేడు. నేను స్టూడియోలో కెళ్ళగానే అతని టాక్సీ వెనుదిరిగి వెళ్ళిపోయింది.

నేనా ఫోటోలు తీయించి, తిన్నగా సిటీ క్రయిం బ్రాంచికెళ్ళి నా స్నేహితుడికోసం ఆరాతీసేను. దురదృష్టవశాత్తు అతను రెండు రోజులక్రితం ఏదో ఇన్వెష్టిగేషన్‌లో దూనాపూర్ వెళ్ళేడని తెలిసింది.

చేసేది లేక హోటల్ చేరుకున్నాను. గది తాళం తీసి వుంది. నువ్వే వచ్చివుంటావనుకుని కాలింగ్ బెల్ వత్తేను. లోపల తలుపు గడియ తీసిన చప్పుడయింది.

తోసి లోన అడుగుపెట్టేను. అంతే. తలుపు పక్కన నక్కివున్న ఆ వ్యక్తి మెరుపులా నా మెడమీద దెబ్బ తీసేడు. నా కళ్ళల్లో చీకట్లు కమ్మేయి. కింద పడిపోకుండా నిలదొక్కుకుంటూ, అతను ఊహించని విధంగా జేబులోంచి పిస్తోలు తీసేను.

అప్పటికే అతను చిరుతలా నామీదికి లంఘించేను. కాసేపు మా మధ్య తీవ్ర పెనుగులాట జరిగింది. చివరికి నా చేతిలోని పిస్తోలు పేలి, గుండు అతని గుండెలో దిగింది.

కుప్పలా నేల కూలేడు. అప్పుడు గ్రహించేను మనం లేని అవకాశం చూసుకుని గదిలో ప్రవేశించి, సామాను వెతికి ఆ ఫార్ములా కాగితాలేవైనా దొరుకుతాయేమోనని వచ్చి ఉంటాడని. నా ఆత్మరక్షణకోసం అతన్ని కాల్చేను. అది నేరం కాదు.

కాని, ఈ సంగతి బైటికి పొక్కితే, పోలీసుల చుట్టూ కోర్టుల చుట్టూ నానాఇబ్బందులూ పడవలసి ఉంటుంది.

"ఆ వ్యక్తి శవాన్ని బాత్ రూంలో పడేసి, శాంతారాం గారికి ట్రంకాల్ చేసి మాట్లాడేను. వారిచ్చిన సలహా ప్రకారం అన్ని ఏర్పాట్లు చేసుకు వచ్చేను.

ఐదున్నరకి ఇక్కణ్నించి జమ్మూ వెళ్ళడానికి ప్లేన్ వుంది. అందులో మనం జమ్మూ వెళ్ళిపోవాలి" అన్నారు నీరసంగా.

నేనేమీ జవాబిచ్చే స్థితిలో లేను. బైట నున్న సామాను సూట్ కేసుల్లో కుక్కి, గది ఖాళీ చెయ్యకుండానే ఇద్దరం హోటల్లోంచి బైటపడ్డాం. ఖాళీ చేస్తే హోటల్ ఉద్యోగి గదిలోకి వచ్చి తనిఖీ చేస్తాడు. అప్పుడు శవం బైట పడుతుంది. గుట్టుచప్పుడు కాకుండా ఇలా బైట పడితే ఏ సమస్యా వుండదు.

టాక్సీలో_వారు సీటు వెనక తల ఆనించి కళ్ళు మూసుకుని మూలుగుతున్నారు. అనుమానం వేసి, చెయ్యి అందుకుని చూసేను. జ్వరంతో ఆయన ఒళ్ళు కాలిపోతోంది. నా గుండె దడదడమంది.

జరిగిన ఒక్కొక్క సంఘటనా, ఆయనమీద దెబ్బ తీసేయి. నీరసింప చేసేయి. ఇప్పుడేమిటి దారి?

"ఏమండీ! జ్వరంతో మీ ఒళ్ళు కాలిపోతోంది. ప్రయాణం మానుకుని ఏ నర్సింగ్ హోంకైనా వెళ్దాం!" అన్నాను దిగులుగా.

ఆయన నవ్వి- "వెర్రిదానా! ఇప్పుడు మనకు డాక్టర్ కంటే, ఈ నగరంనించి అదృశ్యం కావడం ముఖ్యం. ఈ మాత్రం జ్వరానికే అలా బెంబేలు పడక!" అన్నారు.

చేసేది లేక నోరు మూసుకున్నాను.

రాత్రి రెండు గంటల ప్రాంతంలో మమ్మల్ని జమ్మూ చేర్చింది విమానం. వారి ఫీవర్ తగ్గకపోగా ఇంకా ఎక్కువయింది. ఆడపా దడపా దగ్గుతున్నారు కూడా. రొంప పట్టిందేమో?

ఎవరెస్ట్ హోటల్ చేరుకుని ఓ గది తీసుకున్నాం. వారు సూట్ కేస్‌లోంచి రెండు స్లీపింగ్ టాబ్లెట్స్ తీసి వేసుకుని-"తల భారంగా ఉంది. కాస్త పట్టు!" అన్నారు మంచంమీద వాలుతూ.

తలుపు గడియవేసి, సూట్ కేస్‌లోంచి విక్స్ డబ్బీ తీసేను. తెల్లవారేవరకూ డాక్టర్ సహాయం దొరికే అవకాశం లేదు. అలోగా వారికి తాత్కాలికోపశమనం కావాలి.

విక్స్‌తో నుదురూ, గొంతూ మర్దిస్తూ పక్కన కూర్చున్నాను. హఠాత్తుగా వారికేదో జ్ఞాపకం వచ్చినట్టు, జేబులోంచి పిస్తోలు తీసి మంచం పక్క టీపాయ్‌మీద పెట్టి "ఏ సమయం ఎలా వస్తుందో చెప్పలేం, ఆయుధం ఎప్పుడూ అంగుబాటులో ఉంచుకోడం . మంచిది!" అన్నారు.

తలూపేను. వారు కళ్ళు మూసుకున్నారు. తలపడుతూ అలాగే కూర్చున్నారు. కాసేపటికి నిదరలోకి జారుకున్నారు. అప్పుడుగానీ నా మనసు శాంతించలేదు.

# 7

నేనూ కాస్త కునుకు తీద్దామని మంచంమీద వాలబోయేను. అప్పుడే, హఠాత్తుగా ఏదో శబ్దం వినిపించసాగింది. నా గుండె ఝల్లుమంది. ఊపిరి బిగబట్టి శబ్దాన్ని వింటున్నాను.

"బీప్... బీప్... బీప్..."

ఎక్కణ్ణించి వస్తోందా అని ఆశ్చర్యంగా చుట్టూ కలయజూసేను. అప్పుడు పడింది దృష్టి. ఆ శబ్దం ఎక్కణ్ణుంచో కాదు. మా వారి పాంటు జేబులోంచే వస్తోంది. ఆశ్చర్యంతో నా కళ్ళు పెద్దవయ్యేయి.

అదేమిటో చూడాలన్న క్యూరియాసిటీ కొద్దీ, వారికి నిద్రాభంగం కలక్కుండా మెల్లిగా జేబులో చెయ్యి దూర్చేను. ఏదో తగిలింది. బైటికి లాగేను.

అది సీక్రెట్ కేస్!

అందులోంచే వస్తోంది శబ్దం, ఇంకా!

బైటికి కనిపిస్తున్న చిన్న బటన్‌లాటిది నొక్కేను, అనుకోకుండా!

ఓ భారీ కంఠం ఇంగ్లీష్‌లో ఏదో చెప్పసాగింది.

"మిస్టర్ అక్బరలీ!

భారత గూఢచారి విభాగం నీకోసం దేశమంతా గాలిస్తోంది. ఢిల్లీ రక్షణశాఖనించి నీవు సేకరించిన రహస్య పత్రాలు జాగ్రత్త. వీలైతే నిన్ను చంపైనా సరే, ఆ పత్రాలు తిరిగి పొందడానికి భారత ఏజెంట్లు వలపన్నేరు.

సాధ్యమైనంత త్వరలో నీవు ఇండియా సరిహద్దులు దాటి మనదేశం చేరడానికి ప్రయత్నించు. నీవంటి గూఢ చారి ప్రాణం మనదేశానికి అమూల్యం!

దురదృష్టవశాత్తూ భారత ఏజెంట్లు నిన్ను పట్టుకుంటే నీవు చేయవలసిన పనేమిటో వేరే చెప్పనవసరంలేదు..."

ఆ కంఠం ఇంకా వినిపిస్తూనే ఉంది.

నా కళ్ళముందు లోకమంతా చీకటైపోయినట్టూ కాళ్ళకింది నేల పగిలి అందులో కూరుకుపోతున్నట్టూ భ్రాంతి కలిగింది. ఎంత విచిత్రం! ఇన్నాళ్ళూ నేను మన సారా ఆరాధిస్తున్న నా భర్త శత్రుదేశపు గూఢాచారా!

ఆ కంఠం వినిపించడం ఆగిపోయింది. నమ్మనట్టు, పడు కున్న అతనివైపు చూసేను. కళ్ళు తెరిచి నన్నే చూస్తు న్నాడు! నా నోట మాట పెగలడం లేదు.

కాసేపు రెప్పవెయ్యకుండా నన్ను చూసి-"ఇన్నాళ్ళూ నీకేమీ తెలీకుండా జాగ్రత్తపడ్డాను. ఇప్పుడంతా తెలిసి పోయిందన్నమాట. ఇక దాచి లాభంలేదు. ఆల్ రైట్! అంతా చెప్పేస్తాను.

కృపా! నేను పాకిస్తాన్ ఇంటిలిజెన్స్ శాఖలో పేరు పొందిన గూఢచారిని. ఒక ప్రత్యేకమైన మిషన్ మీద ఈ దేశం పంపబడ్డాను.

సారథి పేరుతో ఢిల్లీలో నివసిస్తూ ఇక్కడి రక్షణశాఖ మీద నిఘా వేసేను.

గూఢచారులు ప్రేమించకూడదు. ఎంతటి అందగత్తె తటస్థపడ్డా మనసు పారవేసుకోకూడదు. మోహపాశాలూ, ఆప్యాయతానురాగాలూ మా వృత్తిలో చెల్లవు. అటు వంటి శిక్షణ ఇవ్వబడుతుంది మాకు.

ఐనా, మొదటిసారి నిన్ను చూడగానే నా వృత్తి ధర్మాలు వదిలి మనసు పారవేసుకున్నాను. ఎక్కడో లాబ్‌లో పనిచేస్తున్నట్టు నాటకమాడుతూ నిన్ను పెళ్ళి చేసుకున్నాను.

ప్రభుత్వానికెలాగో నామీద అనుమానం కలిగింది. ఢిల్లీలో ఫూల్‌చంద్ పేరుతో మనింట్లో చేరిన వంటవాడు ఎవ్వరో కాదు. స్పెషల్ బ్రాంచి ఏజెంట్! ఆ విధంగా మనింట్లో ఉంటూ నా చర్యలు గమనించేవాడు. చాలా రోజుల తర్వాతగానీ నేనీ సంగతి పసిగట్టలేకపోయేను.

ఆ రోజు రాత్రి మనం పిక్చర్ వెళ్ళినప్పుడు, ఇంటర్వెల్లో బైటకెళ్ళి కాస్త ఆలస్యంగా వచ్చేను గుర్తుందా? బైటకెళ్ళినట్టు వెళ్ళి ఇంట్లో ఫూల్‌చంద్‌ని చంపి వచ్చేను.

తరవాత నీవు వంటింట్లో వాడి శవాన్ని చూసి పైకి పరిగెత్తుకొచ్చావ్. నేను చూసి వస్తానని కిందికెళ్ళి, వాడి శవాన్ని పెరట్లో ఉన్న డ్రైనేజీలో పడేసి నిన్ను మభ్యపెట్టేను. అప్పటికే ఢిల్లీలో నా పని పూర్తయింది. ఇక నా దేశం చేరడమే మిగిలింది. నేనొక్కణ్ణీ వెళ్ళదలచుకోలేదు. నీవు లేకుండా నేను బ్రతకలేనని నాకెప్పుడో తెలిసిపోయింది. నిన్ను మభ్యపెడుతూ ఎలాగైనా మా దేశం తీసికెళ్ళాలని ప్లాన్ అల్లేను.

ఎవ్వరో అనామకుడు ఫోన్ చేసినట్టు నీలో అనుమానం లేపి, పేపర్ కుర్రాడి ద్వారా ఆ ఉత్తరాన్ని నేనే పంపేను. దాంతో నీవు పూర్తిగా భ్రమలో పడ్డావ్.

అంత జాగ్రత్తపడి కలకత్తా ప్లేన్ ఎక్కినా స్పెషల్ బ్రాంచ్ ఏజెంట్ ఒకడు మనల్ని వెంబడించేడు. కలకత్తా చేరేక వీధిలో నీ ఫోటో తీసినట్టు నటించి టాక్సీలో పైలుదేరేను. మరో టాక్సీలో ఆ ఏజెంట్ నన్ను వెంబడించేడు

అతనిక్కావలసిందల్లా హోటల్ గదిలోని మన సామాను వెతికి, రక్షణశాఖ రహస్య పత్రాలు చేజిక్కించుకుని, తరవాత నన్ను అరెస్ట్ చెయ్యడం.

అతన్ని ఫూల్ చెయ్యడానికి ఓ స్టూడియోలో దూరేను. దాంతో అతను తృప్తిపడి తిన్నగా హోటల్ వెళ్ళేడు. మారుతాళంతో మన గదిలో ప్రవేశించేడు. అతని ఎత్తులన్నీ నేను ముందే ఊహించేను. కొద్ది సేపాగి అతని వెనకే హోటల్ వెళ్ళి చంపి, బాత్ రూంలో పడేసేను.

దురదృష్టవశాత్తూ చివరి దశలో నాకిలా ఫీవర్ పట్టుకుంది. అక్కణ్నించి మా ఆక్రమిత కాశ్మీర్‌లో ప్రవేశించడం చాలా సులభం. కృపా! నాతో వచ్చెయ్. నిన్ను కళ్ళల్లో పెట్టుకు చూసుకుంటాను. పువ్వుల్లో పెట్టి పూజిస్తాను. ఇన్నాళ్ళూ నిన్ను మోసం చేసినందుకు నన్ను మనస్ఫూర్తిగా క్షమించు. ప్లీజ్!'' అంటున్నాడు.

అతని మాటలేవీ నాకు స్పష్టంగా వినిపించడం లేదు. ఒళ్ళంతా తేళ్ళూ, జెర్రులూ పాకసాగేయి. అలనాటి ఝాన్సీ లక్ష్మి, రుద్రమదేవి, రాణి చెన్నమ్మ లిప్తపాటు మెదిలేరు కళ్ళల్లో. అప్పుడు గుర్తుకు వచ్చింది నా కర్తవ్యం ఏమిటో?

నా మాతృభూమికి నేను ద్రోహం చెయ్యను. చెయ్యలేను. రెప్పమూసి తెరిచేలోగా మంచంమీంచి కిందికి దూకి, టీపాయ్‌మీది పిస్తోలు అందుకున్నాను.

‘‘మిస్టర్ అక్బరలీ! జరిగిందానికి చింతించడం లేదు. మాతృదేశ గూఢచారివైన నిన్ను తుదముట్టించడానికే నా శీలాన్ని త్యజించేననుకుంటాను. నిన్ను అధికార్లకి పట్టించి నా కర్తవ్యం నెరవేర్చుకుంటాను!'' ఆవేశంతో నా గుండెలు ఎగిసి పడుతున్నాయి.

జరగబోయే ప్రమాదాన్ని అతను గ్రహించేడు. చిరుతలా నా మీదికి లంఘించబోయేడు. అంతే! ట్రిగ్గర్ వత్తేను. ఆగకుండా అలా వత్తుతూ పోయాను గుళ్ళన్నీ అయిపోయేవరకు. అతను కాండం నరికిన చెట్టులా, రక్తం కారుతున్న గాయాలతో కింద కూలేడు.

ఆరు గుళ్ళలో మూడు మిస్ అయ్యేయి. మూడు అతని శరీరంలో తిష్ట వేసేయి. కిందపడి విలవిల తన్నుకుంటున్నాడు. క్షణం వృథా చెయ్యకుండా ఫోన్ వైపు పరిగత్తి ఆపరేటర్‌తో స్థానిక పోలీస్ స్టేషన్‌కి లైన్ కలపమని చెప్పేను. లైన్ దొరగ్గానే వాళ్ళని తక్షణం బైలుదేరి రమ్మన్నాను.

పావుగంటలో హుటా హుటిన వచ్చేరు అధికారులు. అతనింకా కొన ఊపిరితో వున్నాడు. గుళ్ళు, ప్రాణం పోయే ప్రదేశాల్లో తగల్లేదు. తక్షణం అతన్ని హాస్పిటల్‌కి తరలించేరు. మా సామాను వెదికి, అతని సూట్‌కేస్ సీక్రెట్ అరలో ఉన్న రహస్య పత్రాలు స్వాధీనం చేసుకోబడ్డాయి.

ఈ విధంగా శిథిలమైంది నా జీవితం. అతన్ని నమ్మి గుడ్డిగా ప్రేమించేను. ఆరాధించేను. మోసపోయేను.

ప్రభుత్వం నా కర్తవ్యపారాయణతకి మెచ్చి, బంగారు పతకంతో సత్కరించింది.

ఈ సత్కారమూ, ఖ్యాతీ ఏం చేసుకోను? నా జీవితం బీడు వారింది. నా రంగుల హర్మ్యం పునాదులతో సహా కూలింది. ఈ లోటు ఎవ్వరూ పూడ్చలేనిది. తీర్చలేనిది. జీవితమనే సమరంలో నేను ఓడిపోయేను.

చిత్తుగా ఓడిపోయేను!

—: ఐ పో యి ం ది :—

# ఆడపిల్లలు - అరవై వజ్రాలు

శశిభూషణ్

కైరో నగరం శివార్లలో నైల్ నది ఒడ్డున అభిసారికలా కన్పిస్తున్నదా భవనం. దాని చుట్టుప్రక్కల ప్రాంతాల్లో వేరే ఇళ్ళు లేవు.

భవనం లోపల......

విశాలమైన ఓ గదిలో– సగం గదిని ఆక్రమించుకున్న పట్టు పరుపుమీద సుఖాసీనుడై వున్నాడు కైసర్ జమీల్. ప్రక్కనే అతని బాడీగార్డ్ బహుశః నిలబడున్నాడు. వారికెదురుగా ముగ్గురు పురుషులు, ఒక స్త్రీ ఇనుప కుర్చీలలో కూర్చున్నారు.

రాత్రి ఎనిమిది గంటలు దాటి ఎనిమిది నిముషాలైంది.

ఆ గదిలోని ప్రతి అంగుళంలోను మహమ్మదీయ

సంస్కృతి వుట్టిపడుతోంది. గదిలో పరుపు ఆక్రమించిన నేల మినహా మిగిలిన భాగమంతా ఎర్రటి తివాసీ పరచబడుంది. దానిమీద కంచు పూల కుండీ, దానిలో రకరకాల పూల గుత్తులు! మరోకవైపున్న బల్లమీద గుబాళిస్తున్న అగరొత్తుల కుండీ వుంది.

ఈజిప్ట్‌లో పేరు మోసిన స్మగ్లర్ ... కైసర్ జమీల్. ప్రభుత్వాన్ని, ప్రజలను మోసగించటానికి నూనెల వ్యాపారం సాగిస్తున్నాడు. అతని సిరిసంపదల విలువ ఈజిప్ట్ మొత్తంలో ఎవరికీ తెలియదు. చివరికి అతనికే తెలియదు. మల్టీ మిలియనీర్.

కైసర్ జమీల్ పెదవులు కదిలాయ్.

"నేడు మనం చూస్తున్న అన్ని వజ్రాలతో బాటు కోహినూర్ డైమండ్ సైతం భూమిలోంచి త్రవ్వబడి తీయబడిందే. అఫ్‌కోర్స్- ఆర్టిఫీషియల్ వజ్రాలు లేవని కాదు. ఉన్నాయ్. కాని, అసలు వజ్రాల్లా ఇవి విలువ సంతరించుకోలేవు. భూమిలో లభించే ముడి వజ్రం చూడటానికి వింతగా వుంటుంది. నల్లటి గట్టి మట్టిబెడ్డలా అనిపిస్తుంది. దాన్ని శుభ్రపరచి, సానబెట్టి, పలకలు, కోణాలు చెక్కి వజ్రంగా - విలువైన మెరిసే రాయిగా రూపొందించటం ఒక కళ.

వజ్రాల విలువ ఎక్కువగా కేరట్లమీద ఆధారపడి వుంటుంది. కేరట్లు పెరిగే కొద్దీ వజ్రం ఖరీదు కూడా పెరుగుతుంటుంది."

"జస్ట్... ఈ వజ్రాన్ని చూడండి..."

ప్రక్కనే వున్న ముఖమల్ బాలీసును వెనక్కి తోసి, దాని క్రిందున్న దంతపు పెట్టెను అందుకున్నాడు జమీల్.

పెట్టె తెరిచి, లోపల్నుంచి ఓ వజ్రాన్ని తీసి బహుగుణకందించాడు.

వజ్రం చేతులు మారింది.

“ఈ వజ్రం విలువ ఎంత వుండొచ్చు?” అడిగాడు జమీల్ ఘ్రూక్స్‌ని మార్చి మార్చి చూస్తూ.

“పదివేల పౌండ్లు చేస్తుందేమో!” అన్సారీ అన్నాడు.

“నో! ఇది అంత ఖరీదు చెయ్యదు” ఖయ్యాం నిశ్చయంగా అన్నాడు.

ట్రంబుల్ వజ్రాన్ని పరీక్షించాడు. “దీని విలువ పాతికవేల ఈజిప్ట్ పౌండ్లకు సమానంగా వుంటుంది. డిసీజ్ ట్రూ.”

వజ్రం ఆఖరుకు బాతోరి చేతికొచ్చింది. వెంటనే వజ్రాన్ని కైసర్ జమీల్ ముందు పరుపుమీద పడేలా విసిరిందామె.

“మిస్టర్ జమీల్! వజ్రాలకు సానబెట్టి ప్రకాశింపజేయటం కంటే కష్టం వాటికి విలువ కట్టడం. ఫోర్-సి థియరీ వుంది. కలర్, క్లారిటీ, కట్ అండ్ కారట్. అంటే రంగు, స్వచ్ఛత, కోత, వన్నె అన్నమాట. ఈ నాలుగు లక్షణాలను దృష్టిలో వుంచుకొని వజ్రాలకు వెల నిర్ణయిస్తుంటారు. నా అంచనా పొరపాటు కాకుంటే ఆ వజ్రం విలువ లక్ష పౌండ్లు వుండి వుండాలి!”

బాతోరిని కళ్ళతోనే అభినందించాడు కైసర్ జమీల్. “బేబీ! యు ఆర్ కరెక్ట్.”

బహుగుణ మినహా మిగిలిన ముగ్గురు మగవాళ్ళు ఆశ్చర్యపోయారు.

జమీల్ తిరిగి ప్రారంభించాడు. “ఇలాంటి వజ్రాలు

ఒక దీవిలో మరో యాభైతొమ్మిది వున్నాయ్. అవి ఆ దీవిలో ఎందుకున్నాయో చెబుతాను వినండి.

భారతదేశంలో రెండవ పారిశ్రామిక నగరంగా బొంబాయి ప్రసిద్ధి చెంది వున్నది. ప్రపంచంలో కెల్లా వజ్రాల వ్యాపారం 'అమస్టర్ డామ్'లో అధికంగా సాగుతుంది. అక్కడ మెరుగుపెట్టబడిన వజ్రాలు ప్రపంచం నలుమూలలకు చేరుతుంటాయ్.

అమ్స్టర్ డామ్ తర్వాత వజ్రాల వ్యాపార కేంద్రంగా పేర్కొనదగిన నగరం 'బొంబే'.

బొంబాయిలో అధిక సంఖ్యలో స్మగ్లర్స్ జీవిస్తూ వుండి వుండటమే అందుకు కారణం అయివుండొచ్చు.

ఒకప్పుడు బహుగుణని ఆదరించిన స్మగ్లర్ 'మంగళ్ పాండే' బొంబేలోని చెంబూర్ లో నివశించేవాడు. స్మగ్లింగ్ లో అతను రెండు చేతులా సంపాదించాడు. అతని కీర్తి దేశదేశాలకూ ప్రాకింది.

భారత ప్రభుత్వం 'మిసా'ని అమలులో పెట్టి, దేశంలోని స్మగ్లర్స్ని, బ్లాక్ మార్కెటీర్స్ని, యాంటీసోషల్ ఎలిమెంట్స్ని ఏరివెయ్యటం ప్రారంభించగానే హడలిపోయాడు మంగళ్ పాండే. దేశంలోని స్మగ్లర్లు ఒక్కొక్కరే ప్రభుత్వానికి పట్టుబడటమో, లొంగిపోవటమో జరగటం ప్రారంభించేసరికి మరింతగా బెదిరిపోయాడు.

అప్పట్లో మంగళ్ పాండేకి బాడీగార్డ్ గా వుండేవాడు బహుగుణ.

దూరదృష్టితో భారతదేశం వదిలెయ్యటానికి నిర్ణయించుకున్నాడు పాండే. తన సంపదనంతా వజ్రాల్లోకి మార్చుకున్నాడు. మొత్తం అరవై వజ్రాలు. అనుచరుల్ని

వదిలేశాడు. భార్యను, బాడీగార్డ్‌ని మాత్రం తీసుకొని, ఓ మోటర్ బోట్‌లో ప్రయాణమయ్యాడు బొంబాయి తీరం నుంచి.

ఈజిప్ట్ చేరాలని...ఐ మీన్-ఇక్కడకు చేరి, నా సహాకారంతో కొత్త జీవితం ప్రారంభించాలని పాండే ప్లాన్ వేసుకున్నాడు.

బోట్ రెడ్ సీలోకి ప్రవేశించింది. ప్రయాణం సుఖంగానే సాగింది మరో ఐదు రోజులు.

సముద్రయానంలో ఎదురయ్యేవి రెండు ప్రమాదాలు మాత్రమే. మొదటిది: తుఫాను బెడద. రెండవది: సముద్రపు దొంగల తాకిడి. నావికులకు తెల్సినంతవరకు సముద్రయానంలో ఎదురయ్యే ఘోర ప్రమాదాలు ఇవి రెండు మాత్రమే.

మంగళ్ పాండేని రెండవ ప్రమాదం చుట్టుముట్టింది. అప్పటికే చిన్న చిన్న ప్రమాదాలను ఎదుర్కొని బాగా అలసిపోయివున్నాడతను. అర్ధరాత్రిపూట హఠాత్తుగా బోట్‌ని చుట్టుముట్టిన సముద్రపు దొంగల్ని ఎదుర్కొన లేకపోయాడు. అలా అని లొంగిపోనూ లేదు.

ఫైరింగ్ జరిగింది.

సముద్రపు దొంగల్లో ఒకడు చనిపోయాడు. పాండే శరీరంలో రెండు బుల్లెట్లు జొరబడ్డాయ్.

దొంగల నాయకుడు పాండే అర్ధాంగిని బంధించాడు' తన అనుచరుని ప్రాణాలు పోయినందుకు బదులుగా, పాండే భార్యను స్వాధీనపర్చుకున్నాడు.

ఏం చెయ్యలేకపోయాడు పాండే.

బోట్ అంతా గాలించారు దొంగలు. పాండే దాచిన

వజ్రాలు వారికి చిక్కలేదు. అసలు ఆ వజ్రాల సంగతి ఆ దొంగలకు తెలియదు.

బహుగుణని, పాండేని బోట్‌లోనే వదిలి, పాండే భార్యను, దుస్తుల్ని, ఆహారపదార్థాలను, తుపాకుల్ని తీసుకొని చిన్న చిన్న డింగీల్లో వెళ్ళిపోయారు సముద్రపు దొంగలు.

యజమాని గాయాలకు మందు రాసి, కట్టుకట్టాడు బహుగుణ. చేసేది లేక ఈజిప్ట్‌వైపు ప్రయాణం ప్రారంభించారు ఇద్దరూ.

మర్నాడు తుఫాన్ మొదలైంది.

వారి ఇష్టప్రకారం కాకుండా తుఫాన్‌లో చిక్కిన బోట్ చిన్న దీవిని చేరింది. గుడ్డిలో మెల్ల మేలని సంతోషించి, తుఫాన్ తగ్గిన తర్వాత తిరిగి ప్రయాణం సాగించాలనే వుద్దేశంతో, బోట్‌ని తీరంలో వదిలి, ఇద్దరూ దీవి మీదకు చేరుకున్నారు. ఓ చెట్టు తొఱ్ఱలో తల దాచుకున్నారు.

అక్కడ మళ్ళీ ఎదురైంది ప్రమాదం.

తుఫాను నిల్చిపోయిన వెంటనే తొఱ్ఱలోంచి బయటికి వచ్చారు ఇద్దరూ. వస్తూనే తమ్ము చుట్టు ముట్టుకున్న బార్బేరియన్స్‌ని చూసి ప్రాణాలమీద ఆశ వదులుకునేశారు.

పాండే అధీనంలో నున్న వజ్రాలు ఆటవికుల స్వాధీనం అయ్యాయ్.

పాండే, బహుగుణ ఆటవికులకు బందీలుగా చిక్కారు. పాండే గాయాలకు ఆటవికులు ఏవో మందు రాశారు. ఆకు పసర్లు. అంతే. పాండే ఆ గాయాల బాధతోనే మరణిం

నాగ కనకదుర్గా బుక్ సెంటర్
రామచంద్రరావుపేట, ఏలూరు


చాడు. బుల్లెట్లు గాయాల్లోనే వుండి వుండటమే అందుకు కారణం కావచ్చు.

ఆటవిక గూడెంలో తిరగటానికి మాత్రం స్వేచ్ఛ లభించింది బహుగుణకి. విధిలేక దుర్భరమైన జీవితం గడపసాగాడు. సాటి మనుషులతో బాటే జీవిస్తున్నా వారితో మాట్లాడటానికి భాష తెలియదు. తన భాష వారికి అర్థం కాదు. ఆ గూడెంలో వున్నన్ని రోజులూ ఒంటరితనం ఫీలయ్యాడు బహుగుణ.

పాండేనుంచి స్వాధీన పర్చుకున్న వజ్రాలను మెరిసే రాళ్ళుగా మాత్రమే గుర్తించాడు గూడెం నాయకుడు. వాటి విలువ అతనికి తెలియదు. అందుకే వాటిని గూడెంలోని పదిమంది చిన్న ఆడపిల్లలకు ఒక్కొక్కరికీ ఆరు చొప్పున పంచేశాడు.

ఆ పదిమంది ఆడపిల్లలూ పదేళ్ళలోపు వయసువారే.

గూడెం మధ్యలో పెద్ద మఱ్ఱిచెట్టు వుండేది. పగలంతా ఆ మఱ్ఱిచెట్టు క్రింద చేరి ఆ మెరిసే రాళ్ళతో ఆడుకునేవారు ఆ పదిమంది ఆడపిల్లలూ.

ఆటలు పూర్తయ్యాక ఎవరి రాళ్ళను వారు జాగ్రత్తగా భద్రపరచుకునే వాళ్ళు.

బహుగుణ చివరికి ఓ రాత్రి తెగించాడు. ఓ గుడిసెలో దూరి, ఆదమరిచి నిద్రపోతున్న ఎనిమిదేళ్ళ బాలికను సమీపించాడు. ఆ పిల్ల తన వజ్రాలను తలకింద దాచుకొని నిద్రపోతుంది.

బహుగుణ ఆ పిల్లను సమీపించి, వజ్రాలను తీసుకోబోయాడు. అతని ప్రయత్నం పూర్తిగా ఫలించలేదు. ఒక్క వజ్రం మాత్రమే చేజిక్కించుకో గలిగాడు.

ఇంతలో ఆ పిల్ల కళ్ళు తెరిచింది. వెంటనే గుడిసె కూలిపోయేలా కేకలు ప్రారంభించింది. బహులుగుణ పారిపోయాడు గుడిసెలోంచి. ఇహ అక్కడ వుండటం మంచిది కాదని, ప్రాణాలకు తెగించి, కాపలావాళ్ళ కళ్ళుగప్పి అతి కష్టంమీద గూడెంలోంచి బయటపడగలిగాడు.

అటు తర్వాత ఎన్నో ప్రమాదాలను ఎదుర్కొని ఆ దీవి వదిలి, చిన్న డింగీలో కొంతదూరం ప్రయాణించాడు. అతని అదృష్టం బాగుండటంతో బొంబాయినుంచి టర్కీ వస్తున్న ప్యాసింజర్స్ షిప్ కాప్టన్ కంట్లో పడ్డాడు.

మీరు నలుగురూ ఇందాక చూసిన వజ్రం మరేదో కాదు. గూడెంలో ఆవేళ ప్రాణాలకు తెగించి బహులుగుణ సంపాదించినదే ఇది. ఇలాంటి వజ్రాలే మరో యాభై తొమ్మిది ఆ గూడెంలోని ఆడపిల్లలవద్ద నిరుపయోగంగా వుంటున్నాయ్. మీరు నలుగురూ నా బాడీగార్డ్ బహులుగుణతో కల్సి ఆ దీవి చేరుకోండి.

ప్రాణాలకు తెగించి ఆ వజ్రాలను సంపాదించండి. మొత్తం మీరు ఐదుగురు. ఒక్కొక్కరు పన్నెండు వజ్రాలు తీసుకోవచ్చు. మీ జీవితాలను ఆనందమయంగా మార్చుకోవచ్చు..." మాటలు ఆపేసి హుక్కా పట్టటం ప్రారంభించాడు కైసర్ జమీల్.

"వజ్రాల్లో మీకు భాగం అవసరం లేదా?" హఠాత్తుగా ప్రశ్నించింది బాతోరి.

చిన్నగా నవ్వాడు జమీల్. "ఈ ఒక్క వజ్రం చాలు నాకు. ఇది పోను, తన వాటాక్రింద పదకొండు వజ్రాలు తీసుకోవటానికి అంగీకరించాడు బహులుగుణ. మీ అభిప్రాయం చెప్పండి."

కైసర్ జమీల్ వంటి సహృదయులు ఈ భూమ్మీద ఎందరు వున్నారు? ఆలోచిస్తున్నాడు ట్రంబుల్.

కైసర్ జమీల్ నే చూస్తున్నాడు అన్సారీ ఆశ్చర్యంగా.

ఖయ్యాంకి అనుమానం కల్గింది_తన చెవులు సరిగా పని చెయ్యటం లేదేమోనని.

"ఓ.కె. సార్! అందరి తరపున నేను చెబుతున్నాను. మేము ఆపరేషన్‌లో పాల్గొనటానికి ఇష్టపడుతున్నాం" చెప్పింది బాతోరి.

## 2

రెడ్ సీ జలాన్ని చీల్చుకుంటూ ముందుకు దూసుకెళ్తోంది బోట్.

రాత్రి తొమ్మిది గంటలు దాటి తొమ్మిది నిమిషాలైంది. వాతావరణం ప్రశాంతంగా వుంది. ఆకాశంలో నక్షత్రాలు ప్రశాంతంగా వెలుగుతున్నాయ్. చలిగాలి వుధృతం మాత్రం అధికంగానే వుంది.

వంతుల వారీ బోట్ ని నడుపుతుండటంతో ప్రస్తుతం ఇంజన్ రూంలో బాతోరి వున్నది. మరొక్క గంట గడిస్తే ఆమెకు విశ్రాంతి ఇవ్వటానికి అన్సారి వెళ్తాడు.

కాబిన్‌లో కబుర్లు చెప్పుకుంటూ పేకాటలో మునిగి వున్నారు మగవాళ్ళు నలుగురూ.

కాలం చకచక దొర్లిపోతోంది.

పేకాటతో బాటు కబుర్లుకూడా ఆగటంలేదు.

"మిస్టర్ బహుగుణా!" హఠాత్తుగా పిలిచాడు ట్రంబుల్.

ఏమిటన్నట్లు చూశాడు బహుగుణ - ట్రంబుల్ కేసి.

"మనం గమ్యాన్ని ఎప్పుడు చేరుకుంటాము?"

"ఎటువంటి ప్రమాదాలు ఎదురు కాకుంటే మరో పది గంటల్లో ఆపరేషన్ ఐలెండ్ ని చేరుకుంటాం. అంటే రేపు పుదయానికల్లా గమ్యాన్ని చేరుకోగలమన్నమాట!"

చిన్నగా దగ్గాడు ఖయ్యాం.

అందరూ అతనివైపు చూశారు.

ఖయ్యాం పెదవులు కదిలాయ్. "మిస్టర్ బహుగుణా! మీ బాస్ కైసర్ జమీల్ ఒక విచిత్రమైన వ్యక్తిలా వున్నాడు. ఆయనవంటి స్వార్థరహితులు భూమ్మీద ఎక్కడ చూసినా కన్పించరు. అఫ్ కోర్స్ - నా కిప్పటికీ ఒక విషయం అర్థం కాలేదు."

"ఏమిటది?"

"అష్టకష్టాలు పడి ఒక వజ్రం సంపాదించ గలిగావ్. ఎలాగో ఆ దీవినుంచి పారిపోయి రాగలిగావ్. తిరిగి మనం అదే చోటుకి వెళ్తున్నాం మిగిలిన యాభైతొమ్మిది వజ్రాల కోసం. అంతవరకు బాగానే వుంది. చేతికందిన వజ్రాన్ని తిరిగి నీకిచ్చాడు మీ బాస్. అది ప్రస్తుతం నీ ఆధీనంలోనే వుందని ఇక్కడున్నవారికందరికీ తెల్సు. అతి విలువైన వజ్రం అది. దాని విలువ లక్ష ఈజిప్ట్ పౌండ్లని నిర్ణయింపబడింది. అధికార రీత్యా ఒక్క ఈజిప్ట్ పౌండ్ రెండున్నర అమెరికన్ డాలర్లకి సమానం..."

సిగరెట్ వెలిగించుకుని తిరిగి ప్రారంభించాడు ఖయ్యాం.

"అంత ఖరీదైన వజ్రాన్ని నీవు ఎందుకు దగ్గరుంచుకున్నావో నా కంతుబట్టడం లేదు. మీ బాస్ నిస్వార్థపరుడే అయివుండొచ్చు. అయినవున్నా; వజ్రాన్ని నీకిచ్చి పంపటం అవివేకం. నా అంచనా పొరపాటు కాకుంటే

ఏదో మోటివ్‌తో నీవు వజ్రాన్ని తీసుకొచ్చి వుండాలి! నా అంచనా పొరపాటు అయితే మీ బాస్‌తోబాటు నీవు కూడా ఫూల్ అని చెప్పటానికి సాహసిస్తున్నాను.''

సిగార్ వెలిగించుకుని, బలంగా దమ్ము లాగి పొగ పూర్తిగా మింగేశాడు బహుగుణ. "మా బాస్ మేధావి. ఆయన ప్రతి విషయాన్ని పలు కోణాలనుంచి చూస్తూ క్షుణ్ణంగా ఆలోచిస్తారు. ఇహపోతే, నా సంగతి. నేను మేధావిని కాకపోయినా ఫూల్‌ని మాత్రం కాదు.

పోతే, వజ్రం సంగతి. ప్రిమిటివ్ కల్చర్స్‌లో ఆచారాలు, నమ్మకాలు, అలవాట్లు బహు విచిత్రంగా వుంటాయ్. మనం వెళ్తున్నది నాగరికత తెలియని బార్బేరియన్స్ మధ్యకు. ఎంతటి అనాగరికులో అంతటి క్రూరులు ఆటవికులు. ఎంతటి కఠిన హృదయులో అంతటి పిరికివాళ్ళు.

అనాగరికుల్ని కండబలంతో, ఆయుధాలతో కాకుండా బుద్ధిబలంతో, భయపెట్టగలిగితే ఆటుతర్వాత వారి మధ్య కొన్ని రోజులు జీవించాను కాబట్టి ఆ తెగవారి జీవన విధానం అలవాట్లు పూర్తిగా కాకున్నా కొంతవరకు తెల్సుకోగలిగాను.

చింగా జాతిలో నాయకుని మాటకు తిరుగులేదు. అతని ఆజ్ఞకు కట్టుబడి వుంటారు గూడెంలో ప్రజలందరూ. మనం ఎలాగైనా నాయకుణ్ని భయపెట్టగలిగితే గూడెం మొత్తం మనకు దాసోహమంటుంది. అప్పుడు ఆడపిల్లల ఆధీనంలో నున్న వజ్రాలను స్వాధీనపర్చుకోవటం చాలా తేలిక.

మనం ఐలెండ్‌ని చేరుకున్న వెంటనే ముందట నాయ

షణ్ని కలుసుకోవాలి! మనవద్ద నున్న వజ్రాన్ని అతనికి చూపించి, దాన్ని ఆ దీవిలో పారెయ్యటానికి వచ్చామని, ఆ వజ్రం వున్న ప్రదేశంలో వర్షం ఏడేళ్ళ వరకు కురవదని చెప్పాలి! ఇంకా అవసరమైనన్ని మాటలు చెప్పి అతన్ని భయపెట్టగలిగితే మనకక్కడ గుర్తింపు లభిస్తుంది. నాయకుని అభిమానం సంపాదించగలిగామంటే ఆటు తర్వాత కార్యక్రమం గురించి ఇపుడు ఆలోచించటం అనవసరం.''

కైసర్ జమీల్ బుర్ర ఏపాటిదో అర్థమైంది క్రూక్స్‌కి.

అన్సారి చేతికున్న వాచీలో టైం చూసుకున్నాడు. తను డ్రైవింగ్ డ్యూటీలో ప్రవేశించటానికి మరొక అర గంట వ్యవధి వున్నట్టు తెల్సుకున్నాడు.

''ఖయ్యాం!'' పిలిచాడు.

''యస్?''

''సముద్రపు దొంగలతో నీవు చాలా లోతుగా స్నేహం చేశావు కదా! వారి అడ్వెంచర్స్ అంటే నాకెంతో ఇష్టం. భూమ్మీద దొంగతనం వృత్తిగా తీసుకొని జీవించే వారికంటే సముద్రపు దొంగలు ఎక్కువ సమస్యలను ఎదుర్కొంటూ వుంటారని నా అభిప్రాయం. ఆ వివరాలు నీకు ఎక్కువ తెల్సి వుంటాయ్. రెడ్ సీలో సముద్రపు దొంగల ముఠాలు మొత్తం ఎన్ని వున్నాయ్? వారి జీవన విధానం, అలవాట్లు గురించి తెల్సుకోవాలనుంది?''

''అడ్డు ప్రశ్నలు వెయ్యకుండా వినండి...'' అంటూ ప్రారంభించాడు ఖయ్యాం. అంతలో బోట్ ఆగిపోవటంతో అతను నోరు మూసుకున్నాడు.

''వాట్ హేపెండ్? బోట్ ఎందుకు ఆగింది?''

అరుస్తూ లేచాడు బహుగుణ.

మరుక్షణంలో "ధన్..." మంటూ ఎక్కడో తుపాకి పేలింది. ఆ చప్పుడు రెడ్ సీ గాలిలో ప్రతిధ్వనించింది కాసేపు.

వెంటనే ఇంజన్ రూంలోంచి బయటికి పరుగెత్తుకొచ్చింది బాతోరి.

"సముద్రపు దొంగలు మన బోట్ ని చుట్టుముట్టారు" అందామె ఎగిసిపడే రొమ్ములతో.

# 3

చిన్న చిన్న డింగీల్లో ప్రయాణించి వచ్చిన సముద్రపు దొంగలు మోటర్ బోట్ లోకి ప్రవేశించారు తుపాకులు పేలుస్తూ.

ట్రూక్స్ బ్రిగేడ్ సైతం కాల్పులు ప్రారంభించింది.

"ధన్... ధన్... ధన్... ధన్..." జర్క్ ఇస్తూ పేలుతున్నాయి రైఫిల్స్. హాహాకారాలు చేస్తూ సముద్రంలోకి విరుచుకు పడిపోతున్నారు దొంగలు. బోట్ లోకి ప్రవేశించిన వారు కాక ఇంకా కొందరు డింగీల్లోనే వున్నారు.

"ధన్..." మంటూ ఏకకాలంలో నాలుగు తుపాకులు గర్జించాయ్. డెక్ మీదనుంచి ఫైరింగ్ జరుపుతున్న అన్సారీ గుండెల్లో రెండు బుల్లెట్లు జొరబడ్డాయ్. మిగిలిన రెండూ అతనికిరువైపులా భుజాలను రాసుకుంటూ గాల్లోకి దూసుకెళ్ళాయ్.

ఆఖరు అరుపు అరవలేకపోయాడు అన్సారీ. గన్ జారవిడుస్తూ మొదలు నరికిన చెట్టులా వెనక్కు విరుచుకు పడిపోయాడు. క్షణాలమీద అతని భౌతిక దేహంనుండి ఎగిరిపోయింది జీవాత్మ.

"సవాటా!" భీకరంగా అరిచాడు ఖయ్యాం, ఒకతన్ని చూస్తూ.

ఆ కంఠాన్ని గుర్తించాడు సముద్రంపు దొంగల నాయకుడు సవాటా. "సర్దార్!" అన్నాడు ఆశ్చర్యంగా.

"భేవకూఫ్! మీ వాళ్ళను కాల్పులు విరమించమని చెప్పు!" సవాటా ముందుకొచ్చి నిల్చున్నాడు ఖయ్యాం.

వెంటనే అరబిక్ భాషలో ఏదో అరిచాడు సవాటా. మరునిముషంలో కాల్పులు నిల్చిపోయాయ్. తన సహచరులను కూడా కాల్పులు ఆపెయ్యవలసిందిగా అర్థించాడు ఖయ్యాం.

బోట్‌లో ఒక్కసారిగా నిశ్శబ్దం వ్యాపించింది.

కాబిన్‌లో ఒక ప్రక్కగా ఇద్దరు సముద్రపు దొంగలు, బహుగుణ మూలుగుతున్నారు గాయపడి వుండటంతో.

బహుగుణ ఎడమ తొడలో దూరిందొక బుల్లెట్. మరొక తూటా కుడి జబ్బలో జొరబడున్నది. గాయాల్లోంచి రక్తం నిశ్శబ్దంగా పొంగి పొరలి వస్తోంది. గాయపడని అతని కాలు, చేయి సైతం వణుకుతున్నాయ్. పళ్ళు బిగువున బాధ భరించాలని చూస్తున్నాడు. సాధ్యం కావటంలేదు. విధిలేక మూలుగుతూ బాధను భరిస్తున్నాడు.

సముద్రపు దొంగలు ఇద్దరూ తీవ్రంగా గాయపడున్నారు. ఒకడు చావు బ్రతుకుల మధ్య కొట్టుకుంటున్నాడు ఛాతీలో రెండు బుల్లెట్లు దూరి వుండటంతో. రెండోవాని డొక్కలో, మోకాలిక్రింద దూరి వున్నాయ్ తూటాలు. వాడి బాధ వర్ణనాతీతం.

"కుత్తే! నువ్వు ఎవరి బోట్ మీద దాడి చేశావో అర్థ

మైందా?'' పళ్ళ బిగువున కోపాన్ని భరిస్తూ సవాటాని వురిమి చూశాడు ఖయ్యాం.

నెమ్మదిగా ఊపిరి పీల్చి ఒక్కసారిగా వదిలేశాడు సవాటా. ''సర్దార్! మన మధ్య ఏడు సంవత్సరాలుగా సఖ్యత వుంది. ఒప్పుకుంటాను. కాని, ఇది మీ బోట్ అని నాకు తెలియదు. నిజం చెప్తున్నాను సర్దార్! తెలిసి, కావాలని దాడిచెయ్యలేదు. [illegible] ముఝే మాఫ్ కర్నా సర్దార్!''

రామచంద్ర

ఎగశ్వాస పీల్చి వదిలాడు ఖయ్యాం.

''అన్సారీ చచ్చాడు'' అప్పుడే డెక్ మీదనుంచి పరుగెత్తుకొచ్చిన బాతోరి అరిచింది.

ఖయ్యాం కోపం రెట్టింపయ్యింది. ''సవాటా! నా అనుచరుల్లో ఒకడు చచ్చిపోయాడు. మరొకతను గాయపడ్డాడు. ఇందుకు నీవు సంజాయిషీ ఇవ్వాలి!''

అప్పటి వరకు ఎలాగో కోపాన్ని ఆపుకొని గలిగాడు సవాటా.

''సర్దార్! పోరాటాల్లో గాయపడటం, ప్రాణాలు పోవటం సహజం. నా అనుచరులు ఎందరు చచ్చారో తెలియదు. నా అంచనా పొరపాటు కాకుంటే కనీసం ఐదుగురైనా మరణించి వుండాలి! ఇక గాయపడిన వారి సంగతి సరే సరి! ఇందుకు మీరు ఏం చెప్పగలరు? ఏం చెప్పలేరు సర్దార్! జరిగింది మర్చిపోదాం. అనుకోకుండా పొరపాటు జరిగింది. అందుకు చింతిస్తున్నాను. మన మధ్య నున్న స్నేహం చెదిరిపోవటం, అదే చోటులో శత్రుత్వం ఏర్పడటం నాకిష్టం లేదు. మీరు అనుమతిస్తే గాయపడిన నా అనుచరుల్ని తీసుకొని వెళ్ళిపోతాను.''

రెండు క్షణాల్లో ఒక నిశ్చయానికొచ్చాడు ఖయ్యాం.

"ఆల్ రైట్ ... వెళ్ళు. మన స్నేహం చెడటం నాకూ ఇష్టం లేదని నీకు తెలుసు. గెట్టవుట్!"

శవాలను సముద్రంలోకి పారేసి, అనుచరులను తీసుకొని వెళ్ళిపోయాడు సహాటా.

అన్సారీ శవాన్ని సీ బరియల్ కి అప్పగించారు క్రూక్స్. మెడికల్ కిట్ నుండి సిరంజి, ఇంజక్షన్ బాటిల్స్, బాండేజ్ సామగ్రి, ఆపరేషన్ కి పనికివచ్చే సామానులు తీసింది బాతోరి.

బహుగుణ శరీరంలోంచి బుల్లెట్లు తీసివేయబడ్డాయ్.

బాండేజ్ చేయటం కూడా పూర్తయ్యింది.

శక్తికోసం ఏవో కాప్సూల్స్ ఇవ్వబోయింది బాతోరి.

"వద్దు! విస్కీ ఇవ్వు" గొణిగాడు బహుగుణ.

బదులు చెప్పకుండా విస్కీ బాటిల్ సీల్ ఓపెన్ చేసి బహుగుణ కందించింది బాతోరి.

మోటర్ బోట్ తిరిగి బయలుదేరింది.

# 4

మరుసటి రోజు వుదయం ఎనిమిది గంటల ప్రాంతంలో ఆపరేషన్ ఐలెండ్ ని సమీపించింది మోటర్ బోట్.

బోట్ అలల తాకిడికి దూరంగా వెళ్ళిపోకుండా ఒడ్డునే వున్న కొబ్బరి చెట్లకు గట్టి తాళ్ళతో కట్టి, తీరం మీదకు దిగారు క్రూక్స్.

నలుగురి వద్దా ఆయుధాలతోపాటు సామానులు కూడా వున్నాయ్.

గాయాల బాధవల్ల సరిగా నడవలేకపోతున్నాడు బహుగుణ. గైడ్ గా అతనే ముందుకు వెళుతున్నాడు.

ట్రంబుల్, బాతోరి వెనుగ్గా కబుర్లు చెప్పుకుంటూ అడుగు లేస్తున్నారు.

ఖయ్యాం ఏదో ఆలోచిస్తూ బహుగుణని అనుసరిస్తున్నాడు.

పోను పోను అడవి దట్టంగా మారుతోంది. పక్షుల కిలకిలారావాలు మృదుమధురంగా విన్పిస్తున్నాయ్. నీరెండ ఆహ్లాదకరంగా వుంది.

అరగంట సాగింది ప్రయాణం.

కాలిబాట వంపులు తిరుగుతూ పోతోంది. దానికిరువైపులా ఆకాశాన్ని అందుకోవటానికన్నట్లు పెరిగున్న టేకు వృక్షాలు, చిరు శబ్దాలు వెలువరిస్తున్న వెదురు పొదలు, ఎర్రటి పూలతో కన్పిస్తున్న మోదుగు చెట్లు, ముళ్ళపొదలు, రాక్షసి కంప చెట్లు, శాఖోపశాఖలుగా విస్తరించి అరుదుగా కన్పిస్తున్న మర్రి వృక్షాలు... అడవితల్లి అందాల్ని చూడటానికి ట్రూక్స్‌కి రెండు కళ్ళు చాలటం లేదు.

సూర్యుడు నడినెత్తికి వచ్చేవరకు సుఖంగా సాగింది ప్రయాణం. కంపాస్ వుండటంతో దారి తప్పే ప్రమాదం లేదని ట్రూక్స్‌కి తెలుసు. గైడ్‌లాగా వ్యవహరిస్తున్నాడు బహుగుణ.

ఆకలి బాధ మొదలైంది.

నీరు అయిపోయింది వారి దగ్గర.

"దాహంతో నాలుక పిడచగట్టుకుపోతూంది. మొదట మంచినీరు కావాలి!" అరిచింది బాతోరి అసహనంగా.

"ఈజీ బేబీ... ఈజీ!" బహుగుణ అన్నాడు. "ఆ మలుపు తిరిగితే చిన్న చెరువు ఎదురవుతుంది. దాహంతో

బాటు లంచ్ కూడా అక్కడే పూర్తి చేసుకోవచ్చు!''

ఎదురుగా కాలిబాట వంపు తిరుగుతూంది. రెండు నిము షాల్లో నలుగురూ ఆ మలుపుని సమీపించారు.

ఎదురుగా ఒకవైపు చిన్న చెరువు దర్శనమిచ్చింది. చెరువును ఆనుకొని అడవి కన్పిస్తోంది. చెరువులో నీరు స్వచ్ఛంగా, నిర్మలంగా కన్పిస్తోంది.

అందరూ మొదట దాహం తీర్చుకున్నారు.

''లంచ్ ఏర్పాట్లు మీలో ఎవరైనా చూడండి. నేను స్నానం చెయ్యాలి!'' ఎవ్వరి సమాధానంకోసం ఎదురు చూడకుండా చెరువులో దిగింది శాలోరి.

ఆమె వెనుకే నీటిలోకి వురికాడు ఖయ్యాం.

ట్రంబుల్, బహుగుణ లంచ్ ఏర్పాట్లలో మునిగారు.

అప్పటివరకు ఒడ్డునే తుంగలో విశ్రాంతి తీసుకుంటున్న మొసలి ఒకటి నిశ్శబ్దంగా చెరువులోకి జారింది. ఆ మొస లిని ఎవరూ గమనించలేదు.

మొలలోతు నీటిలో నిల్చుని స్నానం చేస్తోంది శాలోరి.

చెరువు లోపలికంటూ వెళ్ళి, తిరిగి వెనక్కు ఈతమీద వస్తున్నాడు ఖయ్యాం. ఫ్రీగా ఈత కొడుతుంటే హాయిగా వుందతనికి.

నీటిలోకి జారిన మొసలి తన బాధ్యతను మరువలేదు.

భయంకరంగా కేక పెట్టాడు ఖయ్యాం.

ఝల్లుమంది శాలోరి శరీరం. చటుక్కున తలెత్తి ముందుకు చూసిందామె. కొద్ది కొద్దిగా మునిగిపోతున్న ఖయ్యాం కన్పించాడు.

''ఏమిటి ఏమైంది?'' అరిచినట్టు అడిగింది శాలోరి.

"ఏదో నా పాదం పట్టుకొని లోనికి లాగుతోంది..."

సామానులు వదిలి అప్పటికే బహుగుణ, ట్రంబుల్ ఒడ్డుని సమీపించారు. ఇరువురి వద్దా రివాల్వర్లు వున్నాయ్. దాదాపు ఏభై గజాల దూరంలో చెరువు నీటిలో వుక్కిరి బిక్కిరి అవుతూ మునిగిపోవటానికి సిద్ధంగా వున్నాడు ఖయ్యాం.

"వాట్స్ ది మేటర్?" అరిచాడు ట్రంబుల్.

మరుక్షణంలో ఖయ్యాం శరీరం నీటి వుపరితలంమీద కన్పించకుండా అదృశ్యమైపోయింది.

చటుక్కున మొసలి జ్ఞాపకం వచ్చింది బాతోరికి.

కెవ్వున కేక వేసి ఒడ్డుకు పరుగెత్తి వచ్చేసిందామె.

"ఖయ్యాంని మొసలి పట్టుకుని వుండాలి!" అంది దడ దడ లాడే గుండెల్ని అదుపులో పెట్టుకోవాలని చూస్తూ.

నీటిలోకి గుచ్చి గుచ్చి చూశారు మగవాళ్ళు. ఏమీ కన్పించలేదు.

మొసలికి చిక్కిన మనిషి ఏమవుతాడో తెల్సి వుండ టంతో అందరి గుండెలు బరువెక్కాయ్. అటు తర్వాత చెరువులోకి దిగే ఆలోచనైనా ఎవ్వరూ చెయ్యలేదు.

చకచక కుకింగ్ గొడవ పూర్తి చేసి, లంచ్ ముగించు కొని అక్కణ్ణుంచి బయలుదేరారు. ఖయ్యాంని మొసలి భక్షించి వుంటుందని అందరూ ఎప్పుడో ఒక నిర్ణయానికి వచ్చేసి వున్నారు.

## 5

"జుఁయ్..." మంటూ తుమ్మెద ఝుంకారాలు వంటి ధ్వనులు ఆగకుండా విన్పిస్తున్నాయ్—ఆ పొదలోంచి.

ముందు నడుస్తున్న బహుగుణ ఆ పొదని సమీపించి

టక్కున ఆగిపోయాడు. కాలిబాట ప్రక్కనే వుందా పొద.

వెనుగ్గా ఏవో కబుర్లు చెప్పుకుంటూ అడుగులేస్తున్న ట్రంబుల్, బాతోరి అదిరిపడ్డారు-బహుగుణ కేకలు విని.

సామానులు జారవిడిచి చిందులు తొక్కుతున్నాడు బహుగుణ. తుమ్మెదలంత వున్న రాకాసి దోమలు బహుగుణ శరీరాన్ని కసి కసిగా కుడుతున్నాయ్. కొన్ని అతని ముఖంమీద వాలి ఆత్రంగా నెత్తురు పీల్చుకుంటున్నాయ్.

"ఇవి రాకాసి దోమలు. ముందుకు రాకండి. ప్రమాదం. ఇవి కుడితే బ్రతికి బయట పడటం కష్టం!" అంత బాధలోనూ కేకలు మాని అరిచాడు బహుగుణ, నేల కొరుగుతూ.

ట్రంబుల్, బాతోరి వెనక్కు అడుగులేశారు. దోమలు అప్పటికింకా వారిని చూళ్ళేదు.

కొన్ని వందల దోమలు బహుగుణని బాధిస్తున్నాయ్. ఎడమ చేత్తో వాటిని తోలేస్తూ మూలుగుతున్నాడు బహుగుణ. అతని కుడిచేయి సామానులవైపు కదులుతోంది.

ట్రంబుల్, బాతోరి గుడ్లప్పగించి చూస్తున్నారు. ఏం చేయాలో వారికి తోచటంలేదు. ఒక చోట నిలువకుండా తుమ్మెదల్లా ఎగురుతున్న దోమల్ని రైఫిల్స్ ప్రేల్చి మట్టుబెట్టడం సాధ్యంకాదు. ఎన్నింటినని చంపగలరు? టార్గెట్ మిస్ అవుతుండటంతో ఫైరింగ్ వల్ల అమ్యూనిషన్ వృధా కావటం తప్ప మరొక ప్రయోజనం వుండదని వారికి అర్థమైంది.

దోమలు పొదవైపు పారిపోతున్నట్లు నటిస్తూ తిరిగి బహుగుణవైపు వచ్చి, అతని శరీరాన్ని తూట్లు పొడుస్తున్నాయ్. భయంకరమైన ఆ బాధ భరించలేకపోతున్నా

డతను. భీకరంగా మూలుగుతూనే చేతికందిన బేగ్ జిప్ లాగి, విస్కీ బాటిల్ తీశాడు. షర్టని ఒంటినుంచి తప్పించేసి, విస్కీతో తడిపాడు. తడిసిన షర్టని అగ్గిపుల్ల గీసి వెలిగించాడు.

భగ్గున అంటుకొంది షర్ట్.

మండుతున్న షర్టని ఓ ఎండుపుల్లమీద పడేసుకొని, అతికష్టంమీద లేచి నిలబడ్డాడు బహుగుణ.

మంటని చూసి వెనక్కు తగ్గాయ్ దోమలు. నిమిషంలో దోమలన్నీ ఎప్పటిలాగే తమ నివాసస్థలమైన పొదని ఆశ్రయించాయి.

వెనక్కు అడుగులేస్తూ తూలి పడిపోయాడు బహుగుణ. అతని శరీరం మిగిలిన ఇద్దరు చూస్తుండగానే ఆకాశం రంగుని సంతరించుకొంది. మండుతున్న షర్ట్ అతని ప్రక్కనే పడివున్నది.

ట్రంబుల్ ముందుకు పరుగెత్తాడు. మండుతున్న షర్టని ఎడమచేత్తో ఎత్తి దూరంగా పారేశాడు.

"మిస్టర్ బహుగుణా!" పిలిచాడు అతని ప్రక్కనే మోకాళ్ళమీద కూర్చుని. బాతోరి సైతం అతని ప్రక్కకొచ్చి నిల్చుంది.

"ఊఁ!"

"రాకాసి దోమల గురించి నాకు తెల్సింది బహు తక్కువ. నీకు ఎటువంటి మందులు వాడాలి. టెల్ మీ క్విక్!"

నేలమీదున్న తలను అటు యిటు కదిలించాడు బహుగుణ. "ఇహ నన్ను ఈ సృష్టిలోని ఏ శక్తీ బ్రతికించలేదు. నా కోసం చింతించకండి. ఇవి సాధారణమైన దోమలు కావు. అడవి ఏనుగులు సైతం వీటికి చిక్కి ప్రాణాలతో

బయట పళ్ళేవు. వీటి బెడద కీన్యా అడవులలో ఎక్కువ. ఈ దీవిలో ఇవి వున్నట్టు నాకింతవరకు తెలి... య...దు..."

మాట్లాడలేకపోతున్నాడు బహుగుణ. శ్వాసక్రియ అతి కష్టంమీద జరుపుతున్నాడు. ముఖం గుమ్మడి కాయలా ఉబ్బిపోయి వుంది అప్పటికే. చేతులు ఏనుగు పాదాల లావు ఉబ్బి భీకరంగా కన్పిస్తున్నాయ్.

"ఇహ నేను బ్రతకను. దోమలు చేసిన గాయాలవల్ల కలుగుతున్న బాధను భరించలేకపోతున్నాను. దయచేసి నన్ను చంపి ముందుకు వెళ్ళండి. దోమలు వున్న పొద ప్రక్కనుంచి వెళ్ళకుండా మీరైనా జాగ్రత్తపడండి."

"నో... నిన్ను బ్రతికించుకుంటాము" అర్చింది బాతోరి.

"అది మీ శక్తికి మించిన పని" పాంటు జేబులోకి అతి ప్రయత్నంమీద చేతి వ్రేళ్ళను పోనిచ్చి, సిగరెట్ పాకెట్ సైజులో నున్న వైర్‌లెస్ ట్రాన్స్‌మిటర్‌ని తీసి నేలమీద వుంచాడు బహుగుణ.

"ఈ ట్రాన్స్‌మిటర్‌ని తీసుకొని మీవద్ద వుంచుకోండి. అవసరమైతే మిస్టర్ కైసర్‌జమీల్‌ని 33.005 వేవ్‌లెంగ్త్‌మీద కాంటాక్ట్ చెయ్యండి. గు... డ్... బై..."

బహుగుణ తల ప్రక్కకు వాలిపోయింది.

అతి భయంకరంగా కన్పిస్తున్న శవాన్ని ఎక్కువసేపు చూళ్ళేక తల తిప్పేసుకుంది బాతోరి. శవానికి అంత్యక్రియలు గావించే ధైర్యం సైతం బ్రతుకున్నవారికి లేక పోయింది.

బాలోరి నేలమీదున్న ట్రాన్స్‌మీటర్ తీసుకొని, శవం ప్రక్కనే నిలబడున్న ట్రంబుల్ చేయి అందుకొని దూరంగా లాక్కుపోయింది.

"మనం త్వరగా ఈ ప్రదేశంనుంచి వెళ్ళాలి! లేకుంటే బహుశ కంటే హీనంగా చస్తాం."

"గమ్యం ఇంక ఎంత దూరం ఉంది?"

మేప్ తీసి చూసింది బాలోరి. ఐదు నిమిషాల తర్వాత హుషారుగా తలెత్తింది. "డార్లింగ్! ఉయార్ లక్కీ. మనం గమ్యానికి చేరువులో వున్నాం. మరో రెండు మైళ్ళు ప్రయాణించామంటే చింబా గూడెం చేరుకున్నట్లే."

ఒళ్ళు విరుచుకొని, అవసరమైన సామానులు మాత్రం తీసుకున్నాడు ట్రంబుల్.

బాలోరి బహుశ శవాన్ని సమీపించింది. శవం ముఖంలోకి చూసే ధైర్యంలేక నేల చూపులు చూస్తూ పాంటు జేబుల్లో తడిమి, చిన్న ప్లాస్టిక్ బాక్స్‌ని తీసింది. దాని లోపలున్న వజ్రాన్ని పరీక్షించి, తిరిగి బాక్స్‌లో పడేసి, బాక్స్‌ని వక్షోజాల మధ్యకు జారవిడిచింది.

అడవికి అడ్డంపడి కొంత దూరం ప్రయాణించి, పది నిమిషాల తర్వాత తిరిగి కాలిబాటను చేరుకున్నారు ఇరువురూ.

ఎదురుగా చిన్న వాగు ప్రత్యక్షమైంది.

వాగు కిరువైపులా ఏవో వృక్షాలు ఎత్తుగా పెరిగి వున్నాయే. అవి ఏజాతి వృక్షాలో ట్రంబుల్‌కి గాని, బాలోరీకిగాని అర్థం కాలేదు.

ఇద్దరూ వాగును సమీపించారు. వారి దృష్టిలో వాగు కట్టుప్రక్కన చెట్లనీడల్లో ఎగురుతున్న ఆకారాలు పడ్డాయ్.

"ఉయార్ ..."

"వెరీ లక్కీ" బాతోరి మాటల్ని పూర్తిచేశాడు ట్రంబుల్.

# 6

ట్రాన్స్‌మిటర్‌ని యాక్టివేట్ చేసింది బాతోరి.

"ఆపరేషన్ ఐలెండ్ రిపోర్టింగ్ ...ఆపరేషన్ ఐలెండ్ రిపోర్టింగ్ ..." అంది నాలుగు సార్లు.

"కైసర్ జమీల్ రిసీవింగ్. గో ఎహెడ్."

"మిస్టర్ జమీల్! ఆపరేషన్ సక్సెస్ కాబోతున్నది. మనకు కావల్సిన వజ్రాలతో 'చింబా' గూడెం ఆడపిల్లలు మాకు ఒంటరిగా చిక్కారు. గూడెం తూర్పుదిక్కున వున్న వాగు ఒడ్డునే పదిమంది ఆడపిల్లలూ వజ్రాలతో ఆడు కుంటున్నారు. వారిని మభ్యపెట్టి వజ్రాలు కాజెయ్యటం పెద్ద కష్టంకాదు. కాని..." ఆగింది.

"కాని?" అడిగాడు.

"వజ్రాలు తీసుకొని మేము తిరిగి ప్రాణాలతో కైరో చేరుకోలేము."

"వాడు యు మీన్?"

"యస్..." అంటూ అప్పటివరకు ఎదురైన ప్రమా దాల్ని గురించి చెప్పి, మృత్యువు ఎవరెవర్ని ఏయే విధంగా కబళించిందో వివరించింది బాతోరి.

"ఓ మై గుడ్‌నెస్! ప్రస్తుతం ట్రంబుల్, నీవు మాత్రమే జీవించి వున్నారన్న మాట?"

"అన్నమాట కాదు. ఉన్నమాటే అది."

"ఇట్సాల్ రైట్. నా సహాయం మీకు ఏవిధంగా అందాలో చెప్పు."

రెండు క్షణాలు మౌనంగా వుండిపోయింది బాతోరి.

"మిస్టర్ జమీల్! అరవై వజ్రాల్లో సగం మీరు తీసు కతప్పదు. మిగిలిన వజ్రాలను నేను, ట్రంబుల్ పంచు ంటాం. దయచేసి ఒక హెలికాప్టర్ తీసుకురండి. స్తుతం మేము గూడానికి సమీపంలో వున్నాం. అంటే మున్న ప్రాంతానికి చింబాగూడెం నాలుగు ఫర్లాంగుల రంలో వుంటుంది. కొండ వాలున వుందేమో... గూడెం కు బాగా కన్పిస్తోంది.

మరొక సంగతి ఇక్కడ ఓ చిన్న వాగువుంది. ఇంకా గు కివతలే వున్నాం. మీరు హెలికాప్టర్‌లో వస్తే గుకివతలే లాండ్ గావాలి! శాఖోపశాఖలుగా విస్త మున్న గొప్ప మర్రివృక్షం ఒకటుంది యిక్కడ. ఇది త గొప్ప వృక్షమంటే దీన్ని ఒకసారి చూసిన వ్యక్తి తంలో మర్చిపోలేదు. మేము వజ్రాలు చేజిక్కించు న్నాక యిక్కడున్న మర్రివృక్షం దగ్గర వుంటాం. రాకకోసం ఎదురు చూస్తుంటాం ఓవర్!"

సమాధానం కోసం ఎదురు చూడకుండా సర్క్యూట్ క్ చేసింది బాతోరి. ట్రాన్స్‌మీటర్‌ని భద్రపర్చుకొని, ల్వర్‌లో బుల్లెట్లు సరిచూసుకోసాగింది.

మర్రిచెట్టుక్రింద వున్నారు బాతోరి, ట్రంబుల్. దడ కొట్టుకుంటున్నాయ్ యిరువురి గుండెలూ.

రైఫిల్స్, ఆహారపదార్థాలున్న బేగ్‌లు, మిగిలిన కొద్ది టి లగేజి చెట్టుతొర్రలోకి చేరవేశాడు ట్రంబుల్. నూ చిన్న ఆటోమేటిక్ మాత్రం తీసుకున్నాడు.

సూర్యుడు పడమరవైపు తిరిగివున్నాడు. ఆకాశంలో ంపు, నలుపు మేఘాలు అధికంగా కదులుతుండటంతో

ఎండ వేడిమి తెలియటం లేదు. అసలు సూర్యుడే కన్పిం చటంలేదు. మేఘాల చాటున కప్పబడిపోయాడు.

అది వేసవికాలం. వాగులో నీరు అధికంగా లేదు. అక్కడక్కడ కన్పిస్తున్న చిన్నచిన్న గుంటల్లో కొద్ది పాటి నీరు కన్పిస్తోంది. మిగిలిన వాగు మొత్తం ఎండిపోయి వుంది.

"చింపాంజాతి ఆడపిల్లలు గూడేన్ని వదిలి యింతదూరం రావటం నిజంగా మన అదృష్టమే. లెట్స్ స్టార్ట్" బాతోరి చేయి అందుకొని వాగులోకి దూకాడు ట్రంబుల్.

శబ్దం చెయ్యకుండా వాగుని దాటి, ఆవలి ఒడ్డు చేరు కున్నారు యిద్దరూ. ఓ పొదచాటున నక్కి, పరిసరాల్ని మర్చిపోయి ఆడుకుంటున్న చింపాంజాతి ఆడపిల్లల్ని గమ నించారు.

మొత్తం పదిమంది ఆడపిల్లలు. హుషారుగా గెంతు తున్నారు ఎర్రమట్టిలో. కొందరు నేలమీద కూర్చొని తమ వస్త్రాలను పదేపదే లెక్కించుకుంటున్నారు. మోకాళ్ళంతులు నగ్నంగా నున్నవారి శరీరాలు నల్లగా మెరుస్తున్నాయ్. ఏదో జంతుచర్మం మొలచుట్టూ చుట్టు కొని వున్నారు. అంతకిమించి ఆ అమాయిక బాలికల శరీ రాలమీద ఎటువంటి ఆచ్ఛాదనా లేదు. అందరూ పదేళ్ళ లోపు వయసువారే.

పెద్ద జువ్విచెట్టు వుందక్కడ. దాని క్రింద ఆటల్లో మునిగివున్నారు అమ్మాయిలు. గాలి నెమ్మదిగా వీస్తోంది.

తైలసంస్కారం ఎరగని జుట్టు కళ్ళకి అడ్డం పడు తూంటే విసుగ్గా ఎడమచేత్తో వెనక్కి నెట్టుకుంటూ

ట్రంబుల్, బాతోరివున్న పొద దగ్గరగా వచ్చిందొక అమ్మాయి.

బాతోరి, ట్రంబుల్ ఊపిరిబిగించారు.

ఒంటరిగా యిటువైపు వచ్చిన ఆ పిల్ల ఒంగి, పొద మొదల్లో నేలమీద పడున్న గులకరాళ్ళు ఏరుకోవటం ప్రారంభించింది. గచ్చకాయలంత వున్న గులకరాళ్ళు మాత్రం ఏరుకుంటుంది.

బాతోరి చెవిలో ఏదో చెప్పాడు ట్రంబుల్.

అంగీకార సూచకంగా తలూపింది బాతోరి. వెంటనే శబ్దం రాకుండా యిటువైపువచ్చి, ఆపిల్ల వెనక్కా చేరింది.

తనవెనుక ఎవరో నిలబడున్నారని తెలియదు చింబా గూడెం అమ్మాయికి.

బాతోరి చేయి గాల్లోకి లేచింది. వెంటనే అది విసురుగావచ్చి ఆపిల్ల మెడను తాకింది.

కీచుమంటూ చిన్నగా అరిచి, అలాగే బోర్లా పడి పోయిందా పిల్ల-స్పృహ తప్పి.

బాతోరి చకచక ఆపిల్ల ఎడమ గుప్పిట తెరిచి చూసింది. ఆరు వజ్రాలు కన్పించాయ్. ఆత్రంగా వజ్రాలను తీసుకొని, పొదను చుట్టుకుని, ట్రంబుల్ వద్ద కెళ్ళింది.

తమ వద్దనున్న వజ్రాన్నికూడా కలిపి, జాగ్రత్తగా వాటిని పరీక్షించారు ఇద్దరూ. రెండు నిమిషాల తర్వాత తృప్తిగా తలలు పంకించారు.

"డార్లింగ్! మిగిలిన వజ్రాలను ఎలా సంపాదించటం?" బాతోరి అడిగింది.

"అదే ఆలోచిస్తున్నాను. మనవద్ద సైలెన్సర్స్ లేవు.

ఉండివుంటే అందరినీ కాల్చిపారేసి, సులభంగా వజ్రాలను స్వాధీనపర్చుకునే వాళ్ళం. రివాల్వర్స్ పేల్చామంటే ఆ శబ్దం గూడెం ప్రాంతాలకు విన్పించవచ్చు

ఒక్కరు, ఇద్దరు కాదు. తొమ్మిది మంది ఆడపిల్లలు. అందరికీ ఒకేసారి స్పృహ తప్పించలేము. మనకు చిక్కకుండా ఇద్దరు ముగ్గురైనా పారిపోవటం ఖాయం. ఒక్క ఆడపిల్ల అయినా పారిపోకూడదు. పారిపోతే దానివల్ల మనకు రెండు నష్టాలున్నాయ్. మొదటిది ఎందరు ఆడపిల్లలు పారిపోతే అన్ని వజ్రాలు తగ్గుతాయ్.

రెండు పారిపోయిన అమ్మాయిలు గూడెం చేరితే క్షణాలమీద పెద్దవాళ్ళను వెంటబెట్టుకుని వచ్చేస్తారు."

"అయితే ఏం చేద్దామంటావ్?"

"దుస్తులు విప్పేసుకో..."

"యూ డర్టీ..."

"ష్! చెప్పేది విను..." అంటూ బాతోరి చెవిలో మెల్లగా ఏదో చెప్పాడు ట్రంబుల్.

"ఓ. కె!" నవ్వింది బాతోరి. మరు నిమిషంలో ఆమె శరీరం మీదనుంచి దుస్తులు వేరయ్యాయ్. ఇంతలో వాగుకటువైపు వెళ్ళి, చెట్టు తొర్రలోంచి ఏవో కొన్ని వస్తువులు తీసుకొని వచ్చాడు ట్రంబుల్.

పూర్తి నగ్నంగా నున్న బాతోరీని చూడగానే అతని ముఖంలో రంగులు మారాయ్.

"స్టన్నింగ్ బ్యూటీ" గొణిగాడు.

అతని చెంపమీద చిన్నగా ఓ దెబ్బ వేసిందామె. "ఈ అందం శాశ్వతంగా నీ సొంతమే కాబోతున్నది కదా! కర్తవ్యం మర్చి ప్రవర్తించక!"

"ఓ. కె!...ఓ. కె!" చిన్న తువ్వాలును బాతోరి మొలకు చుట్టాడు ట్రంబుల్. నల్లటి రంగుని తువ్వాలుకి, బాతోరి ఒంటికి పులిమాడు. ఆమె కురుల్ని అస్తవ్యస్తంగా చెరిపేశాడు. ఓసారి ఆమెను పైనుంచి క్రిందకు పరీక్షించి చూసి, తృప్తిగా తలపంకించాడు.

"గుడ్! ప్రస్తుతం నీవు చింబా గూడెం స్త్రీలాగే వున్నావ్. ఇహ వెళ్ళు!" అన్నాడు నవ్వి.

నెమ్మదిగా పొద చాటునుంచి యివతలికి వచ్చింది బాతోరి.

## 7

ఆడపిల్లలు బాతోరీని వింతగా చూశారు. తమ గూడెం స్త్రీలాగే వున్నా; ఆమెను గూడెంలో ఎప్పుడూ చూడక పోవడటంతో ఆశ్చర్యంగా వుంది వారికి.

అందరినీ తన దగ్గరగా రమ్మని సైగ చేసి, జువ్విచెట్టు క్రింద చతికిలబడింది బాతోరి.

ఆడపిల్లలు అందరూ ఆమె చుట్టూ మూగిపోయారు. మొత్తం తొమ్మండుగురు.

బొడ్డులోంచి చిన్న గుడ్డసంచీ తీసింది బాతోరి. సంచీ లోంచి వజ్రాలు తీసుకొని, ఒక్కో ఆడపిల్లకు ఒక్కో వజ్రాన్ని యిచ్చింది.

బాతోరి అంటే భయంపోయింది అమ్మాయిలకు. ఒక పిల్ల తమభాషలో ఏదో అన్నది బాతోరీని చూసి నవ్వుతూ.

"నువ్వు ఏదో అన్నావ్ తల్లీ! దాన్ని అర్థం చేసుకో టానికి నాకీ జన్మ చాలదు. అయాం వెరీ సారీ!" ఆ పిల్లనే చూస్తూ నవ్వుతూ మాట్లాడింది బాతోరి.

నలుగురు పిల్లలు బాతోరి ఎదురుగా కూర్చున్నారు. వారిలో యిద్దరు తమ భాషలో ఏదో అడిగారు.

బదులు చెప్పలేదు బాతోరి. చెప్పటానికి ఆమెకు ఆ భాష అర్థమైతే కదా! తను తీసుకొచ్చినకాగితం పొట్లం విప్పింది తలాంచుకొని. ఆపొట్లంలో బిస్కట్లు వున్నాయ్. నాలుగు బిస్కట్లు.

పిల్లలు ఆసక్తిగా చూస్తున్నారు.

బాతోరి పిల్లల్ని చూస్తూ నాలుగు బిస్కట్లూ తినేసింది.

ఆడపిల్లలు ఆశగా బాతోరిని చూశారు. బాతోరి తిన్న బిస్కట్స్‌ని ఎండబెట్టిన ఆడవిదున్న మాంసం ముక్కలుగా వారు వూహించుకున్నారు.

మరొక చిన్న పొట్లం విప్పింది బాతోరి. దానిలో మరికొన్ని బిస్కట్లు వున్నాయ్. నవ్వుతూ బిస్కట్లు తొమ్మండుగురికీ పంచింది.

ఆత్రంగా అందుకున్నారు ఆడపిల్లలు. కసకస నమిలి మింగేశారు బిస్కట్స్‌ని. వాటి రుచి వారికి అసంతృప్తినే కలిగించింది.

బాతోరి యింకా బిస్కట్స్ తీస్తుందేమోనని ఆశగా చూస్తుండిపోయారు.

"బిస్కట్స్ యిహ లేవు. నేను తిన్న నాలుగు బిస్కట్స్‌లో తప్ప మిగిలిన వాటిల్లో మత్తుమందు కలపబడింది. అందరూ నిశ్చితంగా స్వృహకోల్పోండి. మీ వద్దనున్న వజ్రాలు తప్ప, మీ ప్రాణాలు నాకు అవసరంలేదు" చెప్పింది బాతోరి ఆడపిల్లల్ని మార్చి మార్చి చూస్తూ.

ఆమె మాటలు ఆ పిల్లలకు అర్థం కాలేదు.

ఇద్దరు అప్పటికే ఆవులిస్తూ వెనక్కి వాలిపోయి కళ్ళు మూసుకున్నారు. మరో ఐదునిమిషాలలో మిగిలిన వారికి కూడా స్పృహపోయింది.

భగవంతుడికి కృతజ్ఞతలు చెప్పుకొని, చకచక ఏక్షన్ లోకి దిగింది బాతోరి. స్పృహతప్పిపడున్న ఆడపిల్లల దగ్గరున్న వజ్రాలు స్వాధీనపర్చుకుంది ఐదు నిమిషాల్లో.

మొత్తం వజ్రాలు లెక్కించింది.

అరవై వజ్రాలు.

అప్పుడే గూడెం వైపునుంచి యిద్దరు చింబాజాతి స్త్రీలు ఏవో కబుర్లు చెప్పుకుంటూ జావ్వి చెట్టు వైపు వస్తున్నారు.

వారివద్ద బరిసెలు వున్నాయ్. మొలలచుట్టూ జింక చర్మాలు అలంకరించుకొనివున్నారు. వక్షోజాల మీద ఎటువంటి అడ్డూ లేదు. అడవిపూల దండలు మెడలో వేసుకొని, అలాంటి దండలనే జబ్బలకు చుట్టుకొను న్నారు. పొడవాటి వెంట్రుకల్ని వెనక్కి విరబోసుకొని అడవి దెయ్యాల్లా అతిభయంకరంగా కన్పిస్తున్నారు. నల్లటి వారి శరీరాలు తారుని గుర్తుకు తెప్పిస్తున్నాయ్.

ఆ స్త్రీల దృష్టిలో తను పడటం మంచిది కాదను కుంది బాతోరి. చెంగున ఎగిరి దూకి, ట్రంబుల్ వున్న పొద వైపు పరుగుతీసింది.

అయినా ఆటవిక స్త్రీలు బాతోరిని గమనించారు. గమనించి, వెంటనే ఆ పరిసర ప్రాంతాలు దద్దరిల్లేలా కేకలు పెడుతూ బరిశెలు ఎత్తిపట్టుకొని ముందుకు పరుగెత్తి వచ్చారు.

ట్రంబుల్ ని కలుసుకుంది బాతోరి. "లెట్స్ గో! ఆటవిక స్త్రీలు నన్ను చూసి తరుముకొస్తున్నారు" అంది గాబరాగా.

"వజ్రాలు..."

"చిక్కాయ్. హరియప్."

పడుతూ, లేస్తూ వాగు దాటి, మర్రిచెట్టు తొర్రలోకి చేరుకున్నారు ట్రంబుల్, బాతోరి. ఆటవిక స్త్రీల కేకలు యింకా విన్పిస్తూనేవున్నాయ్.

వజ్రాలను ట్రంబుల్ చేతి కిచ్చింది బాతోరి. "డార్లింగ్! మనం ప్రాణాలతో ఈ దీవి నుంచి బయట పడగల మంటావా?"

వజ్రాలను లెక్కించి, భద్రపర్చుకున్నాడు ట్రంబుల్. "బేలవు కాదు నీవు. అమాకురాలవు అంతకంటే కాదు. ఆత్మవిశ్వాసాన్ని వదలక! భగవంతుడు మనకు ద్రోహం చెయ్యడు. మొదట దుస్తులు వేసుకో!"

బదులు చెప్పకుండా దుస్తులు ధరించింది బాతోరి.

ఆయుధాలు రెడీగా పట్టుకొని తొర్రలోనే కూర్చున్నారు ఇద్దరూ. ఎటువంటి ప్రమాదాన్ని ఎదుర్కొనటానికైనా సిద్ధపడిన వ్యక్తుల్లా కన్పిస్తున్నారు ఇరువురూ.

క్షణాలు భారంగా కదులుతున్నాయ్.

వాగు కవతల జువ్వి చెట్టు ప్రాంతంలో కేకలు, అరుపులు పోను పోను అధికమౌతున్నాయ్.

# 8

దినకరుడు పడమర దిశన గూటికి చేరుకున్నాడు.

అప్పటికే 'చింబా' గూడెం ప్రజలు మర్రిచెట్టు చుట్టు ప్రక్కలున్న పొదల్ని రెండుసార్లు గాలించి వున్నారు.

మర్రి చెట్టును ఆ తెగవారు ఆరాధిస్తారు. అందుకే బాతోరి, ట్రంబుల్ దాపున్న చెట్టుని చూడగానే భక్తిగా నమస్కరించి, ముందుకు సాగిపొయ్యారేగాని, మరొక ఆలోచన చెయ్యలేదు వారు.

భాస్కరుడు పడమటి కొండల చాటుకు చేరుకున్న మరు నిమిషంలో మర్రిచెట్టుకి ఏభైగజాలదూరంలో సమ తలంగా నున్న చిన్న మైదానం వంటి ప్రదేశంలో లాండ్ అయ్యింది ఓ హెలికాప్టర్.

ఇంజన్ ఆఫ్ చేసి హెలికాప్టర్ లోంచి క్రిందకు దిగాడు కైసర్ జమీల్.

ట్రంబుల్, బాతోరి తొర్రలోంచి బయటపడి, హెలి కాప్టర్ వైపు పరుగెత్తారు.

"వాట్సది మేటర్?" అడిగాడు జమీల్.

"ఆపరేషన్ సక్సెస్!" బాతోరి అన్నది. "మిస్టర్ జమీల్! మీరు సమయానికి వచ్చినందుకు నా కెంతో ఆనందంగా వుంది. లేకుంటే ఆటవికులకు చిక్కి మేము దిక్కుమాలిన చావు చచ్చి వుండేవాళ్ళం."

"ఆటవికుల్ని ఎలాగో తప్పించుకొన్నా, అడవి ప్రయాణంలో నైనా మృత్యువు మమ్మల్ని తప్పక వరించి వుండేది. డర్టీ జంగిల్!" ట్రంబుల్ చెప్పసాగాడు.

"మిస్టర్ కైసర్ జమీల్! మీరు చాలా త్వరగా వచ్చేశారు. అందుకు నా కెంతో ఆనందంగా ఉంది. మీకు కృతజ్ఞతలు ఎలా చెప్పాలో వాలో అర్థం కావటం లేదు."

మందహాసం చేశాడు కైలాస్ జమీల్. "బాతోరి పంపిన వైర్ లెస్ మెస్సేజ్ అందిన సమయానికి నేను

పోర్ట్ సుడాన్‌లో వున్నాను. అందుకే ఇంత త్వరగా రాగలిగాను. ఇహపోతే, నాకు మీరు కృతజ్ఞతలు చెప్ప వలసిన అవసరం లేదు. ఎందుకంటే మీ రిద్దరూ చావ బోతున్నారు" మాటలు ఆపేసి, చటుక్కున కోటు జేబు లోంచి 9 ఎం. ఎం. వాల్తరు పెరాబెలూమ్ ఆటోమేటిక్ తీశాడు.

అదిరిపడ్డారు ట్రంబుల్, బాతోరి.

"యూ...యూ...మమ్మల్ని చంపుతావా? ఎందుకు?" అరిచింది బాతోరి ఒళ్ళు తెలియని కోపంతో.

రాతి విగ్రహంలా నిలబడున్నాడు ట్రంబుల్. కన్నా ర్పకుండా జమీల్‌నే చూస్తున్నాడు.

జమీల్ పెదవులు కదిలాయ్. "చావబోతున్న మీ సందేహాలను తీర్చడానికి నేను సిద్ధంగా వున్నాను. వినండి. నాకు ధనం మీద వ్యామోహం అధికం. అతి విలువైన ఆ వజ్రాలు నాకు మాత్రమే దక్కాలి! వాటిల్లో మరొకరికి వాటా పంచడానికి నేను సిద్ధంగా లేను. మర్యా దగా వజ్రాలను నా స్వాధీనం చెయ్యండి, సులభమైన చావుని ప్రసాదిస్తాను."

"యూ బ్లడీ..." మాటల కోసం తడుముకుంటోంది బాతోరి.

ఇంతలో అటుగా వచ్చిన ఒక ఆటవికుడు ఏవో అరిచి తన చేతిలోని బరిశెను కైసర్ జమీల్ గుండెలకు గురి చూసి బలంగా విసిరాడు.

అంతే! క్షణంలో జమీల్ గుండెల్లో దూరి రెండో వైపునుంచి బయటపడింది బరిశె కొస. గుడ్లు తేలేసి వెనక్కు పడ్డాడు జమీల్.

'తోరి, ట్రంబుల్ హడలిపోయారు.

డి అరుపులు విని మరో ముగ్గురు ఆటవికులు అటు పరుగెత్తుకు రాసాగారు.

ంబుల్, బాతోరి చేయి అందుకొని హెలికాప్టర్ పరుగెత్తసాగాడు. ఆటవికులు గురిచూసి బల్లాలు రు కాని, ఎక్కువ దూరంలో వుండటం వలన అవి తగలలేదు.

ంబుల్, బాతోరి హెలికాప్టర్‌ను చేరారు.

రంగా ఆటవికుల కోలాహలం విన్పించసాగింది.

కో నిమిషంలో హెలికాప్టర్ పైకిలేచి, ఈజిప్టు సాగిపోయింది.

—: ఐ పో యి ం ది :—

# "ఊరుకుంటేనే ఉత్తమం"

వసుంధర

"ఈరోజొక అద్భుత ప్రయోగం చేయబోతున్నాను సావిత్రీ-" అన్నాడు శేఖరం.

"ఏమిటండీ అది-" అంది సావిత్రి.

"మొక్కలమీద న్యూక్లియర్ రేడియేషన్ ప్రభావం. మొక్కలమీద నేను చేయబోయే ఈ ప్రయోగంవల్ల- పంట దిగుబడి బాగా పెంచవచ్చు. పంట క్వాలిటీని హెచ్చించవచ్చు. ఇంకా రకరకాల ప్రయోజనాలున్నాయి. ఏ సీజన్లోనైనా ఏ పంటైనా పండించవచ్చు."

"మీ ప్రయోగం ఏ దశలో ఉంది-" అంది సావిత్రి.

"ఇంకా గ్రుడ్డు దశలోనే ఉంది. ఈ రోజే మొదటి దశ ప్రారంభం. మా లాబరేటరీ నా గురించి కొన్ని

పొలాలు కొంది. వాటిలో నేను వేసిన విత్తులు మొక్కలై న్యూక్లియర్ రేడియేషన్ అందుకునే దశకు ఇప్పుడిప్పుడే వచ్చాయి. ఇంక నా ప్రయోగం మొదలు కావాలి. ఈ రోజే అందుకు ముహూర్తం పెట్టాను-" అన్నాడు శేఖరం.

శేఖరం-ప్రభుత్వ పరిశోధనాసంస్థలో సైంటిస్టుగా పని చేస్తున్నాడు. యూనివర్సిటీలో పీహెచ్‌డీ చేస్తున్నప్పుడు తనతోపాటు రీసెర్చి స్కాలర్‌గా ఉండే సావిత్రి నతడు ప్రేమించి పెళ్ళాడాడు. భర్త ఎంత ప్రోత్సహించినా వినకుండా-పెళ్ళి కాగానే సావిత్రి రీసెర్చికి స్వస్తి చెప్పింది.

శేఖరం భార్యకు టాటా చెప్పి-ఆఫీసుకు వెళ్ళి అక్కణ్ణించి-తన ప్రయోగాల కవసరమైన ఎక్విప్‌మెంట్‌ను వ్యాన్‌లో వేయించుకుని-నలుగురు అటెండెంట్సుని తీసుకుని బయల్దేరాడు. ఆఫీసునుంచి పొలాలకు చేరడానికి సుమారు పదిహేను నిముషాలు పట్టింది. పొలం మధ్యలో ఒక చిన్న గది ఉంది. ఆ గదికి విద్యుచ్ఛక్తి సదుపాయాలున్నాయి. శేఖరం తన ఎక్విప్‌మెంటు నక్కడికి తరలింపజేసి వ్యాన్ డ్రైవర్‌తో-మళ్ళీ ఎప్పుడు రావాలో చెప్పిపంపించేశాడు.

తర్వాత ఒకొక్క ఇన్‌స్ట్రుమెంటుకీ ఎలెక్ట్రికల్ కనెక్షన్సిచ్చాడు. నెమ్మదిగా అతని ప్రయోగాలు ప్రారంభమయ్యాయి.

శేఖరం చేయబోయే ప్రయోగాల ఫలితాలు తెలుసుకోవడానికి కొంత వ్యవధి కావాలి. అందువల్ల శేఖరం తన నోట్‌బుక్‌లో ఆ రోజు తేదీ వేసుకుని-ఏయే మొక్కలకు

ఎంతెంత ఫ్రీక్వెన్సీలో ఏయే రేడియేషన్ ఇచ్చినదీ నోట్ చేసుకోసాగాడు. అతనలా చేసుకుంటూండగా ఆకాశం హాఠాత్తుగా మేఘావృతమైంది. అతని మీద ఒకటి రెండు చినుకులు కూడా పడ్డాయి.

శేఖరానికి చిరాకు కలిగింది. మంచి పనుల కెప్పుడూ విఘ్నాలే! అతను ఇన్స్ట్రుమెంట్స్ మీద రెయిన్ ప్రూఫ్ కవర్స్ కప్పి-ఎలక్ట్రికల్ కనెక్షన్సు తీసేసి-కేబుల్సు గది లోకి మార్చేశాడు. అతనివన్నీ ముగించేసరికి ఆకాశంలో మబ్బులు తొలగి పోయి- మళ్ళీ మామూలు వాతావరణ మేర్పడింది.

“అయితే కేవలం నా ప్రయత్నానికి విఘ్నం కలిగించడం కోసమే నన్నమాట-వాతావరణంలో మార్పు వచ్చింది-నేనా లొంగేవాడిని-” అనుకుని శేఖరం ఉత్సాహంగా మళ్ళీ ఎలక్ట్రికల్ కనెక్షన్సు ఇచ్చి తన ప్రయోగాలు ప్రారంభించాడు. అతని ప్రయోగం జరుగుతుండగా మళ్ళీ ఆకాశం మేఘావృతమైంది. అతని మీద ఒకటి రెండు చినుకులు పడ్డాయి.

శేఖరానికి చాలా చిరాకు వేసినా చేయగలిగినదేమీ లేదు. అతను మళ్ళీ ఇందాకటిలాగే ఇన్స్ట్రుమెంట్సు డిస్కనెక్టు చేసి వచ్చేసరికి-వాతావరణం మళ్ళీ మామూలై పోయింది. పట్టువదలని విక్రమార్కుడిలా శేఖరం తన ప్రయోగాలు మళ్ళీ ప్రారంభించాడు. అయితే మళ్ళీ ఇందాకటిలాగే జరిగింది.

అంతేకాదు-అలా ఆయిదారుసార్లు జరగడంలో శేఖరానికి చిన్న అనుమానం కూడా వచ్చింది. తన ప్రయోగాలకూ - వాతావరణంలోని ఈ మార్పుకూ ఏమీ

సంబంధం లేదుకదా అని! ఎందుకంటే ప్రయోగం ఒక దశకు వచ్చే సరికి వాతావరణంలో మార్పు వస్తోంది. ప్రయోగం ఆపివేయగానే వాతావరణం మామూలై పోతోంది.

శేఖరం దీక్షగా తను నోట్ చేసుకున్న రీడింగ్సువైపు చూశాడు. వాటిలో అతను ప్రయోగం ఎప్పుడెప్పుడు ఎక్కడెక్కడ ఆగిందీ నోట్ చేసుకున్నాడు. ఆ విషయం చూడగానే శేఖరం ఆశ్చర్యానికి అంతులేదు. ప్రతిసారీ కూడా గామా రేడియేషన్ ఒక పర్టిక్యులర్ ఫ్రీక్వెన్సీలో వదిలినప్పుడు ప్రయోగం ఆగిపోయింది.

శేఖరానికి ఉత్సాహం వచ్చింది. ఈసారి అతను అదే ఫ్రీక్వెన్సీలో గామా రేడియేషన్ అప్లై చేసి చూశాడు. కానీ వాతావరణంలో మార్పు రాలేదు. అయితే ఇందాకటి మార్పు కాకతాళీయమై ఉండాలని సరిపెట్టుకుని మళ్ళీ తన ప్రయోగాన్ని ప్రారంభించాడు శేఖరం.

అక్కడ పదేసి మొక్కలు ఒక వరస చొప్పున పాతబడి ఉన్నాయి. శేఖరం మొదటి మొక్క దగ్గర ప్రారంభించి ఫ్రీక్వెన్సీలు మార్చుకుంటూ రేడియేషన్ అప్లై చేస్తున్నాడు. ఇంతవరకూ అతను వరస పూర్తి చేసినపుడల్లా వాతావరణంలో మార్పు వచ్చింది. కానీ తన ప్రయోగానికీ వాతావరణంలో మార్పుకీ సంబంధం లేదని గ్రహించిన శేఖరం నెమ్మదిగా మళ్ళీ ఇంకో వరస మొదలు పెట్టి పూర్తి చేసేసరికి—వాతావరణంలో ఇందాకటిలాగానే మార్పు వచ్చింది.

శేఖరం బుర్రలోని సైంటిస్టు పని చేయసాగాడు. ఖచ్చితంగా తన ప్రయోగాలకీ—ఈమార్పుకీ సంబంధముంది. ఎటొచ్చీ తను సరిగ్గా ఆలోచించలేక పోతున్నాడు.

అతను తన నోట్ బుక్ దగ్గర పెట్టుకుని రకరకాలుగా ఆలోచించసాగాడు. హఠాత్తుగా అతనికి స్ఫురించింది. వాతావరణంలో మార్పురావడానికి కారణం—రేడియేషన్ ఒక పర్టిక్యులర్ ఫ్రీక్వెన్సీలో వెళ్ళడం కాదు. సీక్వెన్స్. పది రకాల ఫ్రీక్వెన్సీలు—తను అప్లై చేసిన సీక్వెన్స్‌లోనే వేసుకుంటూ వెడితే ఈ మార్పు వస్తూ ఉండవచ్చు.

ఇది నిజమో కాదో తెలుసుకునేందుకతను రకరకాల సీక్వెన్సులు మార్చి ప్రయోగాలు చేశాడు. వాతావరణంలో మార్పు రాలేదు. కాని తనిందాకటినుంచే అప్లై చేస్తున్న సీక్వెన్సు ఫాలో అయితే ఏదో ఫ్రీక్వెన్సీ దగ్గరకు వచ్చే సరికి మేఘాలు వర్షించేస్థితికి వచ్చాయి. ఆ సీక్వెన్సునే ఫాలో అవుతూ ఫ్రీక్వెన్సీంకా పెంచుకుంటూ పోతే—వర్షం బాగా ఉధృత మవుతుందని కూడా శేఖరానికి తట్టింది.

అదే నిజమైతే—తనొక కొత్త విశేషాన్ని కనుగొన్నట్లు లెక్క! కావాలనుకున్నప్పుడు వాన కురిపించగల శక్తి తను సంపాదించాడు. అంతేకాదు కోరినంత సేపు మాత్రమే వాన కురిపించగల శక్తి కూడా తనకుంది. తను ప్రయోగాన్ని ఆపే ఫ్రీక్వెన్సీ నంబరుని బట్టి—వర్షం కురసే వ్యవధి ఉండవచ్చు, కానీ అందుకు మరికొన్ని ప్రయోగాలు చేయవలసి ఉంటుంది.

శేఖరం అనుమానం—కేవలం రేడియేషన్ ఒక్కటే ఈ విశేషానికి కారణం కాదని, బహుశా తను నాటిన ఈ మొక్కలు కూడా అందుకు దోహదం చేస్తూండవచ్చు. లేదా ఈ ప్రాంతపు వాతావరణం కూడా అందుకొక్క—రణం కావచ్చు. ఈ విషయంలో ఒక నిర్ణయానికి వచ్చే ముందు తనింకా చాలా ప్రయోగాలు చేయాల్సుంటుంది.

శేఖరం త్వరత్వరగా తన ఆలోచనలన్నీ కాగితం మీదకు ఎక్కించసాగాడు.

## 2

"మీదీ మీ వారిదీ ఒకే సబ్జెక్టు కదా—మీరూ ఉద్యోగంలో చేరి మీ వారికి సహకరించరాదూ" అంది అరుణ.

"నేను విజ్ఞానం కోసం చదువుకున్నాను. నేను ఉద్యోగం చేస్తే మరికాస్త డబ్బు సంపాదించ వచ్చు ననుకోండి. ఉద్యోగం చేసే ఆడది—సరైన సంసార జీవితాన్నివ్వలేదు. అవసరమున్నప్పుడు తప్పదు. అవసరం లేనప్పుడు ఉద్యోగం చేయడమెందుకు చెప్పండి!" అంది సావిత్రి.

"మీ రింకా చాలా పాతకాలంలో ఉన్నారు. ఆడవాళ్ళిప్పుడు ఇతర గ్రహాలక్కూడా పోతున్నారు" అంది కరుణ.

"కాదని నేనలేదు. కానీ భగవంతుడు ఆడదాన్ని బలహీనంగా, సుకుమారంగా సృష్టించాడు. ఎంతో ఓర్పునూ, త్యాగబుద్ధినీ ఇచ్చాడు. ఇవన్నీ ఉపయోగించి ఆడది ఒక ఆహ్లాదకరమైన వాతావరణానికి తాను రాణియై—తనకు చెందిన వాళ్ళందరినీ పరిపాలించాలి. అలా జరగనప్పుడు — ఇప్పుడొచ్చిన మోడ్రన్ డెవలప్ మెంట్సు వాతావరణాన్ని కలుషితం చేస్తున్నట్లే— మెంటల్ పొల్యూషన్ వస్తుంది." అంది సావిత్రి. "క్షమించాలి. ఇది కేవలం నా అభిప్రాయం" అంది మళ్ళీ.

కరుణ నవ్వి "పోనీ—కనీసం మీ వారితో పరిశోధనల గురించేనా చర్చిస్తున్నారు. అదీ ఒకందుకు నయమే—" అంది.

సావిత్రి కూడా నవ్వి అన్ని విషయాలలో లాగే ఇదీ తనకు తెలిసిన సబ్జక్టు కాబట్టి భర్తకు సలహాల నిస్తున్నానని చెప్పి భర్త ఆ రోజు చేస్తానన్న ప్రయోగం గురించి చెప్పింది. "ఎందుకో. ఈ విషయంలో నా భర్త గొప్ప డిస్కవరీ చేస్తారని నాకు చాలా నమ్మకంగా ఉంది" అని కూడా అంది.

కరుణ నవ్వి "మీవా రదృష్టవంతులు. నాకు మావారి మీద అంత నమ్మకం లేదు" అంది.

"మీకు లేకపోతేం లెండి_మీరు కాదన్నా మీ వారి సామర్థ్యం చూసేవాళ్ళకు కనిపిస్తూనే ఉందిగా" అంది సావిత్రి.

కరుణ భర్తకు కారుంది. వాళ్ళ ఇల్లు సావిత్రి ఇంటికి పక్కనే ఉన్నా-చూడగానే గొప్ప వాళ్ళ ఇల్లని తెలిసి పోయేలాగుంటుంది. వాళ్ళింట్లో ఫర్నిచర్ ఖరీదైనదిమాత్రమే కాక ఎంతో అందమైనది, అద్భుతమైనది. ఇంట్లో ఎప్పుడూ ఇద్దరూ ముగ్గురు పని వాళ్ళుంటారు. కరుణకు అంతస్థు ఉన్నా గర్వం లేదు. ఆమె చాలా సింపుల్ గా ఉంటుంది. ఆమె స్నేహం సావిత్రి లాంటి వాళ్ళతోనే!

కరుణ వెళ్ళిన అరగంటకు శేఖరం ఇంటికి వచ్చాడు. వస్తూనే అతను సావిత్రి మీద తన ఉత్సాహాన్ని ప్రదర్శించాడు.

"ఏదో జరిగింది. లేకపోతే..." అంది సావిత్రి ఉత్సాహంగా.

"అవునోయ్_ఈ రోజు నేను చేసిన దొకటైతే సాధించినది మరొకటి" అంటూ సింపుల్ గా టూకీగా తన ప్రయోగం వివరాలా మెకు చెప్పాడు. సావిత్రి అంతావిని

ఆశ్చర్యంగా "అంతా బాగానే ఉంది కానీ ఆ రేడియేషన్ కు మగవారి మీద కూడా ఏదైనా ప్రభావం చూపించగల శక్తి ఉందేమో చూడండి. లేకపోతే ఈ మధ్య కాలంలో మిమ్మల్నింత ఆవేశంగా చూడలేదు" అంది.

"ఈ రేడియేషన్ వేరు. అది నీ కళ్ళల్లోంచి వస్తుంది. అంతేకారణం" అన్నాడు శేఖరం. అతను ఉత్సాహంగా ఉన్నాడు.

శేఖరం దేశంకోసం ప్రాణాలు త్యాగం చేసేటంత దేశ భక్తుడు ఔనో కాదో తెలియదుకానీ దేశానికి ఉపకారం జరిగే పని తన వల్ల నవుతుందంటే ఆనందం పొందేటంత భక్తి మాత్రం అతనికుంది. తన ఈ ప్రయోగం ఫలిస్తే దేశం సస్యశ్యామలమై పోతుంది. పేదరికం మాడి పోతుంది. ఎక్కడ కావాలంటే అక్కడ ఎంత కావాలంటే అంత ఎప్పుడు కావాలంటే అప్పుడు వాన కురుస్తుంది. అతివృష్టిని నివారించలేకపోయినా అనావృష్టిని నివారించడానికి తన ప్రయోగం పనికి వస్తుంది.

శేఖరానికా రాత్రి నిద్రపట్టలేదు. మర్నాడు తను చేయదల్చుకున్న ప్రయోగాల గురించి ఆలోచిస్తూంటే అతనికి నిద్ర రావడం లేదు. సావిత్రి మాత్రం మధ్య మధ్యలో మెలకువ వచ్చినపుడల్లా—"ఇంకా మీకు నిద్ర పట్టలేదా" అంటూందేది. ఒక దేశపు భవిష్యత్తునే మార్చివేయగల ప్రయోగం గురించి ఆలోచిస్తూన్న శేఖరానికి నిద్రపట్టక పోవడంలో ఆశ్చర్యం లేదు.

మర్నాడు సావిత్రి నిద్ర లేస్తూనే—"రాత్రి మీకు నిద్ర పట్టినట్లు లేదు. మీకూ నిద్రపట్టనప్పుడు నన్ను నిద్ర పోనివ్వడం ఇదే మొదటిసారి. ఆ రేడియేషన్లో ఏదో ఉంది బాబూ" అంది.

"అదే తేలుస్తాను" అన్నాడతను. అతను త్వరత్వరగా కాలకృత్యాలు తీర్చుకుని టిఫిన్ తిని ఆఫీసుకు బయలుదేరి వెళ్ళాడు. ఆఫీసులో శేఖరాన్ని బాస్ పిలిచి, "ఈ రోజు ఫీల్డులోకి వెళ్ళవద్దు. కొంత పేపర్ వర్కు చేయాలి" అన్నాడు.

తను నిన్న కనుగొన్న ప్రయోగ ఫలితాల గురించి చెప్పాలా కూడదో అనుకున్నాడు శేఖరం. వాటిని ధృవ పర్చుకునే వరకూ బాస్‌కు చెప్పడం మంచిది కాదనిపించి ఊరుకున్నాడు శేఖరం. ఆ రోజు ఫీల్డులోకి వెళ్ళడానికి వీలుకానందుకు శేఖరానికి నిరుత్సాహం కలిగింది. కానీ ఏం చేసేది ఇండియాలో రీసెర్చి ఇంతే, సగానికి పైగా పేపర్ వర్కే!

మధ్యాహ్నం మూడున్నరకు శేఖరానికి ఫోన్ వచ్చింది. బహుశా ఇంటి దగ్గర్నుంచే అయ్యుంటుందనుకున్నాడు శేఖరం. కానీ ఫోన్‌లో ఎవరిదో పురుష వ్యక్తి కంఠం వినిపించింది.

"మాట్లాడేది శేఖరం గారేనా?"

"అవును-శేఖరాన్నే మాట్లాడుతున్నాను."

"కంగ్రాజ్యులేషన్స్ శేఖరంగారూ మీరింక ఉద్యోగం చేయనవసరం లేదు. అయినా లక్షాధికారయ్యేక ఉద్యోగం మీరెందుకు మాత్రం చేస్తారండి?" అన్నాడు అవతలి వ్యక్తి.

"హలో! మీరే శేఖరంతో మాట్లాడుతున్నారో తెలుసా?"

"తెలుసండీ? మీ లాబరేటరీలో శేఖరం పేరుగల సైంటిస్టు ఒక్కరేకదా ఉంట" అన్నాడు అవతలి

వ్యక్తి. "ఇంకా మేము పొరబడుతున్నామని మీ కను మానంగా ఉంటే మరికొన్ని వివరాలివ్వగలను. మీ భార్య పేరు సావిత్రి. చాలా?"

శేఖరానికి కొద్దిగా భయంవేసింది. "ఇంతకీ మీరు నా కెందుకు ఫోన్ చేశారో చెప్పగలరా?" అన్నాడు.

"నిన్న మీరు సాధించిన అద్భుత ఫలితముంది చూడండి. అదే వాతావరణంలోని మార్పు గురించి. ఆ సందర్భంలో మీతో మాట్లాడాలి."

"ఏం మాట్లాడుతారు?"

"ఇప్పుడు చెప్పను. ఇంటికి వెళ్ళండి. మీ భార్య చెబు తుంది!"

"నా భార్య మీకెలా తెలుసు?" అడిగాడు శేఖరం. సమాధానంగా అవతల క్లిక్కుమంది.

## 3

శేఖరానికి మనసు మనసులో లేదు. అతనాఫీసులో ఏ పనిమీదా దృష్టి నిలపలేకపోయాడు. తనకు ఫోన్ చేసిన దెవరు? నిన్న తను చేసిన ప్రయోగం గురించి అతనికెలా తెలిసింది?

ఎవరో తనింటికొచ్చి ఉండాలి. మాటల సందర్భంలో సావిత్రి అతనికి తన ప్రయోగం గురించి చెప్పి ఉండాలి. అతనికీ విషయంమీద బాగా ఆసక్తి ఉండి ఉండాలి. అందుకే వెంటనే తనకు ఫోన్ చేశాడు. అయితే ఫోన్ చేయడమెందుకు?

శేఖరం మనసులో ఇంకా ఒకటి రెండు ప్రశ్న లున్నాయి. తన భార్యదగ్గర చనువుగా మాట్లాడగలిగిన ఆ మగాడెవరు? అతనికి ఈ పరిశోధనమీద కుతూహల

మెందుకు? కుతూహలమున్నవాడు—తిన్నగా లాబరేటరీకి రావచ్చు. లేదా సాయంత్రం తనింటికి వచ్చేవరకూ ఎదురు చూడవచ్చు. ఈ రెండు కాకుండా ఫోన్ చేశాడంటే ఏదో రహస్యముండి ఉండాలి.

ఓ పావుగంట ముందుగానే శేఖరం ఇల్లు చేరాడు. అతను చేరే సమయానికిల్లు తాళం వేసి ఉంది. శేఖరం ఆశ్చర్యపడ్డాడు. అతనికి కొద్దిగా భయంకూడా వేసింది.

అతనింకా ఆలోచనలో ఉండగానే ఎవరో అతన్ని పిలిచారు. శేఖరం వెనక్కి తిరిగాడు.

"నా పేరు రాజయ్యండి. పక్కింట్లో నౌకర్నండి కరుణమ్మగారు మీకీ ఉత్తరమిమ్మన్నారండి. ఇది సావిత్రమ్మ బయటకు వెడుతూ మీకిమ్మని చెప్పి ఇచ్చారుటండి" అని ఓ కవరు శేఖరం చేతికిచ్చి వెళ్ళిపోయాడు.

శేఖరం కవరు చించి అందులోంచి ఉత్తరం పైకి తీశాడు.

"డియర్ శేఖరం—

ఈ కవరు నీచేతి కందగానే జాప్యం చేయకుండా రవీంద్ర కాలనీకి బయల్దేరు. అక్కడ సిటీబస్ స్టాపుదగ్గర చేతిలో ఆకుపచ్చ జేబురుమాలు పట్టుకున్నమనిషి దగ్గరకు వెళ్ళి నీ పేరు చెప్పు. అతను తీసుకువెళ్ళిన చోటికి వెళ్ళు. శుభమవుతుంది.

వెళ్ళకపోతే నీ భార్య ఏమవుతుందీ చెప్పడం అనవసరం. కానీ ప్రస్తుతం ఇంట్లో ఆమె లేదనీ—అందు కారణం మేమనీ గుర్తుంచుకో.

ఇందులో నీకుగానీ నీ భార్యకుగానీ ప్రమాదమేమీ లేదు. మా దగ్గరకు రాగానే ఇంత చిన్న విషయానికింత

డావుడి చేశామేమిటని ఆశ్చర్యపోతావు. నీకేమాత్రమూ
ం కాకుండా— అనుకోని అరిక లాభం కలిగించే
యోభిలాషులను నువ్వు కలుసుకోబోతున్నావని
రుంచుకుంటే చాలు మాకు.
ఉంటాము మరి— వస్తావు కదూ!

నీ శ్రేయోభిలాషి.''

శేఖరం ఉత్తరాన్ని జేబులో పెట్టుకుని వెనక్కి తిరి
డు. ఏం జరిగిందో, ఏం జరగబోతోందో అతనికి అర్థం
క అయోమయంగా ఉంది. కానీ తన భార్య ఇంట్లో
నీ ఆమె ఎవరో పరాయివారి చేతుల్లో పడిందనీ అత
తెలుస్తోంది.
అతను సిటీబస్ ఎక్కి రవీంద్ర కాలనీ వద్ద దిగాడు.
క్కడున్న ఒకతని చేతిలో పచ్చ జేబురుమాలుండడం
మనించి తిన్నగా అతని వద్దకు వెళ్ళి ''నా పేరు శేఖరం''
న్నాడు. అతను నవ్వి ''నాతోరండి'' అన్నాడు.

శేఖరం కదిలాడు. ఇద్దరూ కలిసి సుమారు ఒక కిలో
ాటరు దూరం నడిచి ఒక ఇంటి దగ్గరకు వెళ్ళి ఆగారు.
''ఈ ఇంట్లోకే మనం వెళ్ళాలి'' అన్నాడు పచ్చ
మాలతను. శేఖరం అతన్ననుసరించాడు.

ఇంటికి వీధరుగులున్నాయి. ఒక అరుగు మీద చిన్న
ది ఉంది. ఆ గది తలుపులు తీసి ఉన్నాయి. శేఖరం ఆ
దిలోకే వెళ్ళాడు. ఆగదిలో మొత్తం నలుగురు కూర్చుని
ాడుతున్నారు. వారిలో ఒకడు శేఖరాన్ని చూసి
వ్వి ''వచ్చేరా రండి కూర్చోండి'' అన్నాడు.
అక్కడ ఒకేఒక కుర్చీవుంది. అది ఖాళీగావుంది.
ాడుకునేవారంతా క్రింద కూర్చుని ఆడుతున్నారు.

శేఖరం సందేహిస్తూనే ఆ కుర్చీలో కూర్చున్నాడు.

శేఖరాన్ని పలకరించిన తను ఆట ఆపివేసి "ఫ్రెండ్స్ ఈ వేళ్టికిక ఆటలేదు మీరు వెళ్ళవచ్చు" అన్నాడు అతను. అందరికీ తలో వందకాగితమూ ఇచ్చాడు. పచ్చరుమాలు వ్యక్తికికూడా వందరూపాయలు అందింది. అందరూ బయటకు వెళ్ళిపోయారు. శేఖరమూ అతనూ ఇద్దరే మిగిలారు. అతను గుమ్మందాకా వెళ్ళి తలుపులు వేసివచ్చి "నన్ను మీ శ్రేయోభిలాషిగా గుర్తుంచుకోండి" అన్నాడు.

"అలాగే కానీ మీరెవరో నన్నెందుకు పిలిపించారో నా భార్య ఏమయిందో తెలుసుకోగోరుతున్నాను—" అన్నాడు శేఖరం.

"నేనెవరో మీకు చెప్పనవసరం లేదు. తెలుసుకుందుకూడా ప్రయత్నించకండి. ఈ ఇంటివారు ఈవీధిగదిని సుందరం అనే కుర్రాడికద్దెకిచ్చారు. నెలకి యాభైరూపాయలు అద్దె యిస్తున్నాడతను. ఒక్క రోజుకు వందరూపాయలు అద్దె యిచ్చాను నేను. ఈ రోజుకిది నాస్వంతమయింది. ఇందాకా నా దగ్గరున్నవారెవ్వరూ నాకు పరిచయస్థులు కారు. వందరూపాయలు చొప్పున యిచ్చి తాత్కాలికంగా వారి పరిచయాన్ని కొనుక్కున్నాను. నేనసలు ఈ ఊరివాణ్ణేకాను—ఇవన్నీ ఎందుకు చెబుతున్నానంటే ఉనికి యితరులకు తెలియకుండా నేను చాలా జాగ్రత్తపడుతున్నానని మీకు తెలియడంకోసం" అని ఆగేడతను. "ఇది మీ మొదటి సందేహానికి జవాబు—మీ మూడవ సందేహం మీభార్య గురించి. ఆమె చాలా క్షేమంగావుంది. ఏమీ దిగులుపడనవసరంలేదు మీరామె గురించి—ఇకపోతే మీ రెండవ సందేహం..." అని ఆగేడతను.

శేఖరం అతనివంకే పరీక్షగా చూస్తున్నాడు. బాగా పరీక్షగా చూస్తే అతను మేకప్‌లో వున్నాడని అనుమానంగా ఉంది. అతనెవరై వుంటాడా—ఏం చెప్పదల్చుకుని వుంటాడా అని శేఖరం ఆలోచిస్తున్నాడు.

"మీకో సామెత తెలుసుననుకుంటాను. ఊరికున్నంత ఉత్తమం లేదు—బోడిగుండంత సుఖం లేదు...అని. అది మీపట్ల నిజం కాబోతుంది. వాతావరణంలో మార్పులు తేగల ప్రయోగాలు చేయడం మీరు మానేయాలి. ఇంతవరకూ చేసిన ప్రయోగాల సంగతి కూడా ఎవరికీ చెప్పకూడదు..." అన్నాడతను.

శేఖరం ఆశ్చర్యంగా అతనివంక చూసి "ఈ ప్రయోగమింకా నిన్ననే చేశాను. అప్పుడే మీదాకా ఎలాగ వచ్చింది?" అన్నాడు.

"దాన్ని బట్టయినా నా సామర్థ్యం అర్థం చేసుకోవాలి నాక్కావలసిన సమాచారం క్షణాలమీద తెలుసుకోగలను."

"బాగానే వుంది కానీ, ఈ ప్రయోగాలు నేను మానేయడమెందుకు? దీనివల్ల పదిమందికి కూడు దొరుకుతుంది దేశం సుభిక్షమౌతుంది" శేఖరం ఏదో అనబోతూండగా అతను ఆపి—

"ఎందుకు అన్న ప్రశ్న నేను సహించను. నా ఆజ్ఞకు ఎదురుండకూడదు. చెప్పినట్లు వింటే అందుకు మంచి ప్రతిఫలం కూడా వుంటుంది" అన్నాడతను.

"వినకపోతే..."

"ముందుగా సావిత్రి మరణిస్తుంది. అదీ మామూలు చావుకాదు. అమానుషంగా చెరచబడి—హత్య చేయబడు

తుంది'' అతను చాలా తాపీగా అన్నాడు కానీ శేఖరం మాత్రం వణికిపోయాడు. ఇంతవరకూ లేని కొత్త భయం అతనిలో ప్రవేశించగా ''అయితే యిప్పుడు నేనేం చేయాలి?'' అన్నాడు.

అతను శేఖరాన్ని చూసి నవ్వి ''వయసులోవున్న యువకులు మీరు. అందమైన భార్యను పొందగలిగిన అదృష్టవంతులు. హాయిగా జీవిత మాధుర్యం చవిచూడక ఎందుకు పరిశోధనలతో సమయాన్ని వృధా చేసుకుంటారు? వెంటనే ఉద్యోగానికి రాజీనామా యివ్వండి. మీ పరిశోధనల గురించీ సైంటిస్టు జీవితం గురించీ మర్చిపోండి. ప్రతిఫలంగా మానుంచి ఐదులక్షలరూపాయలు పొందండి'' అన్నాడు.

అతను చెప్పేదంతా అర్థంచేసుకునేందుకు శేఖరానికి కాస్త టైంపట్టింది. అర్థమయ్యేక ''మీరు చెప్పినట్లే వింటాను కానీ నేను సామాన్యుడిని. హఠాత్తుగా ఐదు లక్షల రూపాయలు నా దగ్గర చేరితే అంతా అనుమానిస్తారు గదా'' అన్నాడు.

అతను నవ్వి ''నేను మీ శ్రేయోభిలాషిని. మీకే యిబ్బందీ రానివ్వను. బహుమతి పొందిన లాటరీ టికెట్ మాదగ్గర సిద్ధంగా వుంది. అది మీకిస్తాను. అది మార్చుకుని డబ్బు తెచ్చుకున్నాక నే మీరుద్యోగానికి రాజీనామా ఈయవచ్చును. బహుమతి మొత్తం ఎనిమిది లక్షలు. టాక్స్‌పోగా ఐదులక్షలు పైగానే వస్తుంది'' అంటూ జేబులోంచి ఓ కాగితం తీసి అతనికిచ్చాడు. అది లాటరీ టికెట్టని శేఖరం గుర్తించాడు.

''ఇక మీరు వెళ్ళవచ్చు. ఇదిగో మీ ఇంటి తాళం.

[illegible]

దీనితో తలుపు తెరిచి [illegible] ప్రవేశించండి. మీ భార్య క్షేమంగావున్నట్లు కొద్దిసేపట్లో నే తెలుసుకోగలరు'' ఇంటి తాళాన్నందుకున్నాడు శేఖరం. అతని మాటలకు జవాబివ్వకుండా అది జేబులో వేసుకుని అక్కణ్ణించి కదిలాడు.

''వెళ్ళేముందో విషయాన్ని గుర్తించుకోండి. నన్ను మళ్ళీ కలుసుకోవటం మీకు సాధ్యం కాదు. ఇక్కడికి వచ్చిమాత్రం ప్రయత్నించి భంగపడకండి. నేను చెప్పిన వన్నీ గుర్తుంచుకుని చెప్పినట్లు చేయండి. పొరపాటున కూడా మీరు చేసిన ప్రయోగ రహస్యం ఎవరికీ చెప్ప డానికి ప్రయత్నించకండి. ఆ విషయంలో పూర్తిగా మౌనంవహించకపోతే మీ ప్రాణాలకే ప్రమాదం. మిమ్మల్ని మామనుషులు వెయ్యికళ్ళతో కనిపెడుతుంటా రని గుర్తుంచుకోండి'' అన్నాడు అతను.

శేఖరం అక్కణ్ణించి కదిలి బస్‌స్టాపుకి వచ్చి బస్సెక్కి తన ప్రాంతం చేరాడు. అతను వెళ్ళేసరికింకా వీధితలుపు తాళం వేసేవుంది. నిరుత్సాహంగా నిట్టూర్చి తలుపు తాళం తీసి లోపల ప్రవేశించాడతను. జరిగినదంతా నిజమే నని అతనింకా నమ్మలేకపోతున్నాడు.

లైటువేసి వీధితలుపులు వేశాడు. అతనికి నీరసంగా వుంది. సావిత్రి ఏమయిందో ఎప్పుడొస్తుందో అనుకుంటూ పడకగదిలోకి వెళ్ళాడు. అక్కడ గదిలో మంచం మీద పడుకునివున్న సావిత్రిని చూసి అతనాశ్చర్యపోయాడు. ఆమెకు కాళ్ళూ చేతులూ కట్టబడివున్నాయి. నోట్లోగుడ్డలు కుక్కబడ్డాయి.

శేఖరం వెంటనే ఆమెకు కట్లువిప్పి నోట్లోగుడ్డలు

తీసేసి జరిగినదామె నోట విని తెలుసుకున్నాడు.

మధ్యాహ్నం ఎవరో వచ్చి ఇంటి తలుపులు తట్టారుట. తను తలుపుతీయగానే లోపలకు ప్రవేశించి ఒక కవరు నామెకిచ్చి నొడ్డి తలుపు దగ్గరగా వేసివుంచి బయటకు రమ్మన్నాడట. ఇంటితాళం సావిత్రే స్వయంగా వేసిం దట. కవరు కరుణకు ఆమే ఇచ్చివచ్చిందట. ఆ తర్వాత యిద్దరూ కలిసి ఒక సందుతిరిగి మళ్ళీ దొడ్డిదారిన ఇంట్లో ప్రవేశించారట. వాడు సావిత్రినిలా బంధించి వెళ్ళిపోయా డట. చెప్పినట్లు వినకపోతే శేఖరం ప్రాణాలకు ప్రమాద మని వాడు బాగా నొక్కి చెప్పడంవల్ల సావిత్రి వాడు చెప్పినట్లు విన్నదట.

శేఖరం సావిత్రిని ఓదార్చి తనకు జరిగినదికూడా చెప్పి "సావిత్రీ నా పరిశోధనలకు సంబంధించిన వార్త నీమూలం గానే బయటకు వెళ్ళివుండాలి. నువుగానీ ఎవరికైనా చెప్పేవా" అనడిగేడు.

"నేను కరుణకు మాత్రం చెప్పాను. కానీ మీరా ప్రయోగాలు చేస్తున్నప్పుడింకెవరూ మీదగ్గర లేరా?" అంది సావిత్రి.

"అదీ నిజమే—కానీ వాళ్ళు బొత్తిగా అటెండెంట్సు. నా ప్రయోగాలనర్థం చేసుకునే తెలివి తేటలున్నాయని అనుకోను" అన్నాడు శేఖరం.

"మీ ప్రయోగాలంటే కరుణకి బాగా ఆసక్తివుంది. నిన్న మీరు మొదలుపెట్టబోతున్న ప్రయోగఫలితం తెలు సుకునేందుకీరోజు ఉదయం మీరు వెళ్ళగానే వచ్చేసింది" అంది సావిత్రి.

శేఖరం సాలోచనగా "కరుణ ఎలాంటి మనిషి?" అన్నాడు.

"చాలాసరదా అయినది. మంచిమనిషి..." అంది సావిత్రి.

# 4

"ఎవరు మీరు!" అన్నాడు శేఖరం.

"నేనెవరైతే మీకెందుకు లెండి— మీరిప్పుడుద్యోగం రాజీనామా చేయడానికికదా వెడతూంట. ఆ సమయంలో మీరు ఆఫీసులో ఇంకే విధమైన విషయాలూ చెప్పలేదని ధృవపర్చుకోడానికి మీకూడ వస్తున్నాను. మీరు మాట తప్పిన మరుక్షణం ఇంటివద్ద మీభార్య..." అతను ఆగి "మీకు తెలిసినదే కదా! నన్నేమైనా చేయడానికి ప్రయత్నిస్తే— నాగురించి ఏమీ తెలుసుకోలేరు కానీ మీజీవితాన్ని నాశనం చేసుకున్నవారౌతారు" అన్నాడు.

శేఖరం ఆశ్చర్యపోయాడు. ఏదో ముఠా తనవెంట పడింది. అనుక్షణం తనను వెన్నాడుతోంది. తన ప్రతి చర్యనూ కూలంకషంగా పరిశీలిస్తోంది.

రవీంద్రకాలనీ నుంచి తిరిగివచ్చేక తను సెలవు పెట్టాలనుకుని మర్నాడాఫీసు దగ్గరోనున్న టెలిఫోన్ బూత్ దగ్గరకు వెడితే అక్కడ ఒకతను పలకరించి తను ఫోన్ చేయనవసరంలేదనీ అతనే ఫోన్ చేసి విషయం చెబుతాననీ అన్నాడు. ఆ తర్వాత సావిత్రి పుట్టింటికి ఉత్తరం రాస్తే అది తను పోస్టు చేయబోగా ఒకతను వచ్చి అందులో యితర విషయాలేమీ లేవని ధృవపర్చుకున్నాకనే అది పోస్టయింది.

తన యింటికి ఏ సమయంలో ఎరిగున్నవాళ్ళొచ్చినా ఏదో వంకతో ఒక అపరిచితవ్యక్తి తన యింట్లోకి ప్రవేశిస్తున్నాడు. అతన్ని తను వారించలేదు.

శేఖరం జీవితం జీవితంలా కాక జైలులా తయారయింది. కానీ లాటరీ టిక్కెట్టు అతన్ని లక్షాధికారిని చేసింది. బాగా ఆలోచించి భార్యాభర్తలిద్దరూ ఎన్నో చర్చలు జరిపి చివరకుద్యోగానికి రాజీనామా యివ్వాలని నిశ్చయించు కున్నారు. ఆ నిర్ణయాన్నమల్లో పెడదామని శేఖరం బయల్దేరేసరికి మళ్ళీ మరోమనిషి తయారు.

శేఖరం నిరభ్యంతరంగా ఆ వ్యక్తిని తనతో రానిచ్చాడు. అన్నిపనులూ సక్రమంగా పూర్తిచేశాడు. అతని బాస్ ఆశ్చర్యపోయి "ఎందుకీ రాజీనామా? నీకేం కష్టం కలిగింది?" అన్నాడు.

"అనుకోకుండా డబ్బు వచ్చింది. లైఫెంజాయ్ చేద్దామనుకుంటున్నాను" అన్నాడు శేఖరం.

"నీలాంటి యువకుడు, అందులోనూ మంచి టాలెంట్ ఉన్నవాడు డబ్బు సరదాలకు లొంగిపోయి—దేశసేవ మానివేయడం నాకు నచ్చలేదు—" అన్నాడు శేఖరం బాస్.

"ఏం దేశసేవలెండి. దేశంలో చాలామంది నిరుద్యోగులున్నారు. ఈ విధంగా మరో యువకుడి కవకాశమిచ్చినట్లుంటుంది" అని అక్కణ్ణించి వచ్చేశాడు శేఖరం. అతన్ననుసరించి వచ్చినతను శేఖరాన్ని ఇంటిదగ్గర దిగబెట్టి మరీ వెళ్లాడు.

రాజీనామా ఇచ్చేక శేఖరానికి ఉత్సాహంగా లేదు. "సావిత్రీ పరిశోధన చేయాలన్నది నా ఆసక్తి. అది చంపుకున్నాను. డబ్బు బాగానే వుందిప్పుడు మనకు. కానీ జైలుజీవితంలా మారిపోయింది మనబ్రతుకు. ఎక్కడికెళ్ళినా ఎవడో ఒకడు మనవెంటపడుతున్నాడు. వాడి బారినుంచి

తప్పించుకోవడమెలాగో తెలియడంలేదు. ఒక రహస్యం దాచడంకోసం జీవితంలోని అన్ని రహస్యాలూ బయట పెట్టుకు బ్రతకాల్సొచ్చింది."

సావిత్రి అతన్ని ఓదార్చి "ఎందుకు బాధపడతారు? మనకు డబ్బుంది హాయిగా జీవిద్దాం. వాళ్ళెవరో ఎన్నాళ్ళు ఓపికగా మనవెంట పడతారో పరీక్షిద్దాం" అంది.

"వాళ్ళ ఓపిక కంతుందో లేదో నాకు తెలియదు కానీ నాఓర్పు మాత్రం నశించింది. ఎలాగో అలా వీళ్ళ బారి నుండి తప్పించుకోవాలి" అన్నాడు శేఖరం.

"ఎందుకండీ వాళ్ళు చెప్పినట్లు ఊరుకుంటే పోయే దానికి అనవసరం రభస చేస్తారు. పాత జీవితం గురించి మరిచిపోయి మామూలు జీవితం గడిపినన్నాళ్ళూ మనకే బాధ లేదుకదా" అంది సావిత్రి.

శేఖరం వినలేదు అతనికి చాలా బాధగావుంది. కొంత సేపు ఆలోచించి "ఒక్కటే ఉపాయంతోస్తోంది నాకు. ప్రస్తుతానికి నాకు మతి భ్రమించిందనుకో, సైకాలజిస్టు దగ్గరకు తీసుకువెళ్ళు" అన్నాడు.

"ఈ విషయంలో మనం ఊరుకుంటేనే ఉత్తమం. అనవసరపు ప్లాన్సు వేసి ప్రాణాలమీదకు తెచ్చుకోవడం నాకిష్టంలేదు" అంది సావిత్రి. శేఖరం ఏమీ మాట్లాడ లేదు.

## 5

"కరుణా మీకెవరైనా మంచి సైకాలజిస్టు తెలుసా?" అనడిగింది సావిత్రి.

"తెలుసు కానీ ఎందుకు?" అనడిగింది కరుణ.

"ఆయన ఏమిటో పిచ్చిపిచ్చిగా మాట్లాడుతున్నారు. నాకెందుకో భయంగావుంది. మధ్యమధ్యలో తెలివిగానే

మసలుతున్నారు. కానీ ఉంటుండి పిచ్చిమాటలు చెబుతున్నారు. మాకు లాటరీలో డబ్బొచ్చిందని నేను బలవంత పెట్టి ఆయనచేత ఉద్యోగం మానిపించాను. ఉద్యోగం మానడం ఆయనకంత యిష్టంకాని మాట అటుంచి పరిశోధన ఆయనప్రాణం. అందువల్ల ఏమైనా మనసు చెదిరిందేమోనని భయంగావుంది. ఎవరైనా మంచి సైకాలజిస్టు మీకు తెలిసినవాళ్ళుంటే..."

"గోవిందరావని మాకు తెలిసినాయనే ఒకడున్నాడు. ఆయనకేవో ఫారిన్ డిగ్రీలుకూడా ఉన్నాయనుకుంటాను. వెళ్ళి మీ అదృష్టం పరిశీలించుకోండి" అంటూ అడ్రస్ చెప్పి తన సానుభూతికూడా ప్రకటించింది కరుణ.

కరుణ యిచ్చిన అడ్రస్ తీసుకుని భర్త దగ్గరకెళ్ళింది సావిత్రి.

"జాగ్రత్త కోటు సరిగా వేసుకున్నానా బొత్తాలన్నీ పెట్టుకున్నానా అసలే రేడియేషన్ ఎక్స్‌పరిమెంట్సు" అన్నాడు శేఖరం.

"సరేనండి నటన బాగానేవుంది కానీ మనమింకా సైకాలాజిస్టుదాకా వెళ్ళలేదు. ఇంట్లోనేవున్నాం" అంది సావిత్రి.

"కొన్నికొన్ని సమయాల్లోకా స్వముందుగానే మొదలు పెడుతుండాలి సావిత్రీ" అన్నాడు శేఖరం. "అప్పుడే నీముఖంలోకూడా కాస్త ఆదుర్దాలూ అవీ కనబడతాయి.",

శేఖరం నటన ప్రారంభమైంది. సావిత్రి అతన్ని మంచి మాటలాడుతున్నట్లు నటిస్తూ బయటకు తీసుకువచ్చి ఇంటి తలుపు వేసింది. వాళ్ళిద్దరూ రోడ్డుమీదకు వచ్చి నాలు గడుగులు వేశారోలేదో ఒక టాక్సీ వాళ్ళపక్కగా పోతూ

ఆగింది. సావిత్రి రెండడుగులు ముందుకు వేసి గోవిందరావు అడ్రసున్న కాగితం అతనికి చూపించింది. టాక్సీవాలా తలూపి "ఎక్కండి" అన్నాడు.

సావిత్రి, శేఖరం ఇద్దరూ టాక్సీ వెనకసీట్లో ఎక్కారు. టాక్సీ శరవేగంతో బయల్దేరింది. ఒక పది నిమిషాలు గడిచేక టాక్సీ సరైన దోవలో వెళ్ళడం లేదని సావిత్రికి అనుమానం వచ్చింది. తన అనుమానాన్ని గట్టిగానే బయటపెట్టిందామె.

"కంగారేం లేదమ్మా. ఆ గోవిందరావుగారు నాకు బాగా తెలుసు. ఆయనిప్పుడు ఇల్లు మారారు. వారింటికే మనం వెడుతున్నాం" అన్నాడు టాక్సీవాలా తాపీగా.

శేఖరం తాత్కాలికంగా నటనమానేశాడు. సావిత్రి, అతనూ కలిసి భయం భయంగా ఏవో గుసగుసలాడుకున్నారు. మరో అయిదు నిముషాల్లో టాక్సీ ఒక ఇంటి ముందాగింది. "ఇదేనమ్మా గోవిందరావుగారిల్లు" అన్నాడు టాక్సీవాలా.

ముందుగా సావిత్రి, తర్వాత శేఖరం టాక్సీ దిగారు. సావిత్రి టాక్సీ ఫేర్ చెల్లించింది. సావిత్రి తర్వాత ఇంటి వైపు నడిచి తలుపు తట్టింది.

సుమారు రెండు నిముషాలకు తలుపు తెరుచుకుంది. ఒక ముసిలాయన బయటకు తొంగిచూసి "ఇది సైకాలజిస్టు గోవిందరావు ఇల్లు. ఇల్లు మారేక ఇంకా నేమ్‌ప్లేట్ బయటపెట్టలేదు. మీరు వచ్చింది ఆయనకోసమే అయితే లోపలకు రావచ్చు" అన్నాడు.

సావిత్రి, శేఖరం లోపల ప్రవేశించేక ఆయనే సైకాలజిస్టు గోవిందరావు అని అర్థం చేసుకున్నారు.

"పిచ్చి ఎవరికి?" అన్నాడు గోవిందరావు ఇద్దర్నీ పరిశీలించి చూస్తూ.

"మా ఆవిడకండి" అన్నాడు శేఖరం తాపీగా. సావిత్రి కలగజేసుకుని తను కరుణకు చెప్పిన విధంగానే గోవిందరావుకు చెప్పింది. గోవిందరావు సాలోచనగా తల పంకించి "నువ్వేం చెబుతావ్?" అన్నాడు శేఖరాన్ని పరీక్షించి చూస్తూ.

శేఖరం వెకిలిగా నవ్వాడు.

"సరేలే—నువ్వింకేం చెప్పకర్లేదులే" అన్నాడు గోవిందరావు అర్థమైనట్లు. తర్వాత ఆయన సావిత్రివైపు చూసి "ఇలాంటి కేసులు నా కొకటి రెండు ఇదివరలో కూడా వచ్చాయి. ఇది కుదర్చడానికో సులభమైన పద్ధతి ఉంది" అంటూ లోపలకు వెళ్ళి ఒక ఫోటో ఆల్బం తీసుకు వచ్చాడు.

"చూడు బాబూ! నీ పేరు శేఖరం అన్నావు కదూ! నువ్వు అనవసరంగా బాధపడుతున్నావు. ఉద్యోగం మానేసి హాయిగా ఇంట్లో కూర్చోవడంవల్ల ఎన్నో సుఖాలున్నాయి. ఈ ఆల్బం చూడు. ఆఫీసుకు వెళ్ళే మగవాళ్ళ ఇళ్ళలో ఒంటరిగా ఉండే ఆడవాళ్ళ ఇబ్బందులు నీకు తెలుస్తాయి" అంటూ ఆయన శేఖరానికి ఆల్బం అందించాడు.

శేఖరం ఆల్బం అందుకుని చూసి ఉలికిపడ్డాడు. అందులో ఒక మానభంగం కేసుకు సంబంధించిన ఫోటోలు క్లోజప్‌లో ఉన్నాయి. ఫోటోలో ఆమె ఎవరో అతనికి తెలియలేదు. కానీ అత్యాచారం మాత్రం దారుణంగా ఫోటోలోకి వచ్చింది.

శేఖరం తలెత్తి గోవిందరావువంక చూశాడు. గోవింద రావు కళ్ళలోంచి నిప్పులు కురుస్తున్నాయి. బాగా పరీక్షిస్తే ఆ కళ్లు తనకు పరిచయమైనవేననీ రవీంద్ర కాలనీలో తనను బెదిరించి లాటరీ టికెట్ ఇచ్చిన వ్యక్తి అతనేననీ గ్రహించాడు శేఖరం.

"మిస్టర్ శేఖరం! ఇది నీకు లాస్టు వార్నింగ్. ఈ ఫొటోలో ఆమె ఎవరో తెలుసా? నా లాస్ట్ వార్నింగు లక్ష్యపెట్టని ఒక తెలివితక్కువవాడిభార్య. నీ భార్య కూడా అదే గతి పట్టించకు..." అన్నాడు గోవింద రావు తీవ్రంగా.

శేఖరం తల తిరిగిపోయి "ఏమిటి మీరనేది?" అన్నాడు.

సావిత్రి మారు మాట్లాడకుండా "రండి పోదాం" అంది.

ఇంటికి వెళ్లేదాకా ఇద్దరూ మౌనంగా ఉన్నారు. ఇంటికి వెళ్ళేదాక "వీడెవడో దివ్యదృష్టి ఉన్నవాడిలా గున్నాడు" అంది సావిత్రి.

"ఏ దివ్యదృష్టీ లేదు. మీ కరుణకీ ముఠాతో సంబంధ ముంది" అన్నాడు శేఖరం నమ్మకంగా.

"ఎందుకలాగనుకుంటున్నారు? గోవిందరావు అడ్రసు ఆవిడే యిచ్చింది కానీ మనని మోసం చేసింది టాక్సీ వాడేమో? వాడేకదా తనకు తెలుసునని చెప్పి మరీ ఆ యింటికి తీసుకువెళ్ళాడు!" అంది సావిత్రి.

"అది సరే ఆ టాక్సీవాడికి ముందుగానే మనం గోవింద రావు దగ్గరికి వెడుతున్నామని తెలుసుండాలి. అవతల నకిలీ గోవిందరావుకూడా మనకోసం సిద్ధంగావున్నాడు. వీళ్ళిద్దరికీ ఎవరో సమాచారమందించివుండాలి. మనం

యిలా బయల్దేరుతున్న సంగతి తెలిసిన ఏకైక వ్యక్తి కరుణ!'' అన్నాడు శేఖరం.

''మీరంటుంటే నాకూ నిజంలాగేవుంది. ఇప్పుడేం చేస్తాం?'' అంది సావిత్రి.

''వెధవదేశం మనది. మనుషుల కీమాత్రం రక్షణలేని ఈదేశ మెందుకు? దేశాన్ని ప్రగతిపథంలో నడిపిస్తున్నా మని చెప్పుకునే నాయకులెందుకు?'' అన్నాడు శేఖరం కసిగా.

## 6

శేఖరం తలుపుతీశాడు. ఎదురుగా శాస్త్రి నవ్వుతూ నిలబడివున్నాడు. శాస్త్రి లేబరేటరీలో అతని కొలీగ్. ఉద్యోగం మానేశాక అతను వీళ్ళింటికి రావడం యిదే ప్రథమం.

''రండి రండి'' అన్నాడు. శాస్త్రి లోపలకువచ్చాడో, లేదో ఒక మనిషీ లోపలకు వచ్చాడు. ''గ్యాస్ స్టవ్ రిపేరు చేయడానికి వచ్చానండి'' అన్నాడు. అతనెవరో తెలుసు కాబట్టి శేఖరం మాట్లాడలేదు. ఇటీవల యిది నిత్యానుభవమే కదా!

లాబరేటరీకి ప్రధానమంత్రి వస్తున్నాడట. ఆయనతో పాటు యిద్దరు విదేశీయ శాస్త్రజ్ఞులు వస్తున్నారుట. లాబరేటరీకి సంబంధించిన కొన్ని ముఖ్యవిశేషాలను వాళ్ళకు చూపిస్తారుట. ఆ సమయంలో శేఖరం అక్కడుంటే బాగుంటుందని లాబరేటరీ డైరెక్టరు అభిప్రాయ పడ్డాడట.

శేఖరం క్షణం ఆలోచించి ''తప్పకుండా వస్తాను కానీ ప్రధానమంత్రిని చూసే అవకాశం అందులోనూ దగ్గ

ర్నుంచి మూసే అవకాశం ఏ ఒక్కరికో కానీ రాదు. అహ్వానితుల్లో నా భార్యకూడా ఉండేలా చూడండి'' అన్నాడు.

''తప్పకుండా'' అన్నాడు శాస్త్రి. వాళ్ళిచ్చిన కాఫీ సత్కారాన్నందుకుని అతను వెళ్ళిపోయాక గ్యాస్‌స్టవ్ రిపేరతను వచ్చి ''తప్పకుండా వెళ్ళండి. అక్కడికి నేనూ వస్తాను'' అన్నాడు.

''ఎవరూ నాతో రానవసరంలేదు. ఇన్ని పర్యాయాలు చెప్పించుకునే మనస్తత్వం కాదు నాది—'' అన్నాడు శేఖరం.

''మా జాగ్రత్తలో మేముండాలి కదా'' అని వెళ్ళి పోయాడతను.

శేఖరం ఆలోచనలో పడిపోయాడు. ప్రధానమంత్రి సందర్శనమంటే మాటలు కాదు. సెక్యూరిటీ ఏర్పాట్లు దట్టంగా, దిట్టంగావుంటాయి.కూడా ఆయుధం తీసుకువెళ్ళే అవకాశంకూడా వుండదు. అందరికీ అక్కడికి వెళ్ళే అవకాశం కూడా లభించదు. అటువంటప్పుడు ఈ ముఠా వాళ్ళు అక్కడికెలా వస్తారు? వచ్చినా తన హద్దుల్లో తన నెలాగుంచుతారు? తన భార్యనేదైనా చేస్తారేమోనని ఆమెనుకూడా తీసుకువెళ్ళడానికి నిశ్చయించుకున్నాడు.

'సరే—ఏం జరుగుతుందో చూద్దాం!' అనుకున్నా డతను.

ఒక రోజు ముందుగా శేఖరానికి ప్రధానమంత్రి సందర్శనం సందర్భంలో లాబరేటరీకి రావడానికి అవసరమైన బాడ్జెస్, ఐడెంటిఫికేషన్ కార్డ్సు వగైరాలు అందాయి. ఆరోజు రాత్రే శేఖరం దంపతుల నొకవ్యక్తి

కలుసుకుని బెదిరించి కొన్ని కాగితాలు వ్రాయించేడు. దేశద్రోహాన్ని తలపెడుతూ ఏదో మురారి శేఖరం వ్రాసిన ఉత్తరాలవి.

ఆ పనయ్యేక ఆవ్యక్తి పోతూ "రేపు మీరు ఇల్లు వదిలేక లక్షరూపాయలు అన్నీ దొంగనోట్లు పెట్టబడతాయి. ఈ ఉత్తరాలకు మా జవాబులు కూడా మీ ఇంట్లో వుంటాయి. ఈ ఉత్తరాలూ, ఒక ఫోన్ కాలూ పోలీసులకు అందుతాయి. దంపతులిద్దరూ చక్కగా ప్రధానమంత్రిని సందర్శించుకుని వస్తే ఏ ఇబ్బందీ లేదు. లేకపోతే మాత్రం...జీవితాంతం జైల్లోపడి మగ్గాలి" అన్నాడు.

అతను వెళ్ళిపోయేక శేఖరానికి కళ్ళనీళ్ళు వచ్చేశాయి. సావిత్రి ఒడిలో తలపెట్టుకుని "ఎలాంటి జీవితం గడపాల్సొచ్చింది!" అంటూ చిన్నపిల్లాడిలా ఏడ్చేశాడు.

# 7

"మన గురించి ప్రధానమంత్రి తమ అమూల్యమైన కాలాన్ని వినియోగించడానికి రావడం మనందరకూ ఎన్నో రకాలుగా లాభిస్తుంది. ఆయన్ని దగ్గర్నుంచి చూసిన ఆనందం, ఆయన మాటలు దగ్గర్నుంచి వింటూ ఆయన సందేశాన్ని పొందగలిగిన అదృష్టం, ఆయన సమక్షం కలిగించిన ప్రోత్సాహం—ఇలా ఎన్నో వున్నాయి" డైరక్టరుగారు ప్రధానమంత్రిని పొగుడుతూ ఉపన్యసించడమయ్యేక ప్రధానమంత్రి లేచారు.

దేశాభ్యున్నతికి తనెలా పాటుపడిందీ, తన పార్టీ దేశానికి ఎలా సేవ చేస్తున్నదీ క్లుప్తంగా వివరించి ఈ చిన్న లాబరేటరీలోని పెద్దపెద్ద ప్రాజెక్టులు, వాటి ఫలితాలు తననెలా కదిలించినదీ చెబుతున్నాడాయన.

శేఖరం ప్రధానమంత్రి మాటలు వినడంలేదు. అతను చుట్టూ చూస్తున్నాడు. ప్రధానమంత్రి గురించి చాలా దిట్టమైన ఏర్పాట్లు జరిగాయి. తమ మధ్య కూర్చున్న వారిలో కొందరు సివిల్ డ్రస్‌లోవున్న పోలీసువారు.

శేఖరం తన ప్రక్కనే కూర్చున్న సావిత్రి చేయి గిల్లాడు. ఆమె శరీరం వణికింది. తాము చేయబోయేపని తల్చుకుంటేటే ఆమె హృదయం దడదడలాడింది. బహుశా జీవితంలో ఇవి ఆఖరి క్షణాలయ్యుండవచ్చుననుకుందామె.

శేఖరం మళ్ళీ సావిత్రి చేయిగిల్లాడు. ఇద్దరూ మెరుపు వేగంతో తమ కుర్చీలోంచి లేచి డయాస్ మీదకు వెళ్ళారు.

"అసమర్ధులు బ్రతకూడదు. ప్రధాన మంత్రిని చంపేస్తాం" అన్నారిద్దరూ ఏక కంఠంతో. వారిద్దరూ ప్రధానమంత్రిని సమీపించకుండానే యిద్దరు సెక్యూరిటీ గార్డ్సు వాళ్ళని పట్టుకున్నారు. శేఖరం, సావిత్రి ఇద్దరూ ప్రధానమంత్రిని యిష్టంవచ్చినట్లు తిడుతున్నారు.

హఠాత్తుగా అక్కడి వాతావరణం మారిపోయింది. ఊహించని ఈ పరిణామానికి అంతా తెల్లబోయారు. మీటింగ్ అర్ధాంతరంగా ముగిసింది. శేఖరం, సావిత్రిలను స్పెషల్ కస్టడీలోకి తీసుకెళ్ళడం జరిగింది.

లాబరేటరీ డైరెక్టరు "ఛా—కొరివితో తల గోక్కున్న ట్లయింది. సదభిప్రాయంతో లాబరేటరీ ఉద్యోగి కాకపోయినా ప్రత్యేకంగా ఆహ్వానించాము. ఈ విధంగా మనమూ చిక్కుల్లో పడ్డాం"—అన్నాడు డిప్యూటీ డైరెక్టరుతో.

క్షణాలమీద పోలీసులు శేఖరం యింటిమీద దాడి

చేశారు. అక్కడ వారికి దొంగనోట్లూ, శేఖరం దేశ ద్రోహి అని ఋజువుచేసే కాగితాలూ దొరికాయి. ఒక రోజులో ఈ వార్త అన్ని వార్తాపత్రికలలో ప్రకటించ బడింది.

శేఖరం, సావిత్రీల ఫోటోలు వాళ్ళ జీవితవివరాలు చాలా పేపర్లలో వచ్చేశాయి. ఈ విధంగా దేశం మొత్తం ఈ అనామకుల గురించి తెలుసుకుంది. తన ప్రయోగంతో పేరు ప్రఖ్యాతులు తెచ్చుకోవలసిన శేఖరం ఈ విధంగా అవి సంపాదించాడు.

ప్రస్తుతం శేఖరం, సావిత్రిలమీద రహస్య విచారణ జరుగుతోంది. వాళ్ళెక్కడున్నారో, ఏమి చేస్తున్నారో వివరాలెవ్వరికీ తెలియవు.

# 8

డాక్టర్ స్వామి అదే లాబరేటరీలో శేఖరం స్థానంలో ఉద్యోగంలో చేరాడు. అతనింకా బ్రహ్మచారిగానే వున్నాడు. వయస్సు పాతిక దాటివుండవచ్చు, అతనికి శేఖరం వుండే ఇల్లు అద్దెకు దొరకడం మరో విశేషం.

ఒకరోజు రాత్రి ఎనిమిది గంటల సమయంలో ఎవరో ఇంటి తలుపు తట్టగా స్వామి తలుపు తీశాడు. అందమైన అమ్మాయక్కడుండడం చూసి ఆశ్చర్యపడ్డాడు.

“నా పేరు కరుణ” అందామె.

“నా పేరు స్వామి” అన్నాడు స్వామి.

“మీగురించి నాకన్నీ తెలుసు” అంది కరుణ. “లోపలకు రావచ్చా.”

“రండి రండి” అన్నాడు స్వామి కంగారుగా.

కరుణ లోపలకు వచ్చి కూర్చుని తన గురించిన వివరాలు

చెప్పి "మావారెప్పుడూ ఇంటిపట్టున వుండరు. ఇదివరకు శేఖరం దంపతులు వుండేవారు. నా కాలక్షేపం రోజల్లా ఆవిడతో జరిగేది" అంది.

"అలాగా" అన్నాడు స్వామి ఏ విధమైన కుతూహలం చూపకుండా.

"నాకు శాస్త్రజ్ఞులన్నా వారి పరిశోధనలన్నా చచ్చేటంత యిష్టం. అందుకే శేఖరందంపతులతో స్నేహం చేసేదాన్ని" అంది కరుణ.

స్వామి మాట్లాడలేదు. అతనిది కాస్త రిజర్వ్‌డ్ నేచర్ అని గ్రహించిన కరుణ టాపిక్ మార్చింది.

"బ్రహ్మచారయినా మీరింటిపట్టునే వున్నారు. పెళ్లి వయసులో వున్న పెళ్ళయ్యుండీ ఆయన బయట కాలక్షేపం చేస్తున్నారు. చూడండి తేడా" అంది కరుణ.

స్వామి క్షణకాలం ఆమె కళ్ళలోకి చూసి తలదించుకుని "చూడండి మీరేమీ అనుకోనంటే ఒక విషయం చెబుతాను. సెక్స్ నా బలహీనత. ఒంటరిగానే కాదు పదిమందిలో వున్నప్పుడుకూడా ఆడది కనిపిస్తే నేను నిగ్రహించుకోలేను. అందుకే నేను సాధ్యమైనంతవరకూ ఆడవాళ్ళను దూరంగా—వాళ్ళను తప్పించుకుంటూ మసలుతాను. స్నేహంగా పలకరించటానికి వచ్చినా ఈ సమయంలో రావడంవల్ల నన్ను గురించి నేను చెప్పుకోవాల్సొచ్చింది" అన్నాడు.

కరుణ కళ్ళు మెరిసాయి. "మీరు బలహీనత అనుకుంటున్నది నాకు అవసరం. ఈ సమయంలో మీ ఇంటికి రావడంలో నా ఉద్దేశ్యాన్నిపాటికి గ్రహించేవుండాలి మీరు" అంది.

స్వామి లేచి వీధి తలుపులు వేశాడు. వచ్చి కరుణ చేయి పట్టుకుని మేడమీదకు దారి తీశాడు. కరుణ అతన్ననుసరించింది. ఇద్దరూ పడకగదిలోకి వెళ్ళారు.

పదినిమిషాలు గడిచేక—"ఐ లవ్ యూ..." అంది కరుణ.

"చూడు కరుణా యిప్పుడు నీకేం కావాలో అడుగు. ఇలా పడుకుని కబుర్లు చెప్పమంటే ఎన్నయినా ఎంత సేపయినా చెప్పగలను నేను" అన్నాడు స్వామి.

"నాకేమీ అక్కర్లేదు. నువ్వే కావాలి—" అంది కరుణ.

"పరిశోధనలంటే ఆసక్తి వుందన్నావు—" అన్నాడు స్వామి.

"అవుననుకో కానీ ఆ కబుర్లు ఇలాంటి చనువున్న వారి దగ్గర చెప్పుకోనవసరంలేదు" అంది కరుణ.

ఆమె నెమ్మదిగా తన బాధ చెప్పుకుంది. భర్త తన్ను నిర్లక్ష్యం చేస్తున్న కారణంగా మగతోడుకోసం ఆమె తపించిపోతోంది. సావిత్రితో పరిచయాన్ని శేఖరాన్ని దృష్టిలో వుంచుకుని పెంచుకుంది. కానీ శేఖరం ఈమె ఉనికినే గమనించలేదు. స్వామి ఆమెకు దేవుడిచ్చిన వరంలాగ వచ్చేడు.

"శేఖరం చాలా గొప్ప సైంటిస్టు" అన్నాడు స్వామి హఠాత్తుగా. "అతని దృష్టంతా సైన్సుమీదనూ పరిశోధనల మీదనూ వుంటుంది. భార్య ప్రోత్సాహం మీద ఉద్యోగం మానేశాక అతనికి మతి చలించినట్లుంది."

"శేఖరం గొప్ప సైంటిస్టని ఎందుకనుకుంటున్నావ్" అంది కరుణ.

"లాబరేటరీలో అతని పోస్టులోనే నేను చేరాను. అతని ప్రయోగాల వివరాలన్నీ చూశాను. అతను ప్రయోగాలు చేసేపద్ధతి ఫలితాలతను అర్థం చేసుకునే పద్ధతి వాటినిబట్టి అతను వేసే కొత్త పథకాలు అన్నీ అతని ప్రత్యేకతలు. నా ప్రయోగాలు అతని అడుగు జాడల్లోనే నడపదల్చుకున్నాను..." అని క్షణం ఆగి "అతని అబ్జర్వేన్ నోట్ బుక్ లో అక్షరుసారిగా అతను వ్రాసిందాన్ని బట్టి వాతావరణాన్ని శాసించే ప్రయోగాల నతను అనుకోకుండా చేసినట్లు అర్థమవుతోంది. ఇదెవ్వరికీ తెలియదు. నేనూ అతని ఫీల్డువాడినే కాబట్టి నాకర్థమైంది" అన్నాడు స్వామి.

కరుణ ఆశ్చర్యంగా స్వామివంక చూసి "అది సాధ్యమా?" అంది.

"సాధ్యమో కాదో నాకు తెలియదు. రేపే మొదలు పెట్టి చూస్తాను" అన్నాడు స్వామి.

# 9

"మిస్టర్ స్వామీ!" అన్నాడతను.

"డాక్టర్ స్వామి" సవరించాడు స్వామి.

"అయాం సారీ డాక్టర్ స్వామీ మీతో చిన్న పనుంది" అన్నాడతను.

"మీరెవరో తెలుసుకోవచ్చా?"

"నేనెవరో మీకనవసరం. నన్ను మీ శ్రేయోభిలాషిగా గుర్తుంచుకోండి చాలు."

"నా శ్రేయస్సు నేను చూసుకోగలను. వేరే శ్రేయోభిలాషుల అవసరం నాకు లేదు" అన్నాడు స్వామి.

అతను తన అరచేతిని స్వామిముందు చూపించాడు. స్వామి ఆశ్చర్యంగా అతనివంక చూశాడు. ఆ అరచేతిలో

ఒక అందాల సుందరి ఫోటో వుంది. "మీరు నాతో వస్తే తిన్నగా ఈ అమ్మాయున్న యింటికే వెడదాం. ఆమెను మీకు పరిచయం చేసి నాదారిన నేను వెడతాను" అన్నాడతను.

"మీ ఉద్దేశ్యమేమిటో నాకర్థం కాలేదు కానీ మీతో రావడానికి నాకభ్యంతరం లేదు. అయితే ముందుగా మీకో విషయం చెప్పడం నాబాధ్యతగా భావిస్తున్నాను. సెక్సే నా బలహీనత. ఆడపిల్లతో నాకేకాంతం కల్పిస్తే ఆపైన నేనేం చేస్తానో నాకే తెలియదు. అటు పైన మీయిష్టం" అన్నాడు స్వామి.

అతను మాట్లాడకుండా ఫోటో జేబులోకి పోనిచ్చి స్వామి చేయి పట్టుకుని రెండడుగులు ముందుకు వేసి రిక్షాను పిలిచి బేరమాడేడు. స్వామికూడా రిక్షా ఎక్కాడు. రిక్షా ఒకింటిముందు ఆగేక అతను స్వామితో "అదిగో ఆ ఇల్లే అందులోకి వెళ్ళండి మీ సరదా తీర్తుంది. నాపనీ అవుతుంది" అన్నాడు.

"జేబులో డబ్బొట్టే లేదు. సరదా తీర్చుకుందుకు డబ్బివ్వలేను" అన్నాడు స్వామి అనుమానంగా.

అతను నవ్వి "మిస్టర్ స్వామీ..." అని ఏదో చెప్పబోయాడు.

"డాక్టర్ స్వామి" స్వామి సవరించాడు.

"సారీ డాక్టర్ స్వామీ నేను మీకు డబ్బు లభించే పనేకానీ డబ్బు ఖర్చయ్యేపని చెప్పను" అని "ఇక వెళ్ళండి నాకింకో చోట పనుంది" అన్నాడు.

స్వామి రిక్షా దిగి ఆ యింటికి వెళ్ళాడు. తలుపులు పూర్తిగా వేసిలేవు. అతను తోశాడు.

సోఫా కమ్ బెడ్ మీద పడుకున్న ఓ యువతి చటుక్కున లేచి కూర్చుంది. ఆమె బికినీలోవుంది. స్వామి ఆమెను చూస్తూనే ఆవేశపడ్డాడు.

"ఎవరు మీరు?" అందామె.

"డాక్టర్ స్వామి" అన్నాడతను.

"ఓహ్! మీరు సైంటిస్టు కదూ?" అంటూ ఆమె పరుగున అతన్ని సమీపించి అతని చేయి పట్టుకుని "సైంటిస్టులంటే నాకు చాలా ఇష్టం" అంది.

"నువ్వు వేశ్యవా?" అన్నాడు స్వామి.

"కాదు. నాకు డబ్బుంది. వెరైటీ కావాలి. ఇష్టమైన మగవాళ్ళని రప్పించుకుంటూంటాను. నేనే డబ్బు ఇస్తాను. సైంటిస్టులంటే నాకు చాలా ఇష్టం" అందామె.

"అయితే నే నిప్పుడు మగ వేశ్యనవుతానన్నమాట" అన్నాడు స్వామి.

"నేనంటే మీ కిష్టం లేనప్పుడు మీరు మగ వేశ్య ఔతారు. నా అభిప్రాయంలో మగవాళ్లెన్నటికీ వేశ్యలే కాలేరు. ఎందుకంటే అందమైన ఆడది పిలిచిందంటే సంతోషంగా వాళ్లు సిద్ధపడతారు. ఆడదాని సంగతలా కాదు. డబ్బుకోసం ఇష్టమున్నా లేకపోయినా ఒళ్ళమ్ముకుంటుంది" అందామె.

ఒక పావుగంట అనంతరం సోఫాకమ్ బెడ్ మీద తన పక్కనే ఉన్న ఆ అమ్మాయితో "నీ పేరుకూడా తెలుసుకోలేదు__చెబుతావా?" అన్నాడు.

"రమణి" అని నవ్విందామె. "మీలాంటి ఆవేశపరుణ్ణి నేనింతవరకూ చూడలేదు. మీరు నాకు నచ్చారు. మీకు వెయ్యి రూపాయలు బహుమతిగా ఇస్తే తీసుకుంటారా?" అంది.

"ఎందుకు తీసుకోను? అందరాండవాళ్లూ నీలా డబ్బు తీసుకోరని గ్యారంటీ ఏమిటి? వచ్చినచోట రాబట్టుకోవడం అవసరమైనచోట ఖర్చుపెట్టడం—ఇదీ నా పద్ధతి. రాబడైనా, ఖర్చయినా నాకు ఆడవాళ్ళ మూలంగానే" అన్నాడు స్వామి.

"కానీ మీరు నాకు మీ గురించి చెప్పాలి. మీరు లాబరేటరీలో ఏమేం చేస్తారో, ఏయే పరిశోధనలు చేస్తున్నారో..."

రమణిని మధ్యలో ఆపి "ఇటీవల ఆడవాళ్ళందరికీ శాస్త్రపరిశోధనల మీద ఆసక్తి మళ్ళుతోందే! కారణమేమిటి?" అన్నాడు స్వామి,

రమణి తడబడింది. "ఏముంది? సైన్సు సాధించిన ప్రగతిలో ఆడవాళ్ళ దృష్టి సైంటిస్టులమీద మళ్ళింది. శాస్త్ర తెలివైన ఆడదెప్పుడూ నూతనత్వాన్ని కోరుతుంది. మిగతావాళ్ళంతా ఎప్పుడూ పాత వాసన కొట్టే కవిత్వాలూ, అంగాంగ వర్ణనలూ తప్ప—ఇంకేమీ చెప్పలేరు. ఈ సృష్టిరహస్యాన్ని భేదిస్తూ—సృష్టితీరునే మార్చగల సైంటిస్టుల పరిశోధనలు వినడానికి నాకు చాలా థ్రిల్లింగ్ గా ఉంటాయి."

స్వామి ముఖంలో గర్వం కనిపించింది. "అలాంటి పరిశోధనే నేనొకటి చేస్తున్నాను. పూర్వం శేఖరం అనే సైంటిస్టు—కొన్ని ప్రయోగాలు చేసి ఆపేశాడు. ఆ తర్వాత అత నుద్యోగమే మానేసి ఒకసారి ప్రధాన మంత్రిమీద నే చేయి చేసుకోబోయి పోలీసుల పాలయ్యాడు. చాలా కఠిన శిక్షలనతనూ, అతనిభార్యా అనుభవిస్తున్నారని విన్నాను. ఆ ప్రయోగాల నిప్పుడు నేను

మళ్ళీ కొనసాగించేను. వాతావరణంలో హఠాత్తుగా మార్పులు తీసుకురావచ్చు. కోరినప్పుడు కోరినంత వర్షం కురిపించవచ్చు. నా ప్రయోగాలు విజయవంతం కాబోతున్నాయి.''

రమణి నవ్వి ''శేఖరం ప్రయోగాలు మధ్యలో ఆపేశానంటున్నారు ఎందుకో తెలుసా?''

''నీకు తెలుసా'' అన్నాడు స్వామి.

''ప్రకృతి శక్తిస్వరూపిణి. దానిని తన చెప్పుచేతుల్లోకి తీసుకోవాలనుకునే మనిషి సర్వనాశమైపోతాడు'' అంది రమణి.

''బాగుంది. మరి సైంటిస్టున్న దెందుకు?''

''ఎందుకా? సృష్టిరహస్యాన్నర్థంచేసుకుని జీవితాన్ని బాగుచేసుకోవడానికి తప్పితే సృష్టిక్రమాన్ని మార్చడానికి ప్రయత్నించరాదు. ఇలాంటి ప్రయోగాలు చేయడంకన్నా ఊరుకుంటే ఉత్తమం.''

''అందమైన ఆడపిల్లల్ని అర్ధనగ్నంగా చూసినప్పుడూ అర్థవంతమైన ప్రయోగమున్నదని తెలిసినప్పుడూ ఊరుకోవడం నావల్లకాదు'' అన్నాడు స్వామి.

''కానీ ఊరుకోవాలి. తప్పదు!''

ఈ మాటలు రమణివి కాదు. రిక్షాలో తనను దిగబెట్టినతనివి.

స్వామి నవ్వి ''మీరా?'' అన్నాడు.

''అవును మిస్టర్...''

''డాక్టర్...'' అందించాడు స్వామి.

''ఎస్. డాక్టర్ స్వామీ! మీరు మీ ప్రయోగాలు మానుకోవాలి. మానుకుంటే మీకు ఐదు లక్షల రూపాయలు లాభిస్తుంది. ఉద్యోగం మానేయవచ్చు. కోరినప్పు

డల్లా మీకే ఎదురిచ్చే అందాల పడతులు దొరుకు తారు..."

"మానకపోతే..."

"మీ శృంగారలీలలు ఫోటోలుగా ముఖ్యమైన స్థలాల్లో పంచిపెట్టబడతాయి."

"ఓస్—ఇంతేకదా! పంచిపెట్టండి. నాకేం అభ్యం తరంలేదు. కానీ ఒక చిన్న సలహా. ఆ ఫోటోలు పంచి పెట్టడం బదులు ఖరీదుకు అమ్మండి. మీకు బోలెడు లాభం కూడా వస్తుంది" అన్నాడు స్వామి.

అతనాశ్చర్యంగా స్వామివంక చూసి "నేను వేళా కోళమాడ్డంలేదు. నిజంగానే ఫోటోలున్నాయి నా దగ్గర" అన్నాడు.

"లేవని నేననడంలేదు. శృంగారలీలలు నా వ్యక్తిగత జీవితానికి సంబంధించినవి. నే నెవర్నీ బలవంతంగా అనుభ వించడంలేదు. ఇష్టంమీద నే అనుభవిస్తున్నాను. నన్నొక సచ్చరిత్రుడిగా పదిమందీ భావించాలని నేనాశించడం లేదు. నా ప్రవర్తన మంచిది కాదని ఉద్యోగం పోయిం దనుకోండి. అయినా నేను విచారించను. నేను సాధించిన అద్భుత ఫలితాలతో నేను కోటీశ్వరుణ్ణి కాగలను. అందు వల్ల ఒకళ్ళ డబ్బు కాశపడి నా వ్యక్తిత్వాన్ని చంపుకునే వాణ్ణి కాదు నేను..." అన్నాడు స్వామి.

"మిస్టర్ స్వామీ!" అన్నాడతను.

"డాక్టర్ స్వామి ప్లీజ్..." స్వామి చిరాగ్గా సవ రించాడు.

అతను కోపంగా "ఓః డాక్టర్ స్వామీ—డబ్బు మీద ఆశ లేకపోయినా కనీసం ప్రాణాలమీదనైనా మీ

కాశ ఉందనుకుంటూను" అన్నాడు.

"బాగుంది. ఎందుకుండదు?" అన్నాడు స్వామి.

"అయితే ప్రయోగాలు మానేసి ఉద్యోగానికి రాజీనామా ఇవ్వండి..." అన్నాడతను.

"ప్రాణాల ప్రశక్తి తీసుకొచ్చారు కాబట్టి కాస్త ఆలోచించాలి..." అన్నాడు స్వామి.

# 10

"కంగ్రాట్యులేషన్స్ డాక్టర్ స్వామీ" అన్నాడు చంద్రశేఖర్.

"డాక్టర్ కాదు మిస్టర్..." సవరించాడు స్వామి.

లాబరేటరీలో జరుగుతున్న ఆసమావేశంలో సంస్థ డైరెక్టరుతోపాటు పోలీసుశాఖకు చెందిన పలువురు ప్రముఖులున్నారు. చంద్రశేఖర్ చెప్పడం ప్రారంభించాడు.

"మన దేశం వైజ్ఞానికంగా సాధించే ప్రగతిని అభివృద్ధి చెందిన దేశాలన్నీ చాలా తక్కువ అంచనా వేశాయి. న్యూక్లియర్ ఎక్స్‌ప్లోజన్, శాటిలైట్—ఈ రెండూ వారికి కనువిప్పు కలిగించగా మూడు సంపన్న దేశాలు మన దేశంలో జరుగుతున్న పరిశోధనల గురించి తెలుసుకునేందుకు రహస్యచారుల్ని నియమించాయి.

వారి నివేదికను గమనించేక వైజ్ఞానికంగా, సాంకేతికంగా భారతదేశం చాలా వేగంగా అభివృద్ధి చెందనున్నదని ఆ మూడు సంపన్న దేశాలూ గుర్తించాయి. వెంటనే ఆ మూడుదేశాలూ కలిసి ఒక బృందాన్ని పంపించాయి. ఆ బృందం పనేమిటంటే దేశపు భవిష్యత్తునే మార్చి వేయగల పరిశోధనలను అపుచేయించడం. శాస్త్రజ్ఞులను

బెదిరించిగానీ, ప్రలోభపెట్టిగానీ ఆయా ప్రయోగాలను మానిపించడం.

అటువంటి సందర్భంలోనే శేఖరం చిక్కుకున్నాడు. అతను చేసిన ప్రయోగం విజయవంతమైతే వాతావరణంలో కోరినప్పుడు కోరినంత వర్షం కురిపించవచ్చు. ఇది భారత దేశపు ఆర్థిక స్వరూపాన్నే మార్చివేస్తుంది. ఎప్పటి కప్పుడు తమ ఏజంట్లద్వారా ఈ విశేషాలు తెలుసు కుంటున్న ఆ ముఠా శేఖరాన్ని బెదిరించి ఉద్యోగానికి రాజీనామా ఇప్పించింది..." చంద్రశేఖరం ఆగాడు— ఎవరో ప్రశ్న వేయబోతున్నారని చూసి.

సంస్థ డైరెక్టరు "శేఖరం రాజీనామాకు కారణమది అని నాకు తెలియదు. అయితే దేశంలోని ప్రతి సైంటిస్టూ ఈ విధంగా కార్నర్ చేయబడుతున్నాడా?" అన్నాడు.

"లేదు. దేశపు ఆర్థిక స్వరూపాన్ని మార్చివేయగల పరిశోధనలు చేసే సైంటిస్టులనే వారు కార్నర్ చేస్తు న్నారు. శేఖరం అణుకిరణాలను వ్యవసాయాని కుపయో గించే ప్రయోగాలు చేస్తున్న వ్యక్తి. అందువల్లనే అతను వారి దృష్టిలో పడ్డాడు. వారినుంచి తప్పించుకునే దారి తోచక చివరకతను ప్రాణాలు తెగించి ఒక నిర్ణయానికి వచ్చాడు. ప్రధానమంత్రిపైన చేయిచేసుకునేటందుకు అతనూ, అతని భార్యా సిద్ధపడ్డారు. ఆవిధంగా ఆ భార్యా భర్తలిద్దరికీ తిరుగులేని పోలీసు కస్టడీ లభించింది.

ప్రధానమంత్రిమీద చేయి చేసుకోబోయినవారు కాబట్టి వీరికి ప్రత్యేక గుర్తింపూ, ప్రత్యేక రక్షణా ఏర్పా టయ్యాయి. అక్కడ భార్యాభర్తలు చెప్పిన మాటలు ముందుగా పోలీసులు నమ్మలేదు. దానికి తోడు శేఖరం

ఇంట్లో దొరికిన ఉత్తరాలూ, దొంగనోట్లూ అతన్ని దేశద్రోహిగా నిరూపించాయి.

దేశద్రోహినని ఒప్పుకోడానికి తనకభ్యంతరం లేదనీ కానీ తన మాటల్లో నిజం గ్రహించవలసిందనీ పోలీసుల్ని అతను కోరాడు. అతని మాటలే నిజమైతే అతన్ని వెంటాడిన ముఠాను పట్టుకోవలసిన బాధ్యత పోలీసులకుంది. అప్పుడే ప్రభుత్వం రికమెండేషన్ మీద స్వామి-శేఖరం స్థానంలో నియమించబడ్డాడు సైంటిస్టుగా. అతనితో మాట్లాడిన ప్రతి అనుమానాస్పద వ్యక్తిమీదా పోలీసు నిఘా ఏర్పాటయింది. స్వామి తన ప్రవర్తనలో ఎవరికీ అనుమానం కలగకుండా మసలగలిగాడు.

సుమారు నెలరోజుల్లో పోలీసులకు ముఠాను సంబంధించిన వివరాలన్నీ పూర్తిగా తేలిపోయాయి. ఇప్పుడు ఆ ముఠా పట్టుబడింది'' అన్నాడు ఐ. జి. చంద్రశేఖర్.

* * *

శేఖరం మళ్ళీ ఉద్యోగంలో చేరేక—ఆ దంపతులిద్దరూ మళ్ళీ పూర్వపు ఇంట్లోనే అద్దెకు ప్రవేశించారు.

వారి పక్కనున్న అందమైన బంగళాలో ఇప్పుడు కరుణ లేదు. ఎవరో ధనవంతుడా ఇల్లు కొనుక్కున్నాడు. ఆయన భార్య అరుణ కూడా కరుణలాగే అందమైనది. వయసులో ఉన్నది. ఆమె భర్త కూడా ఎప్పుడూ వ్యాపారం పేరుమీద బయట కాలం గడుపుతూంటాడు. అందువల్ల ఆమెకు ఇరుగుపొరుగుతో కాలక్షేపం చేయడం సరదా.

ఆ సరదాకొద్దీ ఆమె మొట్టమొదటగా సావిత్రి స్నేహాన్నభిలషించింది. కానీ సావిత్రి ఆమెను దరిదాపులకు

కూడా రానివ్వలేదు సరిగదా—ఆమెతో తగువుకూడా పెట్టుకుంది.

అందరూ చాలా మంచిదనే సావిత్రి, చూడ్డానికి సంస్కారవంతురాలిలా కనిపించే సావిత్రి, తననెందుకు దగ్గరకు రానివ్వదో అరుణకు తెలియదు. తెలుసుకోడానికి ప్రయత్నించాలనుకుని "అయినా మనకెందుకు లెద్దూ. ఆవిడ స్నేహం లేకపోతే నాకేమైనా లోటొచ్చిందా? ఇలాంటి విషయాల్లో ఊరుకోవడమే ఉత్తమం" అనుకుని మానేసింది ఆవిడ.

—: ఐపోయింది :—

# అపూర్వ శిల్పం

ప్రభాకరదేవ్

ప్రొఫసర్ మాలవ్యా అర్జంటుగా రమ్మనమంటూ ఫోన్ చేశాడు.

మూడు సంవత్సరాలయింది మాలవ్యాను నేను కలిసి. చాలా కలుపుగోరు మనిషి.

ఈ మధ్య డైమండ్స్ స్మగ్లింగ్ నిమిత్తం నేను సింగపూర్ వెళ్ళాల్సివచ్చింది. రాగానే మాలవ్యా నుండి పిలుపు.

మాలవ్యా ఏదో ముఖ్యమైన పని లేకుంటే పిలవడు. ఆ విషయం తనకు బాగా తెలుసు. భారత పురాతత్వ పరిశోధనా కేంద్రానికి ప్రొఫెసర్ మలవ్యా డైరెక్టరు. కాలాన్ని దుర్వినియోగం చెయ్యడానికి ఎంతమాత్రం ఇష్ట

పడని వ్యక్తుల్లో మాలవ్యా ఒకడు.

పాత ఢిల్లీలోని ప్రొఫెసర్ మాలవ్యా భవనం ముందు ప్లీమత్‌ను ఆపాను. నాగురించి ఎదురు చూస్తున్నాడు కాబోలు. కారు ఆగిన శబ్దం వినగానే గబగబా పోర్టికో లోకి వచ్చాడు.

"గుడ్ మార్నింగ్" అన్నాడు విష్ చేస్తూ.

"వెరీ గుడ్ మార్నింగ్" చిర్నవ్వు నవ్వుతూ కారులో నుండి దిగాను.

ఇద్దరం కల్సి ప్రొఫెసర్ మాలవ్యా ప్రైవేట్ రూం లోకి వెళ్ళాం. మాలవ్యా మధ్యలో ఏమీ మాట్లాడలేదు. పైప్‌ను గంభీరంగా పీలుస్తూ పొగవదుల్తున్నాడు.

రూంలోకి వెళ్ళిన తరువాత తన కుర్చీలో కూర్చుంటూ ఎదురుగావున్న కుర్చీలో కూర్చోమన్నట్లుగా సైగ చేశాడు.

నేను కూర్చున్నాను. ఎయిర్‌కండిషన్ రూం అది.

ప్రొఫెసర్ మాలవ్యా యింటర్‌కమ్యూనికేషన్ స్విచ్ నొక్కి సెక్రటరీని రమ్మని పిలిచాడు.

నిమిషంలో వచ్చింది సెక్రెటరీ. పరిశీలనగా చూశాను. యిరవై రెండు సంవత్సరాలుంటాయి. అవయవాలన్నీ నిండుగా, పొందికగా, అమర్చినట్టున్నాయి. మగవాళ్ళను రెచ్చగొట్టే అందం. ఆంగ్లోయిండియన్. మాలవ్యా అభి రుచిని మనసులో అభినందించాను.

డ్రింక్స్ పంపించమని, మరెవర్ని లోపలకు పంపించ వద్దని చెప్పాడు మాలవ్యా. సెక్రటరీ తలాడించి, నావై పొకసారి చూసి వెళ్ళిపోయింది.

"ఫోనుచేసిన వెంటనే వచ్చినందుకు కృతజ్ఞతలు" అన్నాడు పైప్‌లోని నుసిని యాష్‌ట్రేలో దులుపుతూ.

"మీరు పిలిస్తే రాకుండావుండగలనా? ఎనీన్యూస్??"
నవ్వుతూ అడిగాడు.

ప్రొఫెసర్ మాలవ్యా గంభీరంగా తలాడించాడు.

"చాలా ముఖ్యమైన పని. ఇంతవరకూ బహుశా నువ్వు యిటువంటి ఆపరేషన్ రిస్కు చేసివుండవు" అన్నాడు.

డొంక తిరుగుడు వ్యవహారాలు, ముఖమాటాలు నాకు సరిపడవు. ఇబ్బందిగా ముఖం పెట్టి "అసలు విషయం చెప్పండి ప్రొఫెసర్!" అన్నాడు.

మాలవ్యా ఒక క్షణం నాభావాల్ని పసిగడుతున్నట్లుగా చూసి, చెప్పడం ప్రారంభించాడు:

"మిస్టర్ రామ్‌జీ! ఇటీవల మా పురాతత్వపరిశోధన శాఖవారికి కొన్ని తాళపత్రాలు దొరికాయి. అవి చాలా ప్రాచీనమైనవి. చారిత్రకంగా వాటి విలువ చాలా ఎక్కువ. అందులో కొన్ని తాళప్రతాలు 'చువాంగ్' అనే చైనీయ యాత్రికుని గ్రంధానికి సంబంధించినవి. తన యాత్రాను భవానులను, దర్శించిన స్థలాలను వివరంగా వ్రాసాడు. ఈ గ్రంథంలోని కొన్ని పేజీలు మాత్రమే మనకు లభ్యమయ్యాయి.

అందులో ఒకచోట అతడు మన దేశంలోని వింధ్య పర్వతాల మధ్యనున్న భయంకర అరణ్యాలగుండా ప్రయాణం చేసినట్లు వ్రాసాడు. అంతే కాదు, ఆ అరణ్యంలో ఒక ఆలయాన్ని చూసినట్లు, ఆ ఆలయంలోని మూల విగ్రహం భారతీయుల శిల్పకళానైపుణ్యానికి చిహ్నంగా వున్నట్లుగా అభివర్ణించాడు."

చెప్పటం ఆపి, నేను శ్రద్ధగా వింటున్నానో లేదో అని పరిశీలనగా చూశాడు.

"ఎస్...ప్రొసీడ్" అన్నాను. మాలవ్యా ఒకసారి గొంతు సవరించుకుని తిరిగి చెప్పడం ప్రారంభించాడు.

"మా డిపార్టుమెంటు వారి పరిశోధన ప్రకారం ఆ తాళపత్రగ్రంథం రెండువేల సంవత్సరాల క్రిందటిది. ఈ విషయాన్నిబట్టి ఆలోచిస్తే ఆ ఆలయంలో ఖచ్చితంగా రెండువేల సంవత్సరాల చరిత్ర కలదని మనం అంగీకరించాలి.

"అంతేకాదు, ఆ విగ్రహాన్ని 'చువాంగ్' తన గ్రంథంలో అపూర్వంగా వర్ణించాడు. 'చువాంగ్' మామూలు యాత్రీకుడు కాదు. ప్రపంచంలోని చాలా భాగాన్ని పర్యటించి, ఆయాదేశాల సంస్కృతిని, కళలను బాగా పరిశీలించిన వ్యక్తి. అటువంటి వ్యక్తి ఆ విగ్రహాన్ని గొప్పగా వర్ణించాడంటే, ఆ విగ్రహానికి శిల్పశాస్త్రరీత్యా ఎంత విలువ వుంటుందో ఆలోచించు."

నా ముఖంలోకి చూశాడు. నేను సిగరెట్‌ను గట్టిగా దమ్ములాగి, యాష్‌ట్రేలో పడవేశాను.

"అఫ్‌కోర్స్. మీరు చెప్పినదానినిబట్టి ఆ విగ్రహం అపురూపమైనదనే భావించాలి. ఇంతకీ ఆ విగ్రహం యిప్పుడు ఎక్కడుంది?" అడిగాను.

నా ప్రశ్నకు చిత్రంగా నవ్వేరు మాలవ్యా.

"బహుశా, ఆ అరణ్యాలలోనే ఇంకా వుండవచ్చును" అన్నారు నెమ్మదిగా.

"వాట్? విగ్రహం గురించి సమాచారం బైటపడినా మీ డిపార్టుమెంటు ఏమి చెయ్యకుండా కూర్చుందా?" విస్మయంగా అడిగాను.

"సమాచారం ఇంకా బైటపడలేదు రామ్‌జీ! ఈ తాళ

పత్రాలను పరిశీలించి, రిపోర్టు తయారు చెయ్యాల్సిన వ్యక్తిని నేనే. కనుక, ఈ విషయం యింకా వెల్లడి కాలేదు. వెల్లడయిన మరుక్షణంలోనే మా డిపార్టుమెంటు ఆ విగ్రహం గురించి ప్రయత్నాలు కొనసాగిస్తుంది.''

గదిలో లైట్ వెలిగింది. ఇంటర్ కమ్యూనికేషన్ స్విచ్ను ఆన్ చేసి ''యస్. కమిన్'' అన్నారు.

ట్రేలో ఖాళీగ్లాసుల్ని, ఐస్ఫ్లాస్కును, జానీవాకర్ను తీసుకువచ్చి టీపాయిమీద వుంచి వెళ్ళిపోయాడు బట్లర్.

మాలవ్యా బాటిల్ ఓపెన్ చేసి గ్లాసుల్లో సర్ది, ఐస్ ముక్కలు వేశాడు. ఒక గ్లాసును నాకు అందించాడు.

''ఫర్ ది జెస్ట్ ఆఫ్ బోత్'' అంటూ ఛీర్స్ చెప్పి 'సిప్' చేశాడు ప్రొఫెసర్ మాలవ్యా.

నేను సగం తాగి సిగరెట్ వెలిగించాను.

''నాదో చిన్న అనుమానం ప్రొఫసర్!'' అన్నాను మెల్లగా.

''ఏమిటది?''

''రెండువేల సంవత్సరాల క్రితం ఎవడో యాత్రికుడు వ్రాసిన దానినిబట్టి 'విగ్రహం' గురించి చెబుతున్నారు మీరు. ఇంకా, ఆ విగ్రహం ఆలయంలోనే వుంటుందని గ్యారంటీ ఏమిటి?'' ప్రశ్నించాను.

''చాలా చక్కని అనుమానాన్ని వ్యక్తం చేశావు రామ్జీ! లాజికల్గా ఆలోచిస్తే నీ ప్రశ్న సరైనదే. కాని, కేవలం గ్రంథంలోని వ్రాతను ఆధారం చేసుకుని, యింకా ఆ విగ్రహం అక్కడే వుంటుందని నమ్మేటంతటి ఫూల్ను కాను. రెండువేల సంవత్సరాలంటే తక్కువ కాలమేం కాదు.

కాని, ఆ విగ్రహం యింకా అక్కడే వుంది. నాగరిక ప్రపంచానికి దూరంగా, భయంకర అడవుల్లో వుంది కనుకనే ఆ విగ్రహం యింకా స్థానభ్రంశం చెందలేదు. ఈ విషయాన్ని తెలుసుకోగలిగాను కనుకనే నిన్ను రమ్మని ఫోను చేశాను..." గంభీరంగా అన్నాడు మాలవ్యా.

విచిత్రంగా ప్రొఫెసర్‌ను చూశాను.

"ఆ విగ్రహం యింకా అక్కడే వుందని ఎలా తెలుసుకోగలిగారు?"

నా ప్రశ్నకు కొంతసేపు మౌనం వహించారు మాలవ్యా. ఏదో విషయాన్ని చెప్పడానికి సంశయిస్తున్నట్లున్నాడు.

నేను విస్కీ గ్లాసును పూర్తి చేశాను.

"మజ్‌ధూర్ పేరు వినేవుంటావు కదూ?!?"

మామధ్య అంతవరకూ ఏర్పడిన నిశ్శబ్దాన్ని భంగం చేస్తూ అడిగారు మాలవ్యా.

'మజ్‌ధూర్' పేరు వింటూనే వులిక్కిపడ్డాను. ప్రముఖ విప్లవకారుడు మజ్‌ధూర్! ప్రభుత్వాన్ని పతనం చెయ్యడానికి అనేక ఘోరకృత్యాలు గావించాడు. అతనిని పట్టుకున్నవారికి లేదా చంపినవారికి లక్షరూపాయలను బహుమతిగా ప్రభుత్వం ఎన్నడో ప్రకటించింది. అయినా, అతను యింతవరకూ తప్పించుకు తిరుగుతున్నాడు.

మాలవ్యా ప్రశ్నకు తెలుసునన్నట్లుగా తలాడించాను.

"మజ్‌ధూర్ నాకు చిన్ననాటి స్నేహితుడు. పెద్దవాళ్ళమయ్యాక మా దారులు వేరయ్యాయి. కాని, మా స్నేహం చెడలేదు. ప్రభుత్వందృష్టిలో అతడు శిక్షార్హుడు. అతడ్ని పట్టించినవారికి, లేదా చంపినవారికి బహుమతిని

ప్రకటించింది ప్రభుత్వం. అతడ్ని అరెస్టు చెయ్యడానికి ఎన్నో వలలు పన్నింది.

పరిస్థితులు ప్రమాదకరంగా తయారవటం గమనించి వింధ్యారణ్యాలకుపోయి తల దాచుకున్నాడు మజ్‌ఘూర్.

గతసంవత్సరం వింధ్యపర్వతాలకు దగ్గరలో నున్న నర్మదానదీ ప్రాంతాలలో మా డిపార్ట్‌మెంట్ పరిశోధనలు ప్రారంభించింది. నెలరోజులకు పైగా త్రవ్వకాలు జరిగాయి.

ఆ రోజుల్లో 'మజ్‌ఘూర్' నన్ను నర్మదానదీతీర ప్రాంతంలో కల్సుకున్నాడు. మనిషి అనారోగ్యంవలన బాగా కృషించి వున్నాడు. వింధ్యారణ్య ప్రాంతంలో తలదాచుకున్నట్లు చెప్పాడు. ఎంతయినా, బాల్యస్నేహితుడు. రెండురోజులు ఆతిథ్యం ఇచ్చి నా గుడారంలోనే వుంచుకున్నాను.

ఒకరోజు, మాటల సందర్భాన వింధ్యారణ్యంలో ఒక చోట ఆలయాన్ని చూశానని, అందులో విగ్రహం అత్యంత సౌందర్యవంతమైనదని చెప్పాడు. ఆ సమయంలో ఈ విషయానికి అంత ప్రాధాన్యత ఇవ్వలేదు. ఈ తాళపత్రాలలో విషయాన్ని చదివేసరికి మజ్‌ఘూర్ చెప్పింది కూడా గుర్తుకు వచ్చింది. తాళపత్రాలలో 'చువాంగ్' వర్ణించిన ఆలయానికి, మజ్‌ఘూర్ చెప్పిందా వ్యత్యాసం లేదు. దీన్నిబట్టి, ఆ విగ్రహం యింకా అక్కడే వుంటుందన్న అభిప్రాయానికి వచ్చాను."

చెప్పటం ముగించాడు మాలవ్యా. తన గ్లాసులో యింకా మిగిలివున్న విస్కీని ఖాళీచేశాడు.

"ఆ విగ్రహం ఎంత విలువ చేస్తుందో తెల్సా?" నా

ఆలోచనలకు అంతరాయం కల్పిస్తూ అడిగాడు మాలవ్యా.
నేను తల అడ్డంగా ఆడించాను.

"ఒక విదేశీయుడినుంచి నల భైలక్షలకు ఆఫరుంది."

"మైగాడ్!" ఆశ్చర్యపోయాను. పెద్ద బేరమే తగులు తుందని భావించాను కాని మరీ యింత పెద్ద ఆఫరు వస్తుం దని అనుకోలేదు.

"నన్ను యిప్పుడేం చెయ్యమంటారు ప్రొఫెసర్?" సాలోచనగా మాలవ్యాను చూస్తూ ప్రశ్నించాను.

"నువ్వు ఆ విగ్రహాన్ని సంపాదించాలి" గంభీరంగా అన్నాడు.

నేను తలాడించాను. నలభైలక్షలగురించి ఎటువంటి రిస్కు నయినా తీసుకోవచ్చును.

"ఆలయాన్ని గుర్తించడానికి 'మజ్ధూర్' సహాయం తీసుకుంటే మంచిదనుకుంటాను" అన్నాను.

నా సూచనకు భారంగా నిట్టూర్చాడు మాలవ్యా. రిమ్‌లెస్ కళ్ళద్దాలను ఎడంచేత్తో తీసి కర్చీఫ్‌తో తుడిచాడు.

"నువ్వు చెప్పింది బాగానే వుంది రామ్‌జీ. కాని మజ్ధూర్ మనకు అందుబాటులో లేడు. అసలు, అతను యింకా జీవించి వుంటాడనుకోను. నన్ను కలుసుకున్నప్ప టికే అతని ఆరోగ్యం బాగా దెబ్బతిని వుంది. మనిషి యింకా ఎక్కువరోజులు బ్రతకడనిపించింది. యాదృచ్ఛి కంగా ఆ రోజు కలిశాడు. ఇప్పుడు తన సహకారం గురించి ఆశించడంలో అర్థంలేదు. నువ్వే ఆ ఆలయాన్ని కనుగొని విగ్రహాన్ని సంపాదించాలి."

నేను మరేం ఆలోచించలేదు. వెంటనే తలాడించాను.

"సంపాదిస్తాను. టర్మ్స్ ఏమిటి?" ముందుగానే అన్ని విషయాలు మాట్లాడుకుంటే మంచిదన్న అభిప్రాయంతో అడిగాను.

"ఫిఫ్టీ...ఫిఫ్టీ..." అన్నాడు ప్రొఫెసర్.

సరే అన్నట్లుగా తల పంకించాను.

"మిస్టర్ రామ్‌జీ! ముఖ్య విషయం చెప్పడం మరిచాను. చాముండేశ్వరిదేవి వింధ్యారణ్య ప్రాంతాల ఆటవికులకు కులదేవత. ఆటవికులు ఎంత ప్రమాదస్తులో అంత సాత్వికులని మజ్‌ధూర్ చెప్పాడు. జాగ్రత్తగా వ్యవహరించాలి" హెచ్చరించాడు ప్రొఫెసర్.

నొసలు చిట్లించాను.

దొంగలతోను, పోలీసులతోను, కస్టమ్స్‌వాళ్ళతోను అనేక సమయాల్లో రిస్క్ తీసుకున్నాను.

కాని, ఆటవికులతో యింతవరకూ లేదు. ఇదొక, కొత్త అడ్వెంచర్.

ఖాళీగ్లాసులోకి కొంత విస్కీని వొంపుకుని ఐస్ ముక్కలు వేసుకున్నాను. నిమిషంలో ఖాళీ చేశాను.

బుర్ర చురుగ్గా పనిచేస్తుంది. నా ఆలోచనలన్నీ విగ్రహం గురించి. ఆటవికులతో వ్యవహారం కాబట్టి, కొత్త రకం పద్ధతులు అవలంభించాలి. నావల్టీ ఆపరేషన్!

"వింధ్యారణ్యాలు విస్తీర్ణమైనవి. అందులో ఆలయాన్ని కనుగోవడం చాలా కష్టం. నర్మదానదీ ప్రాంతంలో మేం త్రవ్వకాలు జరిగినప్పుడు అక్కడున్న 'భావనగర్' గ్రామంలో 'సులేఖాన్' అనే అతను నాకు స్నేహితుడయ్యాడు. అతను వింధ్యారణ్యాలలో జంతువులను పట్టుకుని వాట్ని అమ్ముకొని జీవిస్తుంటాడు. చాలా పెద్ద

వ్యాపారం సులేఖాన్ ది. అతని సహాయం నీకు వింధ్యా రణ్యాలలో కొంత ఉపయోగించవచ్చు.

నా మిత్రుడువిగా నిన్ను సులేఖాన్ కి పరిచయం చేసుకో. నేను పంపించినట్లుగా చెప్పు. ఇంతవరకే ఈ ఆపరేషన్ లో నేను నీకు సహాయం చేయగలను. ఎలా విగ్రహాన్ని సంపాదిస్తావో...ప్లానంతా నువ్వే ఆలోచించాలి'' అన్నాడు మాలవ్యా.

ఆ విషయం నాకు చెప్పక్కర్లేదు. నా మార్గాలు నాకు వుంటాయి.

నేను కుర్చీలోనుండి లేచాను. ప్రొఫెసర్ కూడా లేచాడు. ఐరన్ సేఫ్ తెరిచి ఒక జిప్ బ్యాగ్ తీసి నాకు యిచ్చాడు.

''ఇందులో లక్షరూపాయలున్నాయి. అడ్వాన్సుగా రెండులక్షలు యిచ్చారు. అందులో మన అగ్రిమెంట్ ప్రకారం సగం యిస్తున్నాను'' అన్నాడు.

బేగ్ ను నిర్లక్ష్యంగా అందుకున్నాను.

''థాంక్స్ ప్రొఫెసర్! మీకు మరల నేను విగ్రహంతో నే కనిపిస్తాను'' అన్నాను.

''వన్ మినిట్ ప్లీజ్! ఈ మినియేచర్ వైర్ లెస్ సెట్ ను నీదగ్గరవుంచు. ప్రతిరోజు దీనిద్వారా నీప్రోగ్రస్ ను తెలియపరచాలి'' అన్నాడు.

నేను చిన్నగా నవ్వి, సెట్ ను తీసుకొన్నాను.

## 2

సాయంకాలం అయిదున్నరయింది.

చలికాలం కావటంవలన త్వరగా చీకటి రేఖలు వ్యాపిస్తున్నాను. ఢిల్లీలో చలి విపరీతం.

నేనూ, అజాద్ లాంగ్ కోట్స్ వేసుకున్నాం. అజాద్ నాకు అసిస్టెంట్ లాంటి వాడు.

అజాద్ ఆచార్యా అనే శిల్పాచార్యుడ్ని తీసుకు వచ్చాడు. మనిషి సన్నగా, రివటలాగున్నాడు.

కల్లీ లాల్చీ తొడుక్కుని, దానిమీద నెహ్రూ స్టైల్ ఉన్నకోటును వేసుకున్నాడు.

అజాద్ నా సూచనమేరకు హిప్పీలాగ స్టయిల్ను మార్చేడు. నేనూ కూడా అదేమాదిరిగా తయారయ్యాను మెడలో రుద్రాక్షమాలలు.

ప్రయాణానికి కావల్సిన సరంజామంతా సిద్ధంచేశాను. వాటిని కారులో పెడుతున్నారు ఆచార్య, అజాద్లు.

సామాను సర్దటం పూర్తయింది.

అజాద్, ఆచార్యలు కారు వెనుకసీటులో కూర్చు న్నారు. డ్రయివింగ్ సీట్లో కూర్చుని, కారును స్టార్ట్ చేశాను.

అరగంటలో మా ఫియట్ కారు ఢిల్లీనగరాన్ని దాటి, 'ఇండోర్' వెళ్ళే రోడ్డుమీద రయ్‌మంటూ దూసుకు పోసాగింది.

మధ్యలో రెస్టుకు ఎక్కడా కారును ఆపదల్చుకో లేదు. రాత్రి భోజనాలను ఆగ్రాలో పూర్తిచేసుకుని రాత్రంతా కారులో ప్రయాణించాం. అజాద్ ఆగ్రాలో స్టీరింగ్ను తీసుకొన్నాడు.

డ్రయివింగ్‌లో అజాద్ నాకన్నా మంచి ఎక్స్‌పర్ట్. ఎనభైమైళ్ళ వేగంతో కారును పోనిస్తున్నాడు.

చల్లని గాలికి శరీరం వణుకుతుంది.

కారు విండోడోర్స్ బిగించాను.

విగ్రహాంగురించి వేసుకున్న ప్లానులో ఏమైనా లోటు

పాట్లు వున్నాయేమోనని ఆలోచిస్తూ సిగరెట్ వెలిగించాను.

ఆలోచనల్లోనే నిద్రపట్టేసింది.

తెలివి వచ్చేసరికల్లా తూర్పుదిక్కున చీకట్లు చెదురుతున్నాయి. సూర్యోదయానికి చిహ్నంగా వాతావరణం ఆహ్లాదకరంగావుంది. సిగరెట్ పొగవదుల్తూ సీరియస్‌గా కారు నడుపుతున్నాడు అజాద్. ఆరున్నరకల్లా 'ఝూన్సీ' చేరుకున్నాం.

"వండ్రఫుల్ డ్రయివింగ్" అన్నట్లుగా అజాద్ భుజాన్ని ఆప్యాయంగా తట్టేను.

'ఝూన్సీ'లోని కాంటినెంటల్ కాటేజీకి వెళ్ళాం. డబుల్ ఎసి రూం బుక్ చేశాడు అజాద్.

పదిగంటలకల్లా కాలకృత్యాలు ముగించి, టిఫిన్ చేసి, తిరిగి ప్రయాణానికి రెడీ అయ్యాం.

"అజాద్! నువ్వు పడుకో నేను డ్రయివ్ చేస్తాను" అన్నాను.

మా ప్రయాణం మొదలయింది. భూపాల్ మీదుగా 'యిండోర్' చేరుకోవాలని నా ఉద్దేశ్యం.

రెండురోజుల్లో, అంటే రేపటి సాయంకాలానికల్లా యిండోర్ చేరుకోవాలి.

నా దృష్టినంతా డ్రయివింగ్ మీద నిమగ్నం చేసాను.

# 3

మా ప్రయాణం అనుకున్నట్లుగానే సాగింది.

కారు 'ఇండోర్'లో ఆగినప్పుడు 'ఆచార్య' ప్లాస్టరాఫ్ పారిస్ పౌడరు డబ్బా పెద్దది కొన్నాడు.

'భావనగర్'ను ఎటువంటి ఆటంకాలు లేకుండా చేరుకున్నాం.

ప్రొఫెసర్ మాలవ్యా స్నేహితుడు 'సులేఖాన్'ను కలుసుకోవడం ఏమంత కష్టం కాలేదు.

మనిషి భారీగా, భయంకరంగా వున్నాడు. మెడలో బంగారు గొలుసుకి పులిగోరు పతకం వుంది. చేతినిండా ఉంగరాలు.

'సులేఖాన్'కు నమస్కరించి, ప్రొఫెసర్ మాలవ్యా పంపించినట్లుగా చెప్పాం. మాలవ్యా పేరు వినగానే మాకు అతిథి మర్యాదలు చక్కగా జరిపించాడు సులేఖాన్. మేం వచ్చిన పని గురించి అడిగాడు. నేను గొంతు సవరించుకున్నాను.

"ఈ వింధ్యారణ్య ప్రాంతంలో చాముండేశ్వరిదేవి ఆలయంవుంది. ఆదేవిని సందర్శించి ధన్యులమవుదామని మా కోరిక. ఆ ఆలయానికి మార్గం మీకు తెలిసివుండవచ్చునని మాలవ్యా చెప్పారు" అన్నాను, సాధ్యమైనంతవరకూ గొంతులో భక్తిని ధ్వనింపచేస్తూ.

నా మాటలకు సులేఖాన్ భృకుటి ముడిపడింది. తీక్షణంగా నావైపు చూశాడు. ఆ చూపులో భావాన్ని పసికట్టడానికి నాకు శక్తి చాలింది కాదు.

"ఆ ఆలయం ఎంత మాత్రం ప్రసిద్ధి చెందినది కాదు' దాని వునికి గురించి నాగరిక ప్రపంచానికి ఎంత మాత్రం తెలియదని చెప్పవచ్చును. అటువంటి ఆలయాన్ని వెదుక్కుంటూ మీరు రావడం ఆశ్చర్యంగా వుంది," అన్నాడు చేతికున్న వ్రేలి వుంగరాలను సవరించుకుంటూ.

మేం మాటాడలేదు.

"ఇంతకీ ఆ ఆలయం వింధ్యారణ్యాలలో వున్నట్లు ఎలా తెలిసింది?" అనుమానంగా చూస్తూ ప్రశ్నించాడు'

ధైర్యాన్ని, యుక్తిని ప్రదర్శించకపోతే సులేఖాన్ చేతిలో దెబ్బ తినాల్సి వుంటుందనుకున్నాను.

"ఇతను నా స్నేహితుడు. గొప్ప దేవీ భక్తుడు. చాముండేశ్వరిని ఉపాసిస్తున్నాడు. కలలో కనబడి తాను వింధ్యారణ్యాలలో వున్నట్లుగా, తనను అక్కడ దర్శించవచ్చునని సెలవిచ్చింది," అన్నాను అజాద్‌ను చూపించి.
ఇది నిజమేనా అన్నట్లుగా చూసి, గంభీరంగా తలాడించాడు.

"ఈ రాత్రికి మీరు విశ్రాంతి తీసుకోండి. రేపు వుదయాన్నే బయల్దేరి వెళ్ళుదురుగాని. మీకు తోడుగా మా మనిషిని పంపిస్తాను. వారంరోజులు అరణ్యంలో కాలినడకన ప్రయాణిస్తేగాని, మీరు ఆ ఆలయాన్ని చేరుకోలేరు" అన్నాడు.

'హమ్మయ్య!' అనుకుని, నిట్టూర్చాను. ఇంతవరకూ అంతా సవ్యంగానే జరిగింది.

ఆ రాత్రికి మాకు విందు ఏర్పాటుచేశాడు సులేఖాన్. అడవిపంది మాంసం మా గురించి ప్రత్యేకంగా వండించాడు. రుచిగా వుంది. ద్రాక్షసారాయిని పీకలదాకా ఎక్కించాం. సులేఖాన్ మేం ఆశ్చర్యం చెందేలాగ చిత్తుగా తాగేడు. నేను 'జానీవాకర్'ను బహూకరిస్తే, గోల్డ్‌స్పాట్ తాగినట్లుగా గడగడ త్రాగేడు.
విందులో మాటల సందర్భంలో ఆటవిక నాయకుడు తనకు స్నేహితుడని చెప్పాడు సులేఖాన్. క్రూరమృగం బారినుండి నాయకుడ్ని ఒకసారి సులేఖాన్ రక్షించాడట. తాగిన మైకంలో జంతువులను పట్టడానికి అడవిలో ఎటువంటి సాహసాలను చేసింది చెప్పాడు.

మేం అనుకున్నట్లుగా సులేఖాన్ చిన్న జంతువుల వ్యాపారస్తుడు కాదు. పులులను, ఎలుగుబంట్లను యింకా యితర క్రూరమృగాలను పట్టుకుని విదేశాలకు ఎగుమతి చేస్తుంటాడు సులేఖాన్. అతని పరిచయం లభించినందుకు చాలా ఆనందించాను.

విందు ముగిసిన తరువాత సులేఖాన్‌కు "గుడ్ నైట్" చెప్పి, మాకు కేటాయించిన గదికి వెళ్ళిపోయాం.

ద్రాక్షసారా ప్రభావం కాబోలు, మత్తుగా నిద్ర పట్టింది నాకు.

# 4

సూర్యుని కిరణాలు చురుక్కుమనిపించటంతో కళ్ళు తెరిచాను. టైం చూశాను. ఏడుగంటలయింది.

అజాద్, ఆచార్య, యింకా నిద్రపోతున్నారు. తట్టి లేపాను. ముగ్గురం కాలకృత్యాలు గబగబా ముగించుకున్నాం.

ఉదయం ప్రయాణం అని చెప్పాడు సులేఖాన్. ఇంకా రాలేదు.

సులేఖాన్ గది మా గదికి కొద్ది దూరంలోనే వుంది. సులేఖాన్‌ను కల్సుకు వస్తానని నా అనుచరులిద్దరికి చెప్పి బయలుదేరాను.

సులేఖాన్ యింకా నిద్రపోతున్నాడు. రాత్రి తాగిన మందు ప్రభావం యింకా తగ్గలేదు కాబోలనుకున్నాను.

నా రాకను పసికట్టి పులిపిల్ల గుర్రుమంది. ఉలిక్కిపడ్డాను. అంతవరకూ నేను గమనించలేదు. సులేఖాన్ పక్కలోనే పడుకుంది పులిపిల్ల. వెనక్కు రెండడుగులు వేశాను.

పులిపిల్ల గుర్రుపెట్టడం విని, బద్ధకంగా కళ్ళు తెరిచి నన్ను చూశాడు. కర్తవ్యం గుర్తుకు వచ్చినవాడిలా గబుక్కున లేచి కూర్చున్నాడు.

"సారీ. మీ ప్రయాణానికి ఆలస్యం జరిగింది" అన్నాడు నొచ్చుకున్నట్లుగా.

ఫరవాలేదన్నట్లుగా నేను నవ్వేను. పులిపిల్ల ఆప్యాయంగా యజమాని కాళ్ళను నాకుతూంది.

"క్రూరమృగాన్ని పక్కలో పెట్టుకుని పడుకున్నారు. ప్రమాదం కదా?" అడిగాను.

నా ప్రశ్నకు విచిత్రంగా నవ్వేడు సులేఖాన్. ప్రేమగా పులిపిల్లి వీపు నిమిరాడు.

"మనిషికన్నా ఎన్నోరెట్లు ఈ జంతువు నయం. ఎదుటివాడికి ఇవి హాని కలిగించాలనుకుంటే, ముందుగా హెచ్చరిస్తున్నట్లుగా గర్జించి పంజా విసురుతాయి. కాని మనుషులలా కాదు. భుజంమీద చెయ్యివేసి కబుర్లు చెబుతూనే వెన్నుపోటు పొడుస్తారు. మనిషిని నమ్మి నిద్రపోవడం కన్నా జంతువును నమ్మటం మంచిది."

సులేఖాన్ మాటలకు అంగీకార సూచనగా తలాడించాను.

"వెల్. మీరు ప్రయాణానికి సిద్ధంగా వున్నట్లుంది. మా అనుచరుడ్ని పిలుస్తాను" అంటూ కేక వేశాడు.

ముప్ఫయి సంవత్సరాల వ్యక్తి గబగబా వచ్చేడు.

"వింధ్యారణ్యంలో ఆలయానికి నువ్వు వీరిని తీసుకు వెళ్ళాలి. అక్కడి నాయకుడితో వీరిని నేను పంపించినట్లుగా చెప్పు" అంటూ సూచనలిచ్చాడు.

అలాగే నన్నట్లుగా తలాడించాడు ఆ వ్యక్తి. అతడి

పేరు వీరడని తెలియచేశాడు సులేఖాన్.

నేను సులేఖాన్ దగ్గర సెలవు తీసుకుంటుంటే, ఒక హెచ్చరిక చేశాడు.

"మీరు చాముండేశ్వరిదేవి దర్శనానికిగాను వెళ్తున్నట్లు చెప్పారు. నేను కూడా ఆ దేవి భక్తుడ్నే. చాలా మహిమగల తల్లి. మాలవ్యా నాకు మిత్రుడు. అందుచేత మీకు సహాయం చేస్తున్నాను. అక్కడి ఆటవిక నాయకుడు నాకు మిత్రుడే కావచ్చు. కాని వారు కఠిన నియమాలను పాటిస్తారు. మీరుకూడా పాటించాలి. లేకపోతే, ప్రాణం తియ్యడానికి కూడా వెనుదియ్యరు. బై ది బై మీరు సదుద్దేశ్యంతోనే ఆలయానికి వెళ్తున్నారని భావిస్తున్నాను. నా అంచనా తప్పు అయితే ఫలితాన్ని మీరే అనుభవిస్తారు."

సులేఖాన్ చెప్పిందంతా జాగ్రత్తగా విని, సెలవు తీసుకున్నాను.

## 5

వింధ్యారణ్యాలు!

వాటిలో చాలా భయంకరమైన అరణ్యభాగం అది. వీరడు ముందు దారి తీస్తున్నాడు.

నేను, అజాద్, ఆచార్య అతని వెనకనే సాగి పోతున్నాం.

మా ప్రయాణానికది తుదిరోజు.

సాయంకాలానికల్లా ఆలయ ప్రాంతాలలో నున్న ఆటవికుల గూడెంకు చేరుకుంటామని చెప్పాడు వీరడు.

అందరి ముఖాలలోను గమ్యాన్ని చేరుకుంటున్నామన్న ఆనందం తాండవిస్తుంది. అంతవరకు పడిన శ్రమను మరిచి

పోయి, వుత్సాహంగా వున్నారు.

వీరడు మధ్యాహ్నం ఓ కుందేలును వేటాడి,మాంసాన్ని కాల్చి యిచ్చాడు. పెప్పర్ జల్లుకుని తిన్నాం. టేస్ట్ ఫుల్‌గా వుంది.

మధ్యాహ్నం మూడుగంటల ప్రాంతంలో సమతల ప్రదేశానికి అంతా చేరుకొన్నాం. మేమున్న ప్రదేశంలో చెట్లు గుబురుగా లేవు. కనుచూపు దూరంలో అక్కడక్కడా చిన్న చిన్న గుడిసెలు కనిపిస్తున్నాయి. గూడెంను సమీపించినట్లుగా చెప్పాడు వీరడు.

అరగంటలో అందరం అక్కడకు చేరుకున్నాం.

ఆటవికుల్లో చాలామంది మమ్మల్ని చూడగానే వింతగా అరుస్తూ చుట్టుముట్టేరు.

అందరి చేతుల్లోను విల్లంబులూ, ఈటెలూ వున్నాయి.

వీరడు వాళ్ళ భాషలో ఏదో చెప్పాడు.

మాకు ఆ భాష అర్థం కాలేదు.

"పదండి, నాయకుడి దగ్గరకు వెళ్దాం" అన్నాడు వీరడు.

కొందరు ఆటవికులు దారి చూపగా, నాయకుడు వున్న గుడిసె దగ్గరకు వెళ్ళాం.

వెదురు బొంగులతో నిర్మించిన గుడిసె అది. అందంగా, శుభ్రంగా వుంది.

వాళ్ళ భాషలో మమ్మల్ని నాయకుడికి పరిచయం గావించాడు. మేం నమస్కరించాం.

చూడ్డానికి పెద్ద భయంకరంగా నాయకుడు లేడు. పొట్టిగా, లావుగా వున్నాడు.

మొలకు పులిచర్మం చుట్టుకున్నాడు.

పక్కలో, కొమ్ము ఒరలో బాకు వుంది.

మేం సులేఖాన్ పంపిన మనుష్యులమని తెలియడం వలన మాకు చిక్కటి పాలు, అరటిపండ్లు తెప్పించి యిచ్చాడు.

వాళ్ళభాషలో మమ్మల్ని ఏదో అడిగాడు.

మాకు అర్థంకాలేదు. వీరడి ముఖంలోకి చూశాను.

"మీరు ఎందుకు వచ్చారో, కారణం అడుగుతున్నారు" విశదీకరించాడు వీరడు.

చాముండేశ్వరిదేవి దర్శనానికి వచ్చినట్లుగా చెప్పాం. అంతేకాకుండా, ఆదేవి తమ కలలో కనిపించినట్లు, యిక్కడకు వెళ్ళమన్నట్లుగా అబద్ధం చెప్పాం.

మా మాటల్ని వాళ్ళభాషల్లోకి తర్జుమా చేసి చెప్పాడు వీరడు.

ఆటవికుల నాయకుడు సంతృప్తిగా తలాడించి, ఆకాశం లోకి భక్తిగా చూసి నమస్కరించాడు.

కొందరు ఆటవికుల్ని పురమాయించి మాకు వసతి సదుపాయాలు ఏర్పరచి, వీరడితో కొంతసేపు ముచ్చటించి వెళ్ళిపోయాడు నాయకుడు.

అతనేం మాట్లాడేడో వీరడ్ని అడిగాం.

"ఆలయం రెండుమైళ్ళ దూరంలోవుంది. రాత్రి అయింది కనుక రేపు వెళ్ళవచ్చు. ఈరాత్రికి తిని, పడుకోండి" అని చెప్పాడట నాయకుడు.

లేడిమాంసం, అడవిలో దొరికేపళ్ళు, తేనె పంపించారు.

కడుపునిండా తిని, తేనె తాగేం.

ఆరాత్రి చాలాసేపు ఆటవికుల భాషగురించి చెప్పాడు వీరడు. కొన్ని మాటలకు అర్థాలు తెలిసాయి.

# 6

మర్నాడుదయాన్నే అందరం కలసి ఆలయానికి బయలుదేరాం. నాయకుడుకూడా త్రిశూలంలాంటి ఆయుధాన్ని పట్టుకుని మా వెంట వచ్చాడు.

ముప్పావుగంట ప్రయాణించి ఆలయాన్ని చేరుకున్నాం.

ప్రాచీనమైన ఆలయమని చూడగానే తెలుస్తుంది.

చిన్న కొండను దొలిచి ఆలయంగా నిర్మించారు. ఆ ఆలయానికి చుట్టుప్రక్కల నాలుగయిదు తాటాకుపాకలు వున్నాయి.

ఆలయంలోకి అడుగుపెట్టాం. లోపల మాంత్రికుడిలాగున్న వ్యక్తి మమ్మలను చూస్తునే లేచినిలబడి, నాయకుడిని ఆశీర్వదిస్తున్నట్లుగా చెయ్యెత్తాడు. మొలకు ఎలుగుబంటి తోలు చుట్టివుంది. జడలు కట్టిన జుత్తును సిగ చుట్టి ముడివేసుకున్నాడు. కళ్ళు ఎర్రగావున్నాయి. నుదిటికి రూపాయంత ఎర్రని బొట్టువుంది. మెడలో రుద్రాక్ష మాలలు.

మేంవచ్చిన పనిగురించి నాయకుడు పూజారికి చెప్పాడు. పూజారి పేరు గణాచారి. ఇప్పుడు వాళ్ళభాష కాస్త అర్థమవుతుంది నాకు. రాత్రంతా చాలా పదాలకు అర్థాలు తెలుసుకున్నాను వీరడివలన. వాళ్ళభాష చాలా సులభమైందిగా తోచింది.

గర్భగుడిలోకి వెళ్ళాం.

నా కళ్ళను నేనే నమ్మలేకపోయాను.

పులికొవ్వు నూనె దీపం వెలుగులో చాముండేశ్వరిదేవి దేదీప్యమానంగా ప్రకాశిస్తుంది.

ఆ సౌందర్యానికి ముగ్ధుడినయ్యాను.

అజాద్ ఆ విగ్రహంవంక కళ్ళప్పగించి చూస్తున్నాడు. ఆచార్య సరేసరి.

మేం దేవి ఉపాసులమని చెప్పాడు వీరడు.

దేవిని దర్శించిన తరువాత అందరం బైటకువచ్చాం.

తిరిగి గూడెంను చేరుకుంటే నా ప్లాను దెబ్బతింటుంది. ఆలోచించాను. పరిసరాలను జాగ్రత్తగా పరిశీలించాను.

"నాయకా! మీరు అనుమతిస్తే మేం యిక్కడే వుండి దేవిని వుపాసిస్తాం" అన్నాను పదాలను తడుముకుంటూ.

ఇంత త్వరగా వాళ్ళ భాషలో మాట్లాడినందులకు ఆశ్చర్యపోయాడు నాయకుడు. అంతా ఆ దేవి చలువ అన్నాను.

నా పట్టుదల సంగతి అతడికేం తెలుసు?

నా మాటలకు అంగీకరించి, మా వసతికి, పూజలకు అన్ని ఏర్పాట్లు చెయ్యమని గణాచారితో చెప్పాడు. మేం వెళ్ళిపోతున్నప్పుడు తనను కల్సుకోవల్సిందిగా కోరాడు.

గణాచారి తనవెంట ఒక గుడిసెలోకి తీసుకువెళ్ళి, అందులో మేం వుండవచ్చని చెప్పాడు. ఆ గుడిసె మా నలుగురికి చాలదు. ఆ విషయాన్ని చెబితే, చాలకపోతే ఆలయం ముంగిట చెట్టుక్రింద పడుకోమన్నాడు. చేసేది లేక తలాడించాను నేను.

## 7

మధ్యాహ్నం భోజనాలయ్యాక వేపచెట్టుక్రింద కళ్ళు మూసుకుని, పద్మాసనం వేసుకుని కూర్చున్నాడు గణాచారి. నేను మెల్లగా అతని దగ్గరచేరి, కూర్చుని నమస్కరిస్తూ—

"స్వామీ!" అని మెల్లగా పిల్చాను.

కళ్ళు తెరిచి నావైపు చూశాడు.

"దేవీదర్శన భాగ్యం లభించినందుకు మాజన్మ ధన్య మైంది స్వామి!" అన్నాను భక్తి నటిస్తూ.

"అవునురా. ఆ దేవి దర్శనం దుర్లభం. మీరు యిన్నా ళ్ళకు సాధించారు. నేను అయిదువేల సంవత్సరాలనుండి ఈ చాముండేశ్వరి దేవాలయ పూజారిని. ఈ తల్లిని దర్శిం చిన యితరులు చాలా తక్కువ బహుతక్కువ" అన్నాడు తన నల్లటి గడ్డాన్ని సవరించుకుంటూ.

గణాచారి మాటలకు విస్తుపోయాను.

అయిదువేల సంవత్సరాలనుండి గణాచారి ఈ ఆల యానికి పూజారా? నమ్మశక్యంగా తోచలేదు. గణాచారిని వాచాలుడిగా తలచాను.

"ఏమిట్రా మూర్ఖా! ఆలోచిస్తున్నావు. అయిదువేల సంవత్సరాల పూజారిత్వమంటే జన్మజన్మలనుంచి అని అర్థంరా" చిద్విలాసంగా నవ్వుతూ అన్నాడు.

"పద. దేవికి సంధ్యార్చనగావిద్దాం" అన్నాడు.

నేను బయలుదేరాను పూజారి వెనకాలే.

చాముండేశ్వరి విగ్రహంముందు కూర్చుని, కళ్ళుమూసు కుని మంత్రాలు చదవసాగేడు గణాచారి.

నేను విగ్రహాన్ని చూస్తూ నిలుచున్నాను.

కాలం దొర్లిపోతుంది.

మంత్రాలను గణాచారి వేగంగా చదువుతున్నాడు.

కళ్ళుమూసుకుని పూనకం వచ్చినవాడిలా వూగు తున్నాడు.

స్వరం రానురాను ఎక్కువవుతోంది.

గణాచారి వాలకాన్ని చూస్తుంటే చాముండేశ్వరి

దేవికి నిజమైన భక్తుడే అనిపించింది. చుట్టుపక్కల ఏం జరుగుతుందో పట్టించుకునే స్థితిలో లేడు.

నేను పేంటు జేబులోనుండి మినియేచర్ ఫ్లాష్ కెమెరా తీసి, వివిధ కోణాల్లో గబగబా ఫోటోలు తీశాను.

గణాచారి మంత్రాలు చదవడం ముగించడమింకా పూర్తి కాలేదు. కెమెరాను తిరిగి జేబులో పడేసి గణాచారి దగ్గరగా కూర్చున్నాను.

చేతులు జోడించి, కళ్ళు మూసుకున్నాను.

కొంతసేపటికి గణాచారి మంత్రాలు చదవడం పూర్తి చేసి, నా భుజం తట్టి పిల్చాడు.

నేను భక్తిపారవశ్యంలోనుండి తేరుకున్నవాడిలా చూశాను. నన్ను ప్రేమగా వీపు తట్టేడు.

"సంధ్యవేళ దేవిదర్శనం చాలామంచిది. మీ వాళ్ళను పిల్చుకు రా" అన్నాడు.

నేను గుడిసెలో కెళ్ళేను.

ఆచార్య, వీరడు కూర్చుని మాట్లాడుకుంటున్నారు.

"ఆజాద్ ఎక్కడ?" అడిగాను.

గణాచారి గుడిసెవైపు చేయి చూపించాడు ఆచార్య. అటువైపు నడిచేను. నన్ను అనుసరించారు యిద్దరూ.

ఆజాద్ లోపల యిరవైసంవత్సరాల అమ్మాయితో మాట్లాడుచున్నాడు. అతనికికూడా ఆటవికుల భాష కాస్తంత వచ్చింది. ఆజాద్ మాటలకు ఆ అమ్మాయి విరగబడి నవ్వుతూంది.

నన్ను చూడగానే యిద్దరూ లేచి నిలబడ్డారు.

ఆజాద్ బైటకు వచ్చాడు.

అందరూ ఆలయంవైపు నడిచాం.

# 8

రాత్రి పదిగంటలయింది.

గణాచారి తన గుడిసెలోకి వెళ్ళిపోయాడు.

వీరడ్ని పిలిచాను.

"ఇక్కడ యికముందు జరుగబోయే విషయాలేవీ సురేఖాన్‌కు చెప్పకూడదు. అసలు, ఎవరితోనూ చెప్పవద్దు అందుకు ప్రతిఫలంగా అయిదువేలు యిస్తాను" అన్నాను.

నా మాటలధోరణికి తెల్లబోయి, నెమ్మదిగా తలాడించాడు వీరడు.

అజాద్‌ను పిలిచి కెమేరా యిచ్చి, అందులో ఫిల్మ్‌ను డెవలప్ చేసి, ప్రింట్స్ తియ్యమన్నాను.

ఆచార్యను పిలిచి చేయవలసింది చెప్పాను.

నాప్లానులో అత్యంత ముఖ్యమైన ఘట్టం యిది. అందరికి పనులు పురమాయించిన తరువాత, వేపచెట్టు క్రిందకు వచ్చి, వైర్‌లెస్ స్విచ్ ఆన్ చేసి ప్రోగ్రెస్‌నంతా మాలవ్యాకు చెప్పాను.

నా ప్రోగ్రెస్‌ను ఎంకరేజ్ చేస్తూ మెచ్చుకున్నాడు ప్రొఫెసర్.

ఇంతవరకూ ప్రతీది, ప్లాను ప్రకారం పకడ్బందీగా జరిగింది. ఆపరేషన్ క్లయిమాక్స్‌కు వచ్చింది.

విస్కీ సీసామూతతీసి సగం ఖాళీచేశాను. భవిష్యత్తు వూహిస్తూ కళ్ళుమూసుకున్నాను.

# 9

గణాచారి దగ్గరకు మేంవచ్చి అప్పుడే మూడురోజులయింది. రోజూ దేవిని పూజిస్తున్నాం.

దేవిపట్ల మాకున్నభక్తిని ఎంతో మెచ్చుకున్నాడు గణాచారి.

కొన్ని మంత్రాలను నాకు నేర్పాడు. ఇష్టం లేక పోయినా నేర్చుకోక తప్పింది కాదు.

ఆచారికి నేను చెప్పిన పని పూర్తి కావచ్చింది.

ఆచారి విగ్రహానికి తుది మెరుగులు దిద్దుతున్నాడు. అతని పక్కనే ప్లాస్టరాఫ్ పారీస్ పౌడరు, రంగుల ముద్ద లున్నాయి.

ఆశ్చర్యం!

చాముండేశ్వరిదేవి విగ్రహంకు, ఆచారి చేసిన విగ్రహానికి ఏమాత్రం తేడాలేదు.

ఆలయంలోని విగ్రహానికి ఈ విగ్రహం నకలు అని ఎవరూ అనుకోలేరు. రెండూ ఒకేలాగవున్నాయి.

ఆచార్య నైపుణ్యానికి జోహార్లర్పించాను.

"వెల్ డన్ అనుకున్న దానికన్నా బాగుంది" ప్రశంసా పూర్వకంగా అన్నాను.

ఆ దినం అమావాస్య. గణాచారి చెప్పిన దానినిబట్టి ఆ రోజంతా దేవిని వుపాసిస్తాడు. రాత్రికూడా దేవీపూజ చేస్తాడు.

నాతోపాటు మిగతావాళ్ళుకూడా వచ్చారు.

గణాచారితోపాటు మేంకూడా స్నానం చేసి, దేవి ముందుకూర్చున్నాం.

నా ప్లానులో చివరిభాగాన్ని అమలుపరచడానికి ఈ దినం చాలా అనుకూలం.

పగలంతా ప్రార్థనతోనే గడిపాం. గణాచారి కూతురు కూడా వచ్చి మాతోపాటు కూర్చుంది.

మంత్రాలతో ఆలయాన్ని దద్దరిల్ల చేస్తున్నాడు గణాచారి.

మేం ఓపిగ్గా కూర్చున్నాం.

ఎంత శ్రమపడ్డా ఈ ఒక్క రోజే.

రాత్రి కావస్తుంది. అందరం గణాచారి దగ్గర సెలవు తీసుకుని గుడిసెకు వచ్చేశాం.

ఆ రాత్రంతా దేవిని మంత్రాలతో గణాచారి కొలుస్తాడట. అతని భక్తికి నాకు ఆశ్చర్యం కలిగింది.

మా భోజనాలు ముగిసాయి.

ఇంతవరకూ మామీద గణాచారికి ఎటువంటి అనుమానం కలగకుండా జాగ్రత్తపడ్డాం.

ఆచార్య, వీరడితో బాతాఖాని కొడుతున్నాడు. అజాద్‌ని దగ్గరకు పిలిచాను.

రాత్రి పన్నెండు అయింది. వెన్నెలకాలం కావడం వలన బయటంతా పిండారబోసినట్లుగా వెలుతురుంది.

నేను, అజాద్ బైటకువచ్చాం. గణాచారి యింటివైపు పరిశీలనగా చూసి ఆలయంవైపు నడిచాం.

అజాద్ చేతిలో నకిలీ చాముండేశ్వరిదేవి విగ్రహం వుంది.

ఆలయంలో గణాచారి కళ్ళుమూసుకుని కూర్చున్నాడు పూనకం వచ్చినవాడిలా వూగుతున్నాడు. అతని పెదాలు నెమ్మదిగా కదులుతున్నాయి. మంత్రాలు చదువుతున్నాడు.

అడుగులో అడుగు వేసుకుంటూ గర్భగుడిలోకి నడిచాను. జేబులోనుండి 'స్ప్రేగన్' తీశాను. అందులో మత్తుమందు వుంది. ముక్కుకి జేబురుమాలు అడ్డంపెట్టుకుని మెల్లగా మందును గణాచారివైపు "స్ప్రే" చేశాను.

కొద్దిక్షణాలకే గణాచారి నేలకొరిగిపోయాడు. అజాద్ లోపలకు వచ్చాడు.

చాముండేశ్వరిదేవి విగ్రహాన్ని చూశాను. విగ్రహానికి బదులుగా అక్కడ నిలువెత్తు కందరూపాయల నోట్లకట్టలు వున్నట్లుగా ఫీలయ్యాను.

ఆ విగ్రహాన్ని జాగ్రత్తగాతీసి, అజాద్‌కు యిచ్చి అతడి చేతిలోని నకిలీ విగ్రహాన్ని తీసుకుని అసలు విగ్రహం స్థానంలోవుంచాను.

'మిరకల్'గా నా ప్లాను సక్సెస్ అవుతుంది.

స్పృహ కోల్పోయిన గణాచారిని సానుభూతిగా చూశాను. ఒకవేళ అతనికి తెలివివచ్చినా, భక్తిపారవశ్యంలో పడిపోయాననుకుంటాడు.

"వెర్రి పూజారి!" మనసులోనే అనుకున్నాను.

ఇద్దరం ఆలయంనుండి బైటపడి, గుడిసెవైపు నడిచాం.

# 10

"ఆపరేషన్ గ్రాండ్ సక్సెస్" మర్నాడు వుదయానే వైర్‌లెస్‌లో ప్రొఫెసర్ మాలవ్యాకు చెప్పాను. కంగ్రాచ్యులేషన్స్ చెప్పి, వెంటనే వచ్చేయమన్నాడు.

సామాన్లు సర్దుకున్నాం.

గణాచారికి చెప్పి, అతని ఆశీర్వాదాలను తీసుకున్నాం. అతనికి మామీద యింకా ఎటువంటి అనుమానం కలగలేదు.

గణాచారి కూతురు అజాద్‌వైపు చూసి చేతులూపుతూ మాకు టా, టా చెప్పింది.

నాయకుడి గూడెంకు వెళ్ళి, అతనికి చెప్పి వెళ్ళిపోవడమే మా కార్యక్రమం. గూడెం చేరుకున్నాం.

గూడెం నాయకుడికి కృతజ్ఞతలు చెప్పి సెలవిప్పించమన్నాం.

సులేఖాన్‌ను తాను అడిగినట్లు చెప్పమన్నాడు నాయ
కుడు. సులేఖాన్‌కు యివ్వమంటూ చందనం కర్రతో చేసిన
చేతికర్రను యిచ్చాడు.

మా సామానులను తీసుకుని బయలుదేరబోయాం.

ఇంతలో "ఆగండి" అంటూ నాయకుడు అరిచాడు.

తన పక్కనున్న అనుచరుడికి సైగ చేశాడు.

"గూడెంకు వచ్చిన వాళ్ళవస్తువులను వాళ్ళు వెళ్ళే
టప్పుడు సోదా చెయ్యడం మా నియమం" చెప్పాడు
నాయకుడు.

అతని అనుచరుడు మా సామానులవైపు రాసాగేడు.

నా ప్రాణాలు పైపైనేపోయాయి.

అజాద్, వీరడు ఒకరి ముఖాల్నొకరు చూసుకొంటు
న్నారు. ఆచార్య తెల్లముఖం వేశాడు.

"ఆటవికులు ఎంత సాత్వికులో, అంత క్రూరులు"
ప్రొఫెసర్ మాలవ్యా మాటలు గుర్తుకు వచ్చి, చెమటలు
పట్టాయి.

ఆ సామానులు చూస్తే ఏమన్నా ఉందా? ఆ సూట్
కేసులో చాముండేశ్వరిదేవి విగ్రహం వుంది! అది ఆట
వికుల ఆరాధ్య దైవం.

మాకు నిలువునా చావు తప్పదు. లాస్ట్ స్టేజ్‌లో ఈ
అవాంతరమేమిటా అని భయపడ్డాను.

అప్రయత్నంగా నా చేతులు జేబులోని రెండు
పిస్టల్స్‌ను పట్టుకున్నాయి.

అందరి దృష్టి సామాన్ల మీద కేంద్రీకరించబడి వుంది.
నాయకుడి అనుచరుడు సామాన్లను విడదీసి చూస్తు
న్నాడు.

సూట్ కేస్ మీద చెయ్యి వేశాడు.

ఉత్కంఠత హెచ్చింది నాకు.

ప్రాణాలు బిగపట్టుకుని చూస్తున్నాను.

సూట్ కేసు తెరిచాడు.

నా కళ్ళను నేనే నమ్మలేకపోయాను.

అంతా యింద్రజాలంగా తోచింది. సూట్ కేసులో విగ్రహం లేదు. అడవిలో దొరికే జంతువుల కొమ్ములు, చర్మాలు వున్నాయి. నోటమ్మట మాట రాలేదు నాకు.

ఈ ఆపరేషను యింత ఘోరంగా ఫెయిల్యూర్ అవుతుందని కలలోకూడా వూహించలేదు.

"క్షేమంగా వెళ్ళండి" అన్నాడు నాయకుడు.

ఉసూరుమంటూ ముందుకు సాగేం. కొంతదూరం వెళ్ళేవరకూ ఎవరూ మాట్లాడలేదు. అందరి ముఖాలూ పాలిపోయి వున్నాయి. సూట్ కేస్ లో వుంచిన విగ్రహం యెలా మాయమయింది? అందరిని కలవరపరుస్తున్న ప్రశ్న యిది.

తీవ్రంగా ఆలోచిస్తున్నాను.

"విచిత్రంగా వుంది" అన్నాడు అజాద్.

సూట్ కేసులో మేమంతా చూస్తుండగా విగ్రహం వుంచింది అజాదే.

అవునన్నట్టుగా తలాడించాను. ఇన్నాళ్ళ మా శ్రమ, నా ప్లాను విఫలమయిందన్న బాధ అందరి ముఖాల్లోనూ తాండవిస్తూంది. నిస్తేజంగా నడుస్తున్నాము.

## 11

అసలు, ఆ విగ్రహం ఎలా మాయమయిందా, అని ఆలోచిస్తూ నడుస్తున్నాను నేను.

వీరడు ముందు దారి తీస్తున్నాడు. రెండు మైళ్ళదూరం వెళ్ళేసరికి మా వెనకనుండి "అజా!" అన్న పిలుపు వినిపించింది. అందరం ఒక్కసారి వెనుతిరిగి చూశాం.

చెమటలు కక్కుకుంటూ పరిగెత్తుకుని వచ్చింది గణాచారి కూతురు.

ఆమె చేతిలో ఏదో వస్తువు గుడ్డ చుట్టబడి వుంది.

మా అందరి దృష్టి ఆమెమీద కేంద్రీకరించబడింది.

"అజా! నీ గురించే వస్తున్నాను" అంది అజాద్‌ను చూసి.

"చేతిలో మూట ఏమిటి?" ఆతృతగా ప్రశ్నించాను.

"ఇదా? మా విగ్రహం. సూట్‌కేసులోనుండి తీసి, దాచాను" అంది.

"ఎందుకు తీశావ్?" ప్రశ్నించాడు అజాద్.

"మీ చర్యలు మొదటినుండి పసిగడుతున్నాను. మా విగ్రహం మీరు దొంగలించి, సూట్‌కేసులో వుంచటం కూడా చూశాను. మీకు యిక్కడ ఆచారాలు తెలియవు. కొత్తవాళ్ళు వచ్చి వెళ్ళినప్పుడు వాళ్ళ వస్తువులు సోదా చేస్తారు. అప్పుడు ఈ విగ్రహం బైటపడితే మిమ్మల్నందర్నీ నిలువునా చంపేస్తారు. అందుకని, విగ్రహాన్ని దాచేసి, తెచ్చాను" చెప్పింది. ఆయాసంవలన రొప్పుతోంది.

అందరూ విచిత్రంగా గణాచారి కూతుర్ని చూశారు.

"ఇదంతా ఎందుకోసం చేశావ్?" అనుమానంగా అడిగాను. ఏదో స్వార్థం లేకపోతే యింత సాహసం ఎవరూ చెయ్యరు.

"నీకోసం!" అంది అజాద్ వైపు చూసి.

నాకు పరిస్థితి అర్థమయింది. ఆజాద్ ను గణాచారి కూతురు గాఢంగా ప్రేమిస్తుంది.

అందుకు సందేహం లేదు.

అంతవరకూ వెలవెలబోయిన మా అందరి ముఖాలు కళకళలాడాయి. విగ్రహాన్ని పదిలంగా సూట్ కేసులో పదిలపరిచాం. ఉత్సాహంతో ముందుకు నడిచాం.

సాయంకాలం ప్రొఫెసర్ మాలవ్యాతో వైర్ లెస్ లో మాట్లాడేను. జరిగిన తతంగమంతా చెప్పాను. గణాచారి కూతురు మా వెంట వస్తున్నట్లుగా చెప్పాను.

శత్రువుల మనిషామె. ఎప్పటికయినా ప్రమాదం. అడవిలోనే అంతం చెయ్యమని సూచించాడు మాలవ్యా.

మేం వచ్చేసరికి అంతా సిద్ధం చెయ్యమన్నాను. పార్టీలను రెడీగా వుంచమని చెప్పాను.

అలాగే నన్నాడు మాలవ్యా.

వైర్ లెస్ లో నేను మాట్లాడడం ముగించేసరికి బాగా చీకటి పడింది.

ఆజాద్ ను పక్కకు పిలిచి విషయమంతా చెప్పాను. మౌనంగా విని తలాడించి, గణాచారి కూతుర్ని తీసుకుని మాకు దూరంగా వెళ్ళిపోయాడు.

అయిదు నిమిషాలు గడిచాయి.

పిస్టల్ పేలిన శబ్దం వినిపించింది. ఆ శబ్దం తరువాత వెంటనే స్త్రీ ఆర్తనాదం!

వీరడు, ఆచార్య, పిస్టల్ శబ్దానికి, స్త్రీ ఆర్తనాదానికి కొయ్యబారిపోయారు.

## 12

ఫియట్ కారు శరవేగంతో ఢిల్లీనగరంలోకి ప్రవేశించింది.

లజ్ కార్నర్ దగ్గర కారును ఆపి, ఆచార్యను దించేశాం. అతనికి యిస్తామన్న ముప్ఫయి అయిదు వేలూ యిచ్చేశాను. మాకు కృతజ్ఞతలు తెలుపుకుని వెళ్ళి పోయాడు ఆచార్య.

కారును ప్రొఫెసర్ మాలవ్యా బంగళాకు పోనివ్వమని అజాద్‌కు చెప్పాను.

ఇరవై నిముషాల్లో మాలవ్యా బంగళాముందు మా ఫియట్ ఆగింది. ఇద్దరం కారు దిగేం.

ప్రొఫెసర్ మాలవ్యా మమ్మల్ని చూస్తూనే ఆనందంతో వుక్కిరిబిక్కిరవుతూ నన్ను కౌగలించుకున్నాడు.

"మార్వలెస్ అడ్వెంచర్" అంటూ ప్రశంసించాడు. మాలవ్యా పెర్సనల్ రూంలోకి వెళ్ళాం.

అప్పటికే ఆ రూంలో ఒక విదేశీయుడు కూర్చుని వున్నాడు. అతని ముందు విస్కీ సీసా, గ్లాసులు వున్నాయి.

ఆ విదేశీయుడి తొడమీద అర్ధనగ్నంగా కూర్చుని విస్కీ గ్లాసును అతడి పెదవులకు అందిస్తూంది మాలవ్యా సెక్రటరి మిస్ శేన్యా. మమ్మల్ని చూడగానే చివాల్న అతడి ఒడిలోనుండి లేచి బైటకు వెళ్ళిపోయింది.

నేను భుజాలెగరవేశాను.

"మీట్ మై ఫ్రెండ్ మిస్టర్ ఆర్థర్" అంటూ విదేశీయుడ్ని మాకు పరిచయం గావించాడు మాలవ్యా.

పరిచయాలు పూర్తి అయ్యాయి. అజాద్ సూట్ కేసును తీసుకువచ్చి, అందులోనుండి విగ్రహాన్ని తీసి, టేబులుమీద వుంచాడు.

"మార్వలెస్. సింప్లీ ఫేబ్యులస్ బ్యూటీ" అచ్చెరువొందుతూ అన్నాడు ఆర్థర్.

అతడే విగ్రహాన్ని కొనే వ్యక్తి అని అర్థమయింది.

మాలవ్యా తన పిల్లిగడ్డాన్ని గర్వంతో సవరించుకుంటూ నా భుజం తట్టాడు.

"మిస్టర్ ఆర్థర్! అగ్రిమెంటు కుదిరాక, ఎన్ని కష్టాలు ఎదురయినా దానిని మేం సక్రమంగా నిర్వర్తిస్తాం" అన్నాడు ఆంగ్లంలో.

"యస్ ... వెల్ డన్" అంటూ బ్రీఫ్ కేసు తీసి మాలవ్యాకు యిచ్చాడు ఆర్థర్.

దాన్ని తెరిచాడు మాలవ్యా. వంద రూపాయల నోట్ల కట్టలు.

అంతే!

భళ్ళున మాలవ్యా పెర్సనల్ రూం తలుపులు తెరుచుకున్నాయి. అందరం వులికిపడి అటు చూశాం.

ఎదురుగా ఇన్ స్పెక్టర్, పోలీసులు!

"ప్లీజ్ ...డోంట్ మూవ్. అందర్నీ అరెస్టు గావించండి" హెచ్చరిస్తూ అన్నాడు ఇన్ స్పెక్టర్.

తెల్లబోయాను. నా కాళ్ళక్రింద భూమి కంపిస్తున్నట్లయింది. "ఎందుకు అరెస్టు చేస్తున్నారు?" గొంతు పెగుల్చుకుని అడిగాను.

నావైపు నిరసనగా చూశాడు ఇన్ స్పెక్టర్.

"ఈ ఆర్థర్ కార్యకలపాలను సీక్రెట్ బ్రాంచి మొదటి నుండి అనుమానిస్తూ, ఫాలో అవుతుంది. ఆర్థర్ని ఈ ప్రొఫెసర్ హోటల్ సెవన్ స్టార్స్లో కల్సుకుని చాలా

సేపు మాట్లాడేడు. పురాతత్వ పరిశోధన శాఖలో పనిచేసే మాలవ్యాకు, ఆర్డర్ తో ఏం పని చెప్మా అని అనుమానించి, మాలవ్యామీద సీక్రెట్ బ్రాంచి తన మనుష్యులను నిఘాకు పంపించింది.

ఈ ఆర్డర్ రెండుమూడుసార్లు మాలవ్యా బంగళాకు వచ్చాడు. మాలవ్యా బంగళాలో పనిచేసే పనిమనిషిని సీక్రెట్ బ్రాంచివాళ్లు ట్రాప్ చేశారు. ఫలితంగా ప్రొఫెసర్ బంగళాలో చాలాచోట్ల పవర్ ఫుల్ ఆటోమేటిక్ మినియేచర్ టేప్ రికార్డర్సను వుంచారు. వాటివలన మీ రహస్యాలన్నీ తెలిశాయి.

మీ అందరి రాకకోసం ఎదురుచూస్తూ వలపన్ని కూర్చున్నాం. డైరెక్టుగా అందరూ వచ్చి, మా అంచనాల మేరకు చిక్కుకున్నారు'' చెప్పాడు ఇన్ స్పెక్టర్.

కోపంగా, ప్రొఫెసర్ వైపు చూశాను.

నా చూపులకు తట్టుకోలేక తల దించుకున్నాడు.

—: ఐపోయింది :—




[ఆరవ భాగము]

సముద్రానికి పశ్చిమం ఒడ్డున పొదల్లోని బోట్‌ని సులభంగా గుర్తుపట్టాం.

అడ్డుగా ఉన్న ఆకుల్ని, కొమ్మల్ని చకచకా తొలగించింది కాన్యోరా.

యిద్దరం కాబిన్‌లోకి వెళ్ళాం.

నేనూహించింది నిజమే అయింది.

చాలా రోజులుగా వాడకపోడంవల్లా, సముద్రపు ఉప్పు గాలివల్లా అప్పుడప్పుడే తుప్పుపడుతోంది యింజన్. మా వెంట తెచ్చుకున్న ఆయిల్‌ని అన్ని జాయింట్లలో పోశాను. ఆయిల్ గుడ్డతో ప్రతి భాగాన్ని కడిగేశాను.

అంతా అరగంట పట్టింది.

అలసిపోయి పైకి లేచి నిలబడ్డాను.

నా నడుం పీకుతోంది.

చేతులు యిసుకలో రుద్దుకొని సముద్రపు నీటిలో కడుక్కున్నాను.

"శాన్యోరా! చీకటి పడుతోంది. రేపు ఉదయం వచ్చి ట్రయల్ వేద్దాం. ఈలోపున ఆయిల్ యింకుతుంది ఇంజన్ భాగాల్లో" అంటూ జేబులు తడువుకున్నాను. సిగరెట్ పాకెట్ తగల్లేదు.

"శాన్యోరా! యు గాట్ ఎ సిగరెట్?"

ఆమె బెల్‌బాటమ్ పాంట్‌లోంచి ఓ పేకెట్ తీసింది.

అందులో రెండు సిగరెట్లు మాత్రం వున్నాయి.

"భయంకర్! ఇది లాస్ట్ బట్ వన్ పాకెట్. యింకో పెట్టి మాత్రం వుంది. పోతే ఇంకో క్వార్టర్ బాటిల్ బ్రాందీ వుంది. మనం తినడం మర్చిపోయిన రొట్టెలు పాడైపోయాయి" అంది ఓ సిగరెట్ ఇస్తూ.

"మైగాడ్! చావుకబురు చల్లగా చెప్పేవు" అన్నాను నిస్పృహగా. "మోటర్ బోటులో ఎన్ని వారాలు ఏకబిగిన ప్రయాణం చేయాలో తెలియదు. ఎలాగోలా పోర్ట్‌సుడాన్‌లో పడితే, అక్కడి మన బ్రాంచి వాళ్ళు మన ఆరోగ్యం చూసుకుంటారు. ఆల్ రైట్. మూవ్ ఆన్."

యిద్దరం ప్రయాణం గురించి మాట్లాడుకొంటూ తిరుగు ముఖం పట్టాం.

చెట్ల మధ్యలో నడుస్తున్నాం ఇద్దరం.

అంతలో......

ఎవరో గభాలున వెనుకనుంచి శాన్యోరామీద పడ్డారు.

ఆమెను బలంగా బంధించి చేత్తో నోటిని మూస్తూ ఆ వ్యక్తి నావేపు తిరిగాడు.

అదిరిపడుతూ అతనివేపు చూసాను.

ప్రక్కలో బాంబు ప్రేలినట్లయింది.

ఎల్లమనుషుల నాయకుడు!!

అడివి దున్నలా అతనిమీద లంఘించబోయాను.

ఎల్లమనుషుల నాయకుడి చేతిలో తళుక్కున మెరిసింది ఈటె!

అదిరిపడి పక్కకి తప్పుకోబోయాను.

పొట్ట ప్రక్కగా కసుక్కున దిగింది ఈటె!

డొక్కలు పట్టుకుని బాధగా ముందుకి వంగాను.

ప్రపంచం గిర్రున తిరుగుతోంది.

'నా శాన్వోరాను ఆ దుర్మార్గుడు తీసుకుపోతున్నాడు' అన్న నిజం భయంకరంగా మెరిసింది.

రక్షించాలామెను!

తడబడే కాళ్ళతో రెండడుగులు ముందుకు వేశాను.

వ్చ్...లాభం లేదు...

కళ్ళు బైర్లు కమ్ముతున్నాయి.

పొత్తి కడుపు పక్కగా ఈటె...!!

ఒక చేత్తో తలా, మరో చేత్తో నడుం పట్టుకొని కళ్ళ ముందు ఏర్పడ్డ కృత్రిమాంధకారంలో కూలిపోయాను....

*　　　*　　　*

భారంగా కళ్ళు తెరిచాను.

ఎదురుగా, నిటారుగా ఓ వృక్షం కనబడుతోంది.

అప్పుడే చీకటి పడుతోంది...

అంటే నేను స్పృహతప్పిఎంతోసేపు కాలేదన్నమాట.

"మి...జో...రా!" అన్న పిలుపు దగ్గరో వినబడింది.

తల ప్రక్కకు తిప్పాను.

మెదడులో ఏదో కలుక్కుమన్నట్లయింది.

నేలమీద కూర్చుని భాష్పపూరిత నేత్రాలతో ఆత్ర తగా చూస్తున్న జోనా ముఖం కనబడింది.

ఆమె బలమైన వక్షోజాలు నగ్నంగా ఉన్నాయి. నా మనసు వాటివైపు లగ్నం కావటం లేదు.

"జోనా ఎలా వచ్చేవు?" అడిగేను మెల్లిగా. నడుం పట్టుకొని కూర్చుంటూ.

పాంట్ పై బొత్తాలు విప్పబడి వున్నాయి. బొడ్డుకు ప్రక్కగా గాయంమీద ఏదో ఆకుపచ్చని పసరు వేసి వుంది. చల్లగా ఉందక్కడ.

నొప్పి తెలియడం లేదు.

జోనా నా భుజంపై చేయి వేసింది.

"మిజోరా! చీకటి పడితే మీరు గూడానికి రావడం కష్టం. దారి తప్పే అవకాశం ఉంది. బాబా అనుమతి తీసుకుని భోజనానికి మిమ్మల్ని వెంటపెట్టుకు వద్దామని బయలుదేరేను. ఇక్కడికొచ్చేసరికి నేను ఊహించనిది జరి గింది. నీ నడుంవద్ద ఈటె వుంది లోతుగా దిగబడి. వెంటనే బయటకు లాగి పసరు వేసాను. నీకూడా ఉండే అమ్మాయి కనపడలేదు నాకు."

శాన్యోరా జ్ఞాపకం రాగానే అదిరిపడ్డాను.

పోరాటంలో తుపాకీ గుళ్ళతో ఎఱ్ఱమనుషుల నాయ కుడి భుజాన్ని నింపింది.

ఆ కసితో ఆ దుర్మార్గుడు ఆమెనేం చేస్తాడో?

"జోనా! ఎఱ్ఱమనుషుల నాయకుడు నన్ను దొంగ దెబ్బ

తీసి శాన్యోరానె తుకుపోయారు. నువ్వు నాకో సహాయం చేయాలి. నా గదిలో తుపాకీ ఉంటుంది. అది నిముషాల్లో తేవాలి.''

''మిజోరా! నీకు విశ్రాంతి అవసరం. బాబా, నేను మా మనుషులతో వెళ్ళి నీ శాన్యోరాని విడిపించుకు వస్తాం'' సలహా ఇస్తూ పలికింది జోనా.

''జోనా ఇలాటి దెబ్బలు ఇంతకు ముందెన్నో తిన్నాను. పైగా, నువ్వు మందు వేశావుగా. దయచేసి ఇంకేం చెప్పక. నేనొక్కణ్ణే వెళ్తాను. ఎక్కువమందిని తీసికెళ్తే అంతా రసాభాస అవుతుంది. తెలివిగా తీసుకువాలి శాన్యోరాను. వెంటనే నా తుపాకీ తీసుకురా. ఎవరికీ కనబడక. ఆలస్యం అవుతుంది.''

జోనా బరువుగా నిట్టూర్చి పైకి లేచింది.

''మిజోరా! ఇక్కడున్నట్లో స్తాను'' అంటూ మెలు పులా చెట్ల మధ్య మాయమైంది.

మోటారు బోటును చకచకా సముద్రంలోకి లాగాను.

అయామ్ లక్కీ! ఇంజన్ పనిచేస్తోంది.

అయిదు నిమిషాల్లో ప్రత్యక్షమైంది జోనా.

ఇంజన్ ఆపేను.

తుపాకీ, తూటాలు నా చేతికిచ్చిందామె.

ఆమె చేతిలో విల్లు, పదునైన బాణాలు కనబడ్డాయి.

''అవెందుకు?'' అడిగాను.

''మిజోరా! కనీసం నేనొక్కదాన్నే నీతో వస్తున్నాను.''

''వద్దు జోనా! నీకేదైనా అయితే నీ తండ్రికి సంజాయిషీ చెప్పాకోలేను.'' అంటూ ఇంజన్ స్టార్ట్ చేసేను.

"వెళ్ళొస్తాను. జోనా! బాబా కీవిషయం చెప్పు" అంటూ ప్రక్కకు చూసాను.

జోనా అక్కడ లేదు!

పిచ్చిపిల్ల కోపగించి వెళ్ళిపోయింది. దడ దడ శబ్దం చేస్తూ బోటు పశ్చిమంగా ప్రయాణించసాగింది. అరగంట తర్వాత వెన్నెల వెలుగులో దూరంగా ఎఱ్ఱమనుషుల దీవి కనిపించింది.

సరిగ్గా అదే సమయంలో......

బోటు వెనుక భాగంలో ఏదో చప్పుడైంది.

అదిరిపడుతూ వెనక్కి తిరిగాను.

"జోనా!"

నేరం చేసినట్లు తల వంచుకొని నా ముందుకొచ్చింది.

"మిజోరా! యంత్రం ఆపేయ్. శబ్దం రాగూడదు. ఒడ్డుదాకా తెడ్లతో నడుపుదాం." అంది గంభీరంగా జోనా నేల చూపులు చూస్తూ.

ఆమె నేమనాలో తెలీలేదు నాకు. ఇంజనాపి మెల్లగా తెడ్లు వేయసాగాం.

బోటుని ఒడ్డునే వున్న చెట్ల మధ్యకి లాగేశాను. జోనా సాయంతో.

నాయకుడి గూడాన్ని వెతకాలి.

ఇద్దరం చెట్ల మధ్యగా నడవసాగాం.

వెనుకగా నడుస్తున్న జోనా నన్ను చటుక్కున వెనక్కి లాగింది.

తూలి పడబోయి నిగ్రహించుకున్నాను.

రివ్వున ఓ ఈటె వచ్చి నా కాలిముందు దిగబడింది.

మైగాడ్! తల మధ్యభాగంలో దిగబడాల్సిన ఈటె అది.

క్షణంలో ప్రాణం దక్కింది.

ప్రత్యర్థులకోసం అటూ ఇటూ చూశాను.

జోనా ఎప్పుడు విల్లు ఎక్కుపెట్టి బాణం వేసిందో తెలీదు. ఎత్తయిన వృక్షాగ్రం మీంచి తాటికాయలా దబ్బున నా కాళ్ళముందు పడ్డాడో ఎఱ్ఱమనిషి.

అతని గుండెల్లో దిగి రెండవవైపు కనబడుతోంది జోనా వదిలిన బాణం!

తుపాకీ చటుక్కున గురిపెట్టి చెట్టువైపు చూశాను. వృక్షాగ్రంపై, మరో ఎఱ్ఱమనిషి అదే సమయంలో ఈటె విసరబోతున్నాడు.

"మిజోరా! తుపాకీ యిపుడు పేల్చొద్దు. శబ్దానికి తోడేళ్ళ దండులా వస్తారు ఎఱ్ఱమనుషులు" చిన్నగా అరిచింది జోనా. "ఆ పడుతున్న ఈటె అందుకో."

జోనా వైపు రివ్వున దూసుకొస్తోంది మరో ఈటె.

చేతో పట్టుకోవడం కష్టం. అరచేయి చీలుతుంది.

కొంచెం పైకెగిరి తుపాకీ మడమను గాలిలో కత్తి ఈటెను పడగొట్టేను. ప్రక్కగా కూలిపడిందీటె.

జోనా ఆలస్యం చేయలేదు. విల్లు ఎక్కుపెట్టి రివ్వున వదిలింది బాణాన్ని. చెట్టుమీద ఎఱ్ఱమనిషి కంఠంలో నాటుకొందది. ఆ వ్యక్తి అరవలేదు.

క్రిందపడలేదు. కంఠంలోంచి చెట్టుకొమ్మలోకి దిగబడింది బాణం. యారోషూటింగ్ లో జోనా నేర్పుకు అప్రతిభుడనయ్యాను.

"జోనా! మెరుపులా ఎదురుపడ్డ మృత్యువుబారినుండి క్షణంలో తప్పించేవ్" అన్నాను కృతజ్ఞత నిండిన కంఠంతో.

జోనా ఒక్క క్షణం నావేపు అదోలా చూసి మౌనంగా ముందుకు కదిలింది.

* * *

జోనా, నేను పొదచాటునుంచి ఆశ్చర్యంగా ముందుకు చూశాం. వెన్నెల వెలుగ్లో ఎదురుగా ఓ ఖాళీ మైదానం కనబడుతోంది. దాని మధ్యగా తాటిచెట్టు పొడవులో నాలుగు స్థంభాలమీద కట్టిన ఒక కుటీరం కనబడుతూంది. అంతా చెక్కలతో చేసిందే. క్రిందభాగంలో నాల్గు స్థంభాల చుట్టూ గుండ్రంగా మూడడుగులెత్తుగల రాతి గోడలమధ్య ఓ సరస్సులాంటిదుంది. పూర్వం రోజుల్లో రాజులు కట్టించే ఒంటిస్థంభం మేడ గుర్తుకొచ్చింది నాకు.

పైకెళ్ళటానికి రోప్యా మెట్ల నిచ్చెన ఉంది.

చుట్టూకట్టబడిన సరస్సులో ఏవో కదుల్తున్నాయ్ ఆకలిగా తలలు పైకెత్తి.

"మొసళ్ళు" అంది జోనా దిగ్భ్రమగా.

మైదానం చుట్టూ అక్కడక్కడా వెదజల్లబడిన ఎఱ్ఱ మనుషుల కుటీరాలు దూరదూరంగా ఉన్నాయి.

నేలమీద పాతిన దివిటీలు వెలుగుతున్నాయక్కడక్కడ, ఆ నిర్మానుష్యమైన ప్రదేశంలో...

"జోనా! నేను పైకి వెళ్తాను. నువ్వు ఎవరైనా అటు వైపొస్తే హెచ్చరికగా ఓ బాణం...అదుగో!...ఆకిటికీ తలుపుకుకొట్టు ఆ శబ్దం చాలు నేను జాగ్రత్తపడ్డానికి. ఓ.కె.?" అంటూ ముందుకు కదిలాను.

జోనా హస్తం నన్నాపేసింది.

కళ్ళు చిట్లించి ప్రశ్నార్థకంగా ఆమెవైపు చూసేను.

"మిస్టర్! జాగ్రత్త" అంటూ చెయ్యి వదిలేసింది.

నవ్వి, ఆమె చంపలు తట్టాను.

లోడ్ చేసిన తుపాకీపట్టుకుని వంగుతూ, కొయ్య నిచ్చెన మెట్లవైపు పరిగెట్టాను.

*　　　*　　　*

"నువ్వు నాభుజాన్ని కాల్చేవ్! అయినా నాకోపం లేదు. ఎఱ్ఱగా వనదేవతలా ఉన్నావ్. నిన్ను పెళ్ళాడి ఈ దీవికి రాణిని చేస్తాను. చెప్పు లేకపోతే యిపుడే నీ అందాన్ని అనుభవించక తప్పదు" అన్నాడు ఎఱ్ఱ మనుషుల నాయకుడు.

కిటికీ సందులోంచి లోపలికి చూస్తూ అదిరిపడ్డాను!

శాన్డ్రా లోపల నగ్నంగా పడుకోబెట్టబడివుంది! చేతులూ, కాళ్ళూ సాగదీసి, కట్టబడివున్నాయి! కేకలు పెట్టకుండా నోటికడ్డంగా ఓతోలు పటకా బిగించబడి వుంది. నాయకుడు ఎదురుగా నగ్నంగా నిలబడివున్నాడు.

నాఒంటిమీద గరుగ్గా తేళ్ళూ, జెర్రులూ కదులుతూన్నట్లనిపించింది. నాయకుడి భాష శాన్డ్రాకర్థమై వుండదు.

ఆమె కనుగ్రుడ్లు అవమానాగ్నితో నిప్పులు వర్షిస్తున్నాయి.

"ఇష్టమైతే అంగీకారసూచకంగా తలవూపు. నీకే లోటూ రానివ్వను. దీవికి రాణిని చేస్తాను" అంటూ సైగలు చేశాడు ఈసారి నాయకుడు.

మౌనంగా వుండిపోయింది శాన్డ్రా. నాయకుడు అసహనంగా ఆమెవైపు కదిలాడు. ఆమె మీదకు వంగి వికృతంగా నవ్వుతూ శరీరమంతా చేత్తో తడిమసాగా...

అంతే! జబ్బలతో బలంగా తన్నేను. కిటికీ తలుపులూడి లోపల పడ్డాయి.

అదిరిపడుతూ పైకిలేచాడు నాయకుడు.

“యూబ్లడీ వైల్డ్ పిగ్! కదలక. ఇంతకుముందు తుపాకీ దెబ్బ ఎలావుంటుందో రుచి చూసావ్.”

తుపాకీ పొజిషన్‌లో పెట్టి కాలితో బట్టలు శాన్యోరా శరీరం మీదికి తన్నేను. “కట్లు విప్పు” కర్కశంగా పలికేను అతని కంఠానికి గన్ బారెల్ గుచ్చి.

చకచకా ఆమె కట్లు విప్పాడు ఎఱ్ఱమనుషుల నాయకుడు.

గబగబా దుస్తులు అస్తవ్యస్తంగా ధరించి శాన్యోరా బోనులోంచి బైటపడ్డ సింహంలా గాలిలోకి ఎగిరి.

“యూ బ్లడీ సన్ ఆఫ్ ఎ బిచ్” అంటూ అతని పొత్తి కడుపుక్రింద “హాప్ కిడో” దెబ్బ ప్రసాదించింది.

పొత్తికడుపు పట్టుకుని దిశలు దద్దరిల్లేలా అరవబోయాడు నాయకుడు.

అయితే అతని నోటిని చటుక్కున మూసేశాను వెనక నుంచి.

“ప్లీజ్ శాన్యోరా! ఆవేశం అపుకో. హడావుడి చెయ్యక” అంటూ ఎఱ్ఱనాయకుణ్ణి బయటకు లాక్కొచ్చాను.

శాన్యోరా వగరుస్తూ నా వెనుక వచ్చింది.

నాయకుడు చుట్టూ నా చేతిపట్టు వదిలేసి గుండెలమీద గురిపెట్టాను తుపాకీ.

“రేయ్! నువ్విక బ్రతకడం నల్లమనుషులకు ప్రమాదకరం. త్వరగా నిర్ణయించుకో నా తుపాకీ తూటాతో

చస్తావా?...క్రిందికి సరస్సులోకి దూకి మొసళ్ళకి ఆహారం అవుతావా?''

చటుక్కున కేకలు పెట్టబోయాడు నాయకుడు. చటుక్కున అతని నోరు బలంగా మూసేసింది శాన్యోరా. అతని నోటికి తోలుపటాకా గట్టిగా బిగించింది.

''శాన్యోరా! తోసెయ్ అతన్ని మొసళ్ళ మధ్యకి'' అన్నాను గంభీరంగా.

''థాంక్స్ డియర్! నువ్వు రావడం ఒక్క క్షణం ఆలస్యమైతే నా శీలాన్ని ఈ దుర్మార్గుడు బలవంతంగా దోచుకుని వుండేవాడు,'' అంటూ అతన్ని రెండు చేతులతోనూ ఎత్తి సరస్సులోకి విసిరేసింది.

ఇద్దరం వెన్నెల వెలుగులోకి కింద చూశాం.

మొసళ్ళు భయంకరంగా నోరు తెరుచుకుని నాయకుడి మీదకి కదిలాయి.

చిన్న పొరపాటు చేశాం!?

అదే...

అతని చేతులు బంధించకపోవడం...

ఒక్క ఉదుటులో గట్టుపైకి ప్రాకాడు.

ఒక కాలు గట్టుమీద పెట్టాడు.

అదే క్షణంలో ఓ బాణం రివ్వునవచ్చి అతని కంఠంలో నాటుకుంది.

అది జోనా బాణమని చెప్పాను శాన్యోరాతో.

మొసళ్ళు అతన్ని నడుందాకా నోట కరచుకొని వెనక్కి లాగేశాయి.

ఇద్దరం గబగబా మెట్లు దిగి జోనా ఉన్న పొదల వేపుకు వచ్చాం.

నా కాళ్ళు ఠక్కున ఆగిపోయాయ్.

గుండె ఆగినంత పనైంది.

అక్కడ జోనా వెల్లకితలా నేలమీద పడుంది.

ఆమె నోరు నురగలు కక్కుతోంది.

* * *

"మిడోరా! మీరు వెళ్ళిపోండి...ఎంతోసేపు బతకను...ప్రమాదకరమైన పాము..." అంటూ గొణిగింది అర్ధస్పృహలో.

ఆమె చెంపలు అరచేతుల్తో తట్టాను.

కొద్దిగా కళ్లు తెరిచిందామె.

"జోనా! పిచ్చిగా మాట్లాడకు. నువ్వు బతికి మాతో వచ్చి తీరాలి......చెప్పు......నువ్వు బ్రతకాలంటే ఏం చెయ్యాలి?"

"పసుపురంగు ఆకుల పసరు......ముక్కుల్లో...... నోట్లో..."

"శాన్యోరా! క్విక్!" అన్నాను.

పసుపు రంగుల మొక్కలకోసం క్షణంలో మాయమైంది శాన్యోరా.

జోనాని మెల్లిగా కూర్చోబెట్టి, ఆమె వీపుచుట్టూ చేతులువేసి పట్టుకున్నాను.

శాన్యోరా వెళ్ళి రెండు నిమిషాలవుతోంది.

ప్రతిక్షణం దుర్భరంగా ఉంది.

మృత్యుముఖంలో ఉంది జోనా.

నా కళ్ళు మెరిసాయి. శాన్యోరా ఎదురుగా నిలబడి ఉంది.

"దొరికిందా?"

"అయామ్ సారీ భయంకర్! ఎక్కడా కనబడలేదు" అంది చమటలు పట్టిన ముఖంతో.

"డామ్ యువర్ అపాలజీస్!" అర్చాను సన్నగా. "నువ్వూ నేను యిలా బ్రతికి ఉండడానికి కారణం జోనాయే. వెళ్ళు. ఆ ఆకులు రాందే తిరిగిరాకు. జోనా శవాన్ని ఆనందంగా తీసుకెళ్ళి వృద్ధ నాయకుడికి బహుమతిగా యివ్వలేను."

కాన్స్యేరా నా తుపాకీ తీసుకుని మళ్ళీ మాయమైంది.

జోనా ముఖంలోకి బెంగగా చూస్తూ ఉండిపోయాను.

క్షణక్షణానికీ ఆమె ముఖం కాంతివిహీనమాతోంది.

ఆమె నోట్లో నురగలు ఎక్కువౌతున్నాయి.

వాటిని చొక్కాతో తుడుస్తూ దద్దమ్మలా ఉండిపోయేను.

"భయంకర్! అయ్‌గాటిట్!" చేతిలోని బంగారు రంగు ఆకుల్తో పరుగెత్తుకు వచ్చింది కాన్స్యేరా.

చటుక్కున వాటిని అందుకుని, కర్షుడు నేలమీద ఒలికిన నూనెకోసం భూమిని పిండినట్లు మొండిబలంతో ఆకుల్ని అరచేతులమధ్య నలిపి పిండాను.

చివ్వున కారింది పసరు జోనా నోట్లోకి.

ఆమె ముక్కులో మరికొంత పిండాను.

ఫలితం ఉంటుందా......? అప్పటికే ఆలస్యం అయిందా?...?

ఆతృతగా జోనా ముఖంలోకి చూస్తూ ఉండిపోయేను.

అయిదునిముషాల తర్వాత బరువుగా ఊపిరి పీలుస్తూ తల అటూ ఇటూ కదిలించింది జోనా.

"థాంక్ గాడ్!"

తేలిగ్గా ఊపిరి వదిలాను.

"శాన్యోరా! ఎలా సంపాదించేవ్ వాటిని?" అడిగాను ప్రశంసాపూర్వకంగా శాన్యోరాకేసి చూస్తూ.

"ఓ ఎర్రమనిషి గూడెంలో జొరబడి తుపాకితో బెదిరించేను. ఓ పెట్టెలోంచి తీసిచ్చాడు అవన్నీ. బలంగా నెత్తిమీదొకటిచ్చి పరుగెత్తుకొచ్చాను."

"భయంకర్! జోనా ముఖంలో లివింగ్ ఫీచర్స్ కన బడుతున్నాయి. షీ విల్ బి ఆల్ రైట్ ఇన్ ఏ ఫ్యూ మినిట్స్. మనం ఇక్కడ ఎక్కువసేపు గడపడం మంచిది కాదు. ఈమెను మనిద్దరం స్ట్రెచర్ పద్ధతిలో పట్టుకొని మోసుకెళ్దాం."

"యూ ఆర్ రైట్ శాన్యోరా!"

పైకి లేచాను. ఇద్దరం జోనాను పట్టుకొని బోట్ వేపు అడుగులేశాం.

* * *

జోనా పూర్తిగా కోలుకొంది మేము దీవి చేరే టప్పటికి.

బోటు దీవిని సమీపించేసరికి వృద్ధ నాయకుడు కంగారు పడుతూ తన అనుచరులతో ఎదురేగాడు.

విషయమంతా చెప్పాం నాయకుడికి.

"మిజోరా! ఇప్పుడు ఎర్రమనుషులు రెక్కలు తెగిన పక్షులు." అన్నాడు సంతోషంగా.

నా వాచి తడిసిపోయి తిరగడం మానేసింది.

అప్పటికి అర్ధరాత్రి అయి ఉంటుందని గ్రహించాను.

నాయకుడు చకచకా భోజనం ఏర్పాట్లు చేశాడు.

ఆ రాత్రి తిమింగలపు నూనె దీపాల వెలుగులో, రుచి కరమయిన తిమింగలం మాంసం తిన్నాం.

కొంతసేపు ఆటవిక నృత్యాలు జరిగాయి.

నాయకుడిచ్చిన కల్లు తాగి, వారితోపాటు, నేనూ, శాన్యోరా భంగు తాగిన కోతుల్లా గెంతాం.

వినోద కార్యక్రమాలు ముగిసాయి.

అలిసిపోయి, నా గదిలోకి వెళ్ళి కుంభకర్ణుడిలా మంచంమీద వాలాను.

తిరిగి ఉదయం లేచేసరికి ఎండ తీవ్రంగా ఉంది.

బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంటూ ఉలిక్కిపడ్డాను.

శాన్యోరా నా కాళ్ళదగ్గర తలపెట్టుకుని పడుకొంది.

ఆమెను తట్టి లేపాను.

“ఎందుకు కాళ్ళు పట్టుకు పడుకున్నావ్? క్షమించాను. లే.”

“యూ బ్రూట్! రాత్రి బలవంతంగా తాగించావ్ కల్లు, పీకలదాకా” అరిచింది శాన్యోరా.

రాత్రి మత్తుపదార్థం సేవించడంవల్ల ఉదయానికి ఆమె బుగ్గలు ఉబ్బి మరింత అందంగా ఉన్నాయి.

“తర్వాత తీరిగ్గా తిడుదువుగాని. గెటప్ అండ్ ప్రిపేర్ యువర్ సెల్ఫ్. మనం వెళ్ళిపోతున్నాం”అన్నాను బైటికి నడుస్తూ.

గబగబా మోటార్ బోట్ నీ, దాని వెనుక లైఫ్ బోటునీ కట్టి ప్రయాణానికి రెడీ అయ్యాము.

నాయకుడు ఏవో రకరకాల పళ్లు నా బోటులో తన మనుష్యులచేత సర్దించాడు.

ఓ వృక్షం దగ్గరికి తీసుకెళ్ళి చకచకా కాయలు తెంపాడు.

“ఏంటవి?” అడిగేను. ఆక్రోటు పళ్ళలా ఉన్నాయవి.

"దీన్ని వెన్నవృక్షం అంటారు. కాయ పెచ్చు లాగితే లోపల రుచికరమైన వెన్నలాంటి గుజ్జు ఉంటుంది. ఇవి ఎప్పటికీ పాడవ్వవ్" అన్నాడు వాటిని ఓ బుట్ట నిండా పోసి.

అతనికి కృతజ్ఞతలు చెప్పి ఆ బుట్టను బోటులో పెట్టాను.

'మిజ్సోరా' పక్షిని పంజరంలోంచి బయటికి తీసి, స్వేచ్ఛ ప్రసాదించాను.

"అయ్ లవ్ యూ డియర్..."అంటూ అది ఆకాశం లోకి ఎగిరిపోయింది, రెక్కలు కొట్టుకుంటూ.

జోనా రహస్యంగా నాకు కబురు పెట్టింది...!?

గూడెంవేపు నడిచాను.

గుడిసె తలుపులు తీసి లోపలికి వెళ్ళాను.

జోనా తల వంచుకొని కూర్చుని ఉంది.

ఎక్కిళ్ళు వినిపిస్తున్నాయి...

"జోనా!..." పిల్చాను.

నా కంఠం నాకే విచిత్రంగా అనిపించింది.

తల తిప్పిందామె.

అప్పుడే చూశాను.

ఆమె కళ్ళు ఉబ్బి ఉన్నాయి.

"మిజోరా! మళ్ళీ కల్సుకుంటామా మనం?" కళ్ళు మోచేత్తో తుడుచుకుంటూ బేలగా పలికింది.

జోనాని రెండు చేతుల్తో పైకి లేపి చటుక్కున కౌగ లించుకున్నాను గాఢంగా.

ఆనందాశ్చర్యాలతో ఉక్కిరిబిక్కిరయి నా గుండెల్లో అడవిమల్లెలా ముడుచుకుపోయి వెక్కి వెక్కి ఏడ్వసాగిం

దామె. నగ్నంగా ఉన్న ఆమె వక్షోజాలు నా ఛాతీకి మెత్తగా తగుల్తున్నాయి.

ముఖాన్ని రెండు చేతుల్లోకి తీసుకొని పెదిమలు ముద్దు పెట్టుకొన్నాను. అర్ధనిమిలిత నేత్రాలతో నావైపు చూస్తోంది జోనా.

జోనా నాపై ప్రేమ ఉందో లేదో నాకు తెలియదు. ఆమె అమాయకత నాలో హృదయపూర్వకమైన జాలిని పుట్టిస్తోంది.

"తప్పకుండా కల్సుకుందాం జోనా, పరిస్థితులు అనుకూలిస్తే" అన్నాను నగ్నంగా ఉన్న ఆమె వీపును లాలనగా నిమురుతూ.

కౌగిలిలో కొన్ని క్షణాలు కళ్లు మూసుకుని మౌనంగా ఉండిపోయిందామె.

"మిజోరా! నేను యిక పెళ్ళి చేసుకోను. మీ ఇద్దరికీ ఓ అబ్బాయి పుడితే నాకందించండి. వాడిని పెంచి పెద్దజేసి ఈ దీవికి నాయకుడ్ని చేస్తాను" అంది మెరిసే కళ్ళతో జోనా.

ఆశ్చర్యంగా జోనా ముఖంలోకి చూస్తూ ఉండి పోయాను.

ఎంత అమాయకురాలు జోనా!

అసలు సాధారణంగా నాగరికుల పిల్లలను ఆటవికుల మధ్య పెంచడాన్కి ఎవరంగీకరిస్తారు?

ఆ విషయాలు బొత్తిగా తెలీవు జోనాకి.

అందుకే జోనా అ...మా...య...కు...రా...లు... అక్కడెక్కువసేపుండడం జోనాలో విచారాన్నెక్కువ చేయడమే.

"వస్తాను జోనా! బ్రతికి బాగుంటే నీ కోరిక తప్పక తీరుతుంది. ఇది నా జ్ఞాపకార్థం ఉంచుకో!" అంటూ నా చేతికి ఉన్న నగిషీలు చెక్కబడిన, బరువైన వజ్రపు టుంగరాన్ని ఆమె రెండో వ్రేలుకి తొడిగాను.

లూజైంది.

మధ్యవ్రేలికి తొడిగాను.

జోనా తడిసిన కళ్ళతో ఆనందంగా చేతివైపు చూసుకుంటూ ఉండిపోయింది.

"మిజోరా! నేను నీ కేమివ్వగలను?" అంది గాద్గదికంగా.

పెదవిమీద చిరునవ్వు తెచ్చుకున్నాను.

"ఏమిచ్చావో నీకు బాగా తెలుసు" అంటూ గుమ్మంవైపు నడిచాను.

"మిజోరా!" జోనా పిలుపు.

ఆగిపోయాను.

పరిగెట్టుకుంటూ వచ్చిందామె. "మరోసారి" అందామె నన్నల్లుకుపోతూ.

ఆమె పెదిమలను నా నోటితో కప్పాను.

మరో అయిదు నిముషాలదాకా అక్కడినుండి కదల్లేకపోయాను.

తడిసిన కళ్ళతో దీవి వాసులంతా వీడ్కోలు చెప్పారు.

మోటారు బోటు, లైఫ్‌బోట్‌ని ఈడ్చుకుంటూ భారంగా ముందుకు కదిలింది.

ఒడ్డుపొడవునా వీడ్కోలు చెప్తున్న ఆటవికులను కనబడినంతవరకూ చూస్తూండిపోయాను...

భారమైన హృదయంతో కాబిన్ లోకి వచ్చాను.

కాన్స్యోరా డ్రైవ్ చేస్తోంది బోట్ ని.

"కాన్స్యోరా! భారంగావుంది. కొంచెం బ్రాందీ కావాలి" అడిగాను.

కిట్ వైపు చూపించిందామె.

బాటిల్ తీసి డ్రైబ్రాందీ త్రాగుతూ ఆమె ప్రక్కగా చతికిలబడ్డాను.

తల దిమ్మెక్కుతూంది.

"భయంకర్! ఉంగరమేది?" నవ్వుతూ అడిగిందామె.

ఉలిక్కిపడ్డాను.

మౌనంగా వుండిపోయాను.

కాన్స్యోరా చేయి నాజుట్టు నిమురుతోంది.

డ్రైవ్ చేస్తోన్న కాన్స్యోరా తొడలమీద తల ఆన్చి కళ్ళుమూసుకున్నాను.

* * *

రెండ్రోజులలాంటి దుర్ఘటనా జరగకుండా సముద్రం మీద మా ప్రయాణం సాఫీగా జరిగింది.

రేషన్స్ చాలామటుకు అయిపోయాయి.

పాడైపోయిన పళ్ళను సముద్రంలో పారేశాను.

'ఆక్రోట్' పళ్ళలావుండే వెన్నకాయలను జాగ్రత్తగా వాడుతున్నాం.

ఒక సిగరెట్ మిగిలింది.

ప్రొఫెసర్ గదిలోంచి తీసుకొచ్చిన పది డబ్బాల్లో ఎనిమిది డబ్బాల ఆయిల్ అయిపోయింది.

మిగతా రెండూ అయిపోతే ఆ సముద్రంలో మోటారు బోటునెలా నడపాలో...? పిచ్చెక్కినట్లుంది.

సహాయంకోసం అర్థించాలన్నా కనుచూపు మేరలో ఒక షిప్ కూడా కనిపించలేదు. శాన్యోరా కాబిన్ లో పని చేస్తోంది. మధ్యాహ్నందాకా డ్రైవ్ చేసిన నేను వెన్నకాయలు తిని అలసటగా నిద్రపోతున్నాను.

“భయంకర్!” పొలికేక వినబడింది. అది శాన్యోరా కంఠం!

ఉలిక్కిపడిలేచి కాబిన్ వైపు పరిగెట్టాను.

పరిగెట్టడంలో నాలుగైదుసార్లు తూలిపడ్డాను.

“ఎందుకు?”

“భయంకర్! మోటారుబోటుని ఏదో అద్వితీయశక్తి కుడివైపు లాగేస్తోం! ఐకాంట్ కంట్రోల్ ది బోట్ పడమటి వైపు ప్రయాణించాలి మనం. బోటు ఉత్తరం దిశవైపు లాగేస్తోంది” నిస్సహాయంగా అర్చింది చెమటలు పట్టిన ముఖంతో శాన్యోరా.

ఎవరో రాక్షసుడు బలంగా లాగేస్తున్నట్టు కుడివైపుకు పరిగెడుతోంది తేలిగ్గా బోటు.

పోర్టుసూడాన్ చేరడమనే విషయంపై ఆశ వదిలేసుకున్నాం.

స్థాణువులా నిలబడిపోయాం.

* * *

కాయితం పడవలా రివ్వున పయనిస్తోంది బోటు.

ఏదో ఆలోచన తళుక్కున మెరిసింది నా మెదడులో.

“శాన్యోరా! దగ్గరలో ఏదో అయస్కాంతపు కొండలు ఉండుంటాయ్. మనబోటులో యంత్రాలు ఇనుమువి. అందుకే మన బోటుని మాగ్నెటిక్ కొండ ఆకర్షించుకుంటుంది. నువ్వు ఇక కాబిన్ లో వుండి లాభంలేదు.

యంత్రాలు పనిచెయ్యవు. లైఫ్‌బోటు వెంట తెచ్చు కోవడం మంచిదైంది. కమాన్! మనం అందులోకి పరు గెట్టాలి'' అంటూ శాన్యోరా చెయ్యి పట్టుకుని చేతిలోని తుపాకీతో బోటు వెనుక భాగానికి పరుగెట్టాను.

మరో నిముషంలో తాడుతో వెనుకవైపు కట్టబడిన లైఫ్‌బోట్‌లోకి గెంతాం ఇద్దరం...

బోటు అయస్కాంతపు కొండకి చాలా దగ్గరలోకి వచ్చేసింది. చటుక్కున కట్ చేసాను బోటుకి కట్టబడిన తాడును కత్తితో.

"శాన్యోరా! బోర్లాపడుకుని నెత్తిమీద చేతులు పెట్టుకో'' అర్చాను ప్రకాషన్‌గా!

బోర్లాపడుకున్నాం యిద్దరం.

అంతే! బోటు వెళ్ళి రాకెట్‌లా గుద్దుకొంది అయ స్కాంతం కొండని.

పెద్ద శబ్దంతో తూనాతునకలైంది బోటు.

ఇనుపముక్కలు, కొయ్యముక్కలు గాలిలోకి ఎగిరాయి.

కొన్ని లైఫ్‌బోటులోనికి వచ్చి పడ్డాయి. తలకు దెబ్బలు తగలకుండా చేతులు కాపాడాయి.

లైఫ్‌బోటు కొండసందులో యిరుక్కుపోయింది.

లేచి నిలబడి బట్టలు దులుపుకున్నాం. ఇద్దరం చిన్న కొండచరియ మీదకెళ్ళాం, లైఫ్ బోటుని ఓ సూది మొనలాంటి రాతికి కట్టేసి.

"భయంకర్! విపరీతమైన దాహంగా వుంది'' అంది అలసటగా శాన్యోరా కొంచెం చదునైన రాతిప్రదేశం మీద చతికిలపడి.

ఆమె ప్రక్కగా చోటుచేసి కూర్చున్నాను.

"వెన్న తింటావేంటి?" అడిగాను.

భారంగా నవ్వింది శాన్యోరా.

జేబులోంచి ఆటవికుల నాయకుడిచ్చిన వెన్నకాయలు తీసాను. అవి చితగ్గొట్టి శాన్యోరాకిచ్చాను.

ఆకలిగా తినేసింది అందులోని గుజ్జు శాన్యోరా.

"ఏమిటి ఆకాశంలోకి చూస్తున్నావ్?" అడిగేను తుక్కు సముద్రంలోకి పారేస్తూ.

ఆకాశంలో అగ్గిపెట్టె సైజులో పరిగెడుతున్న విమానం కేసి చూపుడు వ్రేలుతో చూపిందామె.

శాన్యోరా భుజంమీద లాలనగా చేయి వేశాను.

"ఇటువంటి ఆశలు పెట్టుకోక!" ఈ కొండచూట్టూ రెండు మైళ్ళ పరిధిలో అయస్కాంతశక్తి ప్రసార మాతూంది. ఎయిర్ ట్రాఫిక్, నావల్ ట్రాఫిక్ ఇటు వైపుండవు. ఏ విమానాలు, నౌకలు ఇటువైపు రావు. మళ్ళీ లైఫ్‌బోటే గతా మనకి?" అంది శాన్యోరా.

"అవును" అన్నాను. చిన్నచిన్న కెరటాలొచ్చి కొండకు గుద్దుకొనే దృశ్యాన్ని చూస్తూ.

పాదాలకు సముద్రం నీరు చల్లగా తగులుతోంది.

"ఎన్ని నాట్స్ ప్రయాణించగలం? అలా."

"ఎంతైనా తప్పదు. ఇక్కడ కూర్చునేం చేస్తాం? కొండమీద ఆకులుకూడా దొరకవే నమల్డానిక్కి."

సముద్రంలో పెట్టిన కాళ్ళు చటుక్కున పైకి లాగేశాను.

అసంకల్ప ప్రతీకారచర్యగా.

ఏదో కుట్టింది కాలికి.

బోటన వ్రేలికైన గాయన్ని పట్టుకుని అటువైపు చూశాను. నల్లనిబొచ్చుతో ఈదుకుంటూ వెనక్కి పరుగెడు తోంది కుక్కలాంటి జంతువు.

అక్కడక్కడ ముళ్ళున్నాయి దాని శరీరంపై.

"ఏమిటిది?" అడిగింది కంగారుగా శాన్యోరా.

చురకత్తి ఈతకొడుతూ పారిపోతున్న జంతువుపైకి విసిరాను. పీకమీద నాటుకుందది.

గిలగిలాకొట్టుకోసాగింది.

చటుక్కున సముద్రంలో దూకి నాలుగు బారలు ఈదాను. దాన్ని చేతికి చిక్కించుకుని తడిబట్టలతో శాన్యోరా ప్రక్కగా చేరాను మళ్ళీ.

"ఏమిటది?" మళ్ళీ అడిగింది.

"సీ-డాగ్ అంటారు దీన్ని. పోకిరీ జంతువు. వలలు కొరికేస్తుందొక్కొక్కసారి. దీని మాంసం తింటారు. రాత్రికి తిందాం కోసుకుని."

"ఛీ! కుక్క మాంసం అందులోకి పచ్చిమాంసం" ఒళ్ళు జలదరించింది శాన్యోరాకి.

"ఇది ఊరకుక్క కాదు. సీ-డాగ్ కావాలంటే నీకు దొరకొద్దూ! అకలేస్తే నువ్వే తింటావ్. తిన్న తర్వాత కుక్కలా అరవం లే" అన్నాను నవ్వుతూ.

"ఇక వెళ్దామా?"

"ఎలా తెల్సు నీకివన్నీ?" అడిగింది పైకి లేస్తూ శాన్యోరా.

"బోటనీ, జూఆలజీ మన్ది బి.యస్సీలో." అన్నాను నవ్వి బూట్లు తొడుక్కుంటూ.

లైఫ్‌బోటు తాడువిప్పి సముద్రంలోకి తోసి, దానిమీద కూరికాం ఇద్దరం.

తెడ్లు కదిలాయి.

ఈ సాధారణ బోటుతో తిరిగి నాగరిక ప్రపంచాన్ని చూస్తామన్న ఆశ చచ్చిపోయింది నాలో.

* * *

ఆ అంతులేని సాగరంలో బాగా చీకటి పడేసరిక్కి మూడు మైళ్ళు ప్రయాణించివుంటామేమో. అంతా కటిక చీకటి. లైఫ్‌బోటును ఏవైపుకు నడుపుతున్నానో నాకే తెలియదు.

అంతటా అంధకారం!!

ఆ నిశ్శబ్ద వాతావరణంలో కేవలం నీటిలో వేసే తెడ్ల చప్పుడు మాత్రం వినబడుతోంది!

"భయంకర్! నీ వొళ్ళు వేడిగావుంది" అంది శాన్యోరా చీకటిలో. నా మెడచుట్టూ స్పృశిస్తూ.

నిజమే. నా వొళ్ళు పులపరంగా చలి, జ్వరం వచ్చినట్లుంది.

శాన్యోరా గాభరాపడుందని చెప్పలేదు.

"సీ సిక్‌నెస్" అందామె.

మౌనంగా లైఫ్‌బోటుని ముందుకు పోనిస్తున్నాను.

"భయంకర్!" పిల్చింది చెవిప్రక్కగా శాన్యోరా.

ఆమె వెచ్చటి ఊపిరి నా మెడకు తగుల్తోంది.

"యస్ డార్లింగ్!"

"ఆర్ యూ ఆల్‌రైట్?"

"అయామ్ ఓ. కె."

"తెడ్లు ప్రక్కన పడేయ్. కాస్సేపు కబుర్లు చెప్పుకుందాం" సానుభూతి ధ్వనించింది ఆమె కంఠంలో.

ఆమె చెప్పినట్లు చేసాను.

శాన్యోరా నడుంచుట్టూ చెయ్యివేసి దగ్గరగా లాక్కు-న్నాను.

కటిక చీకటీ—భయం మమ్మల్ని దగ్గరగా కలుపుతున్నాయి.

శాన్యోరా నుదుటిమీదా, పెదిమలమీదా, గెడ్డంమీదా చెవిక్రిందా, మెడక్రిందా ముద్దు పెట్టుకుంటున్నా నావేశంగా.

శాన్యోరా తన్మయంగా తనమీదికి లాక్కుంది నన్ను.

కొద్దిసేపటికి సాగర మధ్యంలో...చిమ్మ చీకటిలో... ఆ పడవలో...అలిసిపోయి చెమటలు పట్టగా ఇద్దరం పసిపాపల్లా నగ్నంగా కావలించుకు పడుకున్నాం...

* * *

అలా ఎంతసేపు నిద్రపోయామో తెలీదు. లైఫ్ బోటు విపరీతమైన కుదుపులతో ఎగిరెగిరిపడుతూండగా ఇద్దరం లేచాం. విపరీతమైన వేగంతో గాలి 'రయ్యి'న వీస్తోంది. మేం నిద్ర కుపక్రమించి గంటైయ్యుంటుందేమో!

చీకటి అలాగే ఉంది.

ఇద్దరం కంగారుగా దుస్తులు ధరించేం.

"భయంకర్! ఏమిటది?" చీకటిని చీల్చుకుంటూ సన్నగా వినపడింది శాన్యోరా కంఠం.

"శాన్యోరా! సముద్రపు తుఫానేమోనని అనుమానంగా ఉంది..."

నా మాటలు పూర్తికాకుండానే భయంకరమైన ఈదురుగాలులు ప్రారంభమయ్యాయి.

తెడ్లు వేయబోయి ఆ ప్రయత్నం విరమించుకున్నాను. ఇట్స్ బియాండ్ మై కంట్రోల్!

నా కంట్రోల్లో లేదిప్పుడు లైఫ్‌బోటు!

పెద్దగా గాలి ప్రయాణిస్తోన్న శబ్దం వినబడతోంది.

ఆకాశాన్నెవరో పగలగొట్టినంత భయంకరంగా మెఱుపులు మెరిసి ఉన్నట్టుండి తాటికాయంత పెద్దపెద్ద వర్షపుచినుకులు ప్రారంభమయ్యాయి. అకస్మాత్తుగా వర్షం ఉధృతమై కుంభవృష్టిగా మారింది.

లైఫ్‌బోటుమీద యిద్దరం అటూ ఇటూ తూలిపడుతున్నాం.

"శాన్యోరా! నీనడుంకి నానడుంకి తాడుతీసి బలంగా కట్టాలి. తుఫాను భయంకరంగా ఉధృతమౌతోంది. ఎందుకూ కులాంటి ఈ బోటు మనల్ని కాపాడుతుందని నాకు నమ్మకంలేదు. దిసీజ్ అవర్ లైఫ్ అండ్ డెత్ ప్రాబ్లమ్" గాలిహోరులో గట్టిగా చెప్పాను శాన్యోరాని తూలిపోకుండా పట్టుకొంటూ.

తుపాకీ బొడ్లో పెట్టుకొని, శాన్యోరా నడుంకీ నా నడుంకీ మధ్య మూడు గజాలు దూరంవుండేలా తాడు కట్టాను. సరిగ్గా అదే సమయంలో భీభత్సంగా పెరుగుతున్న గాలి పలకరింపుకు సమాధానంగా ఓ పెద్ద కెరటం వచ్చి ఒక ప్రక్కనుంచి ఏటవాలుగా లైఫ్‌బోటునెత్తేసింది.

బోటు తలక్రిందులైంది!!

ఇద్దరం రబ్బరుబొమ్మల్లా సముద్రంలో పడ్డాం!

"యూ ఆర్ ఆల్ రెడీ సిక్ భయంకర్!" వర్షపుహోరులో అరిచింది శాన్యోరా వెనకాల ఈదుతూ.

ఇపుడాబోటు తేలిగ్గా కొట్టుకుపోయుంటుంది.

"నెవర్ మైండ్ శాన్యోరా! ఐకేన్ స్విమ్."

శరీరమంతా అణువణువూ స్వాధీనంలోకి తెచ్చుకొని కసిగా, పట్టుదలగా ముందుకీదటం ప్రారంభించాను.

ఈదుతున్నపుడు ఏవో చేపలు నాశరీరాన్ని మెత్తగా రాసుకుంటూ వెళ్ళిపోతున్నాయి.

రేడియం చేపలు మిలమిల మెరుస్తూ సముద్రంలో గాఢరాగా పరుగెడుతున్నాయి. కెరటాలు బలంగా మీద నుంచి వెళ్ళిపోతున్నాయి! సుమారు అరగంటపాటు భీభత్స వాతావరణంలో ఈదటంవల్ల శరీరం అంతా సలుపులా పెట్టసాగింది! నొప్పితో కాళ్ళు పక్షవాతం వచ్చినట్లు బిగుసుకుపోతాయేమో ననిపిస్తుంది!

అయినా చీకట్లో ఎక్కడికని, ఎలా ఈదటం...?

"శాన్యోరా! ఈదగలవా యింకా?" తల వెనక్కి త్రిప్పి అరిచాను. చేతులు బలహీనంగా కదుపుతూ.

"అయామ్ హోప్ లెస్ భయంకర్!" హీనంగా పలి పలికింది శాన్యోరా.

"వెల్! మనల్ని సముద్రం చంపటం నాకిష్టం లేదు. మన మృత్యువు మనమే కొని తెచ్చుకుందాం! నేను మూడం కెలు లెక్కపెడతాను. మూడో అంకె చెప్పగానే ఇద్దరం కౌగలించుకొని మునిగిపోదాం! విత్ ఎ లాస్ట్ కిస్!" అన్నాను నిరాశతో.

"ఓ.కె.! డార్లింగ్!!" అంది ధృఢస్వరంతో శాన్యోరా నాప్రక్కగా కదుల్తూ.

"వన్..." రెండుబారలు ముందుకీదాం.

"టూ..."

మరో రెండుసార్లుకొట్టాం నీటిపై చేతులతో.

"త్రీ!"

చటుక్కున ఈత ఆపేసి శాన్యోరాను కౌగలించుకున్నాను.

మా పెదిమలు అతుక్కుపోయాయ్.

అవే మా చివరిక్షణాలు!!

* * *

"భయంకర్! నాచేతికేదో తగిలింది" అంది ముద్దునుండి విడిపించుకుంటూ శాన్యోరా.

"ఏమిటది?" అన్నాను చీకట్లో ఆతృతగా ఆమెనలాగే పట్టుకొని.

"ఏదో గట్టులాంటిది." అందామె దానిమీద కూర్చుంటూ.

ఎలా సాధ్యం?

అపుడే భూమి ఎలా తటస్థపడింది?

ఆలోచిస్తూ చేత్తో తడుముకుని నేనూ ఆమె ప్రక్కగా కూర్చున్నాను.

సందేహం లేదు!

ఇసుక తగుల్తోంది చేతులకు తడిగా.

"భయంకర్! వుయ్ ఆర్ సేవ్డ్. ప్రొద్దున ఈ స్థలాన్ని పరిశీలిద్దాం అలిసిపోయాం. కాస్త నడుం వాలుద్దాం" అంది శాన్యోరా.

వర్షం కొద్దిగా తగ్గుముఖం పట్టింది.

ఆ ఇసుకే, మెత్తని పరుపుగా భావించి అలసటగా వెనక్కి వాలి కళ్ళుమూసేం.

విపరీతమైన ఒళ్ళు నొప్పులవల్ల ఎప్పుడో మాకు నిద్ర పట్టింది.

బాగా ఎండెక్కుతుండగా లేచాను తిరిగి.

వర్షం వెలిసిపోయిందప్పటికి.

“భయంకర్! ఓ చిన్న దీవిలోవున్నాం మనం” అంది నలువైపులా చూస్తూ శాన్యోరా.

రెండుక్షణాల తర్వాత అనుమానంగా ఆమె కనుబొమలు ముడిపడ్డాయి. “గమనించావా? ఈదీవి కదుల్తోంది నీటిమీద ఫ్లోటింగ్ అయిలెండ్” అంది ఆశ్చర్యంగా.

“శాన్యోరా! సముద్రంమీద కూలి కొట్టుకుపోయే చెట్లు, చేమలు ముక్కలు, నాచు, గవ్వలు ఇసుక మొదలైనవి ఒకచోట స్టాకైపోయి మెట్టగా ఏర్పడి, దీవులుగా మారతాయి. వీటినే ‘కోరల్’ అయిలెండ్స్ అంటారు. అలాంటిదే అయ్యుంటుందిది” అన్నాను చుట్టూ పరికించి చూస్తూ.

‘కదిలేదీవి’ అంతా కలిసి ఫర్లాంగు చుట్టుకొలతకూడా లేదు. సముద్రం మీద ఏదో ఇసుకదిబ్బ కదుల్తున్నట్టుగా ఉంది.

అక్కడక్కడ చిన్నచిన్న ముక్కలు మాత్రం ఉన్నాయి.

చెట్లుపుట్టలు ఏర్పడలేదింకా.

శాన్యోరా ఇసుకపట్టిన జుట్టును దులుపుకొంటోంది.

బోట్లోంచి తడిసిన తుపాకీ తీసి నేలమీద ఆరబెట్టాను. జేబులోంచి పాలిథిన్ బాగ్‌లోని తూటాల పాకెట్ తీసి దానిప్రక్కగా పడేశాను.

తుపాకీ తప్పిస్తే కట్టుబట్టలతో మిగిలిపోయాం మేం.

శాన్యోరా నీరసంగా అగుపడ్తోంది.

రాత్రి సగం సగం సీ_డాగ్ మాంసం తిని అది సహించక సముద్రంలోకి విసిరేసాను.

ఆకలి!!

ఫాంట్ జేబులో ఏదో గుచ్చుతున్నట్లనిపించింది.

చెయ్యిదూపాను అందులో—

"థాంక్ గాడ్!" గొణుక్కున్నాను.

సరిగ్గా రెండు వెన్నకాయలు తగిలేయి చేతికి. బైటికి తీసి అరచేతిమధ్య బిగించి వాటిని విరగగొట్టాను.

వెలగపండులా అది పగిలి గుజ్జు బయట పడింది. అదే మిగిలిన ఆహారం.

శాన్యోరా కొకటిచ్చాను.

అది భుజించి నీటిపై కదులుతున్న దీవిని టూరిస్టుల్లా ఆసక్తిగా చూస్తూ అర్థాకలిగా కూర్చున్నాం.

తుపాకీ అరిన తర్వాత మాగజైన్ ఓపెన్ చేసి, 'W' స్ప్రింగ్‌లో తూటాలు నింపి, లాక్ చేసి ఆకాశంలోకి ప్రేల్చానోరి.

ధన్ మంది గన్ నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ.

"తుపాకీ పజ్నేస్తోంది" తృప్తిగా ఊపిరొదిలాను.

మా చుట్టూ సముద్రం ఉంది.

అయితే దాహం తీర్చుకోడానికి గుక్కెడు నీళ్ళు కూడా లేవు!

మధ్యాహ్నం సూర్యుడు నడినెత్తిమీద కొచ్చేసరికి ఆకాశంలో ఏదో చప్పుడైంది.

చివాల్న పైకిలేచింది శాన్యోరా.

"భయంకర్! ఇట్స్ హెలీకాప్టర్!!" అరిచింది శాన్యోరా ఆకాశంలోకి చూసి కేరింతలు కొడ్తూ.

ఏదో ఆలోచిస్తున్న నేను ఉలిక్కిపడి పైకి చూసాను.

ఓ పసుపురంగు హెలీకాప్టర్ రెండు తాటిచెట్లు నిలబడిన ఎత్తులో ఎగుర్తుంది.

"హే! హెల్ప్! హెల్ప్!!" పైకిలేచి ఎఱ్ఱచొక్కా జండాలా ఊపుతూ కేకలు పెట్టాను. కొద్దిసేపటికి కదిలే దీవిచుట్టూ రెండు గిరికీలుకొట్టి హెలికాప్టర్ మామూందు లాండ్ అయింది.

ప్రొఫెల్లర్స్ ఆగిపోయాయి.

దాదాపు నలభైఏళ్ళ వయసుగల యిద్దరు వ్యక్తులు డోర్స్ తెరచుకొని క్రిందకు దిగేరు.

ఒకతనికి బట్టతల, మరొకతనికి పిల్లిగడ్డం.

ఇద్దరూ కళ్ళజోళ్ళు ధరించారు. ఇద్దరి మెడల్లో కెమేరాలు వ్రేలాడ్తున్నాయ్.

"ఉయ్ ఆర్ అమెరికన్స్. అమెరికన్ హెరాల్డ్ పత్రికకు మేం జర్నలిస్టులుగా పనిచేస్తున్నాం. కదిలేదీవుల మీద పరిశోధన చేయడానికొచ్చాం. ఎవరు మీరు? ఈ దీవిలోకి ఎలా వచ్చారు?" గబగబా అడిగాడు ఆశ్చర్యంగా పిల్లిగడ్డం వ్యక్తి.

"జంటిల్మన్! ఉయ్ ఆర్ గ్లాడ్ టు సీయు. మా వివరాలు తర్వాత చెప్తాను. మీరు ముందు మాకో ప్రామిస్ చేయాలి. మీ హెలీకాప్టర్‌లో ప్రయాణించడాన్కి అనుమతించాలి ముందు మమ్మల్ని." అన్నాను ముందుగా పిల్లిగడ్డం వ్యక్తితో స్నేహపూర్వకంగా కరచాలనం చేస్తూ.

"ఎలా? 'టూ'సీటర్ కాప్టర్ ఇది. అందులోనూ చాలా పాతది ఇది. ఎనీ వే తప్పక ఆలో..." ఇంకా ఏదో అనబోతూండగా బట్టతల వ్యక్తి అతనికి సైగచేసి దూరంగా తీసుకెళ్ళాడు.

రెండు నిముషాలపాటు పిల్లిగడ్డం వ్యక్తితో గుస గుస లాడాను బట్టతల వ్యక్తి.

పిల్లిగడ్డ వ్యక్తి నెమ్మదిగా అడుగులేస్తూ నాముందు కొచ్చాడు.

"అయామ్ సారీ యంగ్ మాన్. ఉయ్ కాంట్ హెల్ఫ్ యూ. నీ పేరు భయంకర్! అమెరికాలోకూడా వెదుకుతున్నారు పోలీసులు నీకోసం, భారత ప్రభుత్వం కోరిక మీదట." అంటూ హెలీకాప్టర్ వేపు నడిచాడు పిల్లిగడ్డం వ్యక్తి. అతన్ననుసరించేడు బట్టతల వ్యక్తి. సరిగ్గా అదే సమయంలో ధన్...ధన్...మని చప్పుడు విన బడింది. కెవ్వున అరుస్తూ ఇద్దరమెరికన్లు హెలీకాప్టర్ ముందు కూలిపోయారు.

ఉలిక్కిపడి వెనక్కి తిరిగి చూసాను.

కాన్సోరా చేతిలోని తుపాకీ పొగలు కక్కుతూంది.

"కమాన్ డియర్! మూవ్ యిన్ టు ది కాప్టర్." అంది హెలీకాప్టర్ వైపు పరుగెడ్తూ కాన్సోరా.

ఇద్దరం కాప్టర్లో కూర్చుని తలుపులు బిగించాం. కాన్సోరా చేతులు చకచకా యంత్రాలపై కదిలేయ్.

ప్రొపెల్లర్ 'డబ' 'డబ' శబ్దం చేస్తూ తిరుగసాగింది. మరో నిముషంలో కాప్టర్ పైకి లేచింది.

అద్దాల్లోంచి క్రిందికి చూసాను. నీటిమీద కదులుతున్న దీవి...మధ్యలో ఇద్దరమెరికన్ల శవాలు...

వింతగా కనిపించింది.

దృష్టి మళ్ళించాను.

కాలికేదో తగిలింది. అటువైపు చూశాను.

నా కళ్ళు మెరిసాయి.

"శాన్డ్రా! ఉయ్ గాట్ ద బీర్!" అరిచాను సంతోషంగా.

"ఓపెన్ ఇట్. దాహంగా ఉంది." అంది కాప్టర్ స్పీడ్ పెంచుతూ శాన్డ్రా.

కత్తి తీసి బీర్ టిన్‌ని పొడిచాను. నురగలు కక్కుతూ పైకి తన్నింది బీరు.

*    *    *

"దాదాపు వంద మైళ్ళుదాటాం" అంది శాన్డ్రా కాప్టర్‌ని పెద్ద పెద్ద చెట్లమీంచి పోనిస్తూ.

"శాన్డ్రా! అరేబియన్ సీ దాటాం. ఆఫ్రికా ఖండం తూర్పు కోస్టల్ మీద పయనిస్తున్నాం. పోర్టు సూడాన్ ఇంకా ఎన్ని వందల మైళ్ళో తెలీదు. ఫ్యూయల్ ఎంతుంది?" అడిగేను. క్రింద కనపడుతున్న అరణ్యాల కేసి అద్దంలోంచి చూస్తూ.

"మరో పూట వస్తుంది ఫ్యూయల్. భయంకర్! పోర్టు సూడాన్‌లో కనీసం రెండ్రోజులు విశ్రాంతి తీసుకోవాలి. మన బ్రాంచి అడ్రస్సు జ్ఞాపకం ఉందా?" అంది నావేపు చూస్తూ.

"ఒకసారి చూసినా, చదివినా అది నా మెదడులో ముద్రించుకుపోతుంది." అంటూ నవ్వబోతూ ముందుకు చూసి అదిరిపడ్డాను.

"శాన్డ్రా...!..." బిగ్గరగా కేకలు వేసాను.

నా వేపు చూస్తున్న శాన్డ్రా ఉలిక్కిపడి ముందుకు చూసింది.

ఎదురుగా పెద్ద కొండ శిఖరం.!!

రెండు సెకన్లలో గుద్దుకోబోతుంది.

తటాలున బలంగా త్రిప్పింది 'U' షేప్ రాడ్‌ని ఎడమవైపుకి. కాప్టర్ శిఖరం బారినుండి తప్పించుకుంది.

కాని......కాని......

స్టీరింగ్ రాడ్ సగానికి విరిగిపోయి శాన్యోరా చేతిలోనికి వచ్చేసింది.

"భయంకర్! గో పారాషూట్స్!" అంది దిగ్భ్రమగా నీరైపోతూ. కాప్టర్ రెక్కలు తెగిన పక్షిలా కుడివైపుకి తూలిపోతోంది.

అకస్మాత్తుగా వాహనం డౌనైపోవడంవల్ల ఇద్దరం తూలి యంత్రాలమీద పడ్డాం.

"శాన్యోరా! డోర్ తెరచుకుని క్రిందికి దూకెయ్! క్రింద 'గల్ఫ్ ఆఫ్ యాడెన్' సముద్రపాయ ఉంది." అరిచాను కుడివైపు డోర్ తెరచి ఆమెను క్రిందికి తోసేస్తూ.

ఆమె వెనుక నేనూ తటాలున దూకాను. తల్లక్రిందలుగా వెళ్ళి నీళ్ళలో పడ్డాను. పడటంలో ఎత్తునుంచి పడటంవల్ల సముద్రం అంతర్భాగంలోకి మునిగిపోయాను. ఊపిరి బిగించి నేలను తన్ని ఉపరితలంపైకి ఈదాను. హెలీకాప్టర్ పెద్ద శబ్దంతో నీళ్ళను గుద్దుకోవడం కనిపించింది.

"శాన్యోరా!" అర్చాను నీటిపై తేలుతూ.

నా గుండె ఝల్లుమంది.

ఆమె కనబడ్డంలేదు!

"భయంకర్...!" పెద్దగా పిలుపు వినపడింది వెనుకనుండి.

తల గిరుక్కున వెనక్కి తిప్పాను.

ఒడ్డుమీద నిలబడి పిలుస్తోంది శాన్యోరా తడిబట్టల్తో! తేలిగ్గా ఊపిరి వదిలి ఆమెవైపు ఈదాను.

చెయ్యి అందించింది శాన్యోరా.

మెల్లగా గట్టెక్కాను.

ఇద్దరం పరిసరాలు పరికించాం.

మేం ఉన్నది 'గల్ఫ్ ఆఫ్ యాడెన్' ఒడ్డున ఉన్న ఆఫ్రికా అరణ్యాల్లో.

"అయామ్ సారీ భయంకర్!... ఒక్క క్షణం నన్ను నేను మైమర్చిపోవడంవల్ల హెలీకాప్టర్‌ను కోల్పోయాం."

"ఫర్ గెటిట్ శాన్యోరా! అది ప్రైవేట్ హెలీకాప్టర్! పాతది! 60 మోడల్. అందుకే స్టీరింగ్ రాడ్ అవుగ్గా ఉండి ఉంటుంది. మనం ప్రాణాల్తో బయటపడినందుకు సంతోషించాలి." అన్నాను అరణ్యంలోకి చూస్తూ.

"కనీసం పోర్టుసూడాన్ సరిహద్దుల్లోకైనా వెళ్ళలేకపోయాం!" అంది నిస్పృహగా.

"ప్లీజ్ శాన్యోరా! అయిందేదో అయింది. గతాన్ని తవ్వక." ఆమె భుజం తట్టాను.

"క్రూర జంతువులు సంచరించే స్థలం ఇది. చీకటిపడే లోపునే మనం తల దాచుకోవడానికి అనువైన ప్రదేశం వెతుక్కోవడం మంచిది." బొడ్డులోంచి తుపాకీ తీసుకుని ముందుకు నడిచాను.

* * *

"తూటాలెన్నున్నాయ్?" వెనుగ్గా నడుస్తూ అడిగింది శాన్యోరా.

"సరిగ్గా పది. వాటితోనే మనల్ని మనం కాపాడుకుంటూ ఈ అరణ్యాలు దాటాలి, పశ్చిమంవైపు" తుపాకీ పట్టుకుని ముందుకు జాగ్రత్తగా అడుగు లేస్తున్నాను.

"అబ్బా!" అంది శాన్యోరా కంఠం.

గిరుక్కున తిరిగాను తుపాకీతో.

"ఏమైంది?"

కాలుపట్టుకుని ఓ చెట్టు మొదట్లో కూలబడింది శాన్యోరా 'ముల్లు' అంటూ.

ఎలాగుచ్చుకుంది ముల్లు?

జోళ్ళున్నాయి ఆమె పాదాలకు.

చాలా పెద్దముల్లు జోడులోంచి పాదంలోకి దిగబడి ఉండాలి.

"నేను తీయనా?" అన్నానామె ఎదురుగా నిలబడి.

"నో థాంక్యూ! ఐ కేన్ మేనేజ్" అంది పాదాన్ని పరీక్షించుకుంటూ.

జంతుభయంవల్ల మళ్ళీ పరిసరాలు పరికిస్తూ నిలబడి పోయాను.

వికృతంగా కేక వేసింది శాన్యోరా.

అదిరిపడుతూ తల త్రిప్పాను.

నా గుండె ఝల్లుమన్నాయి.

శాన్యోరా నిలబడివుంది.

అప్పటిదాకా ఆ వృక్షాన్ని గమనించనేలేదు.

వృక్షకాండం పొడవునా ఉన్న వేళ్ళలాంటి చేతులు ఆమెను బలంగా చుట్టేశాయ్.

మైగాడ్! మూపన్స్ అనబడే వృక్షం అది. ఏనుగైనా సరే దాని క్రిందకొస్తే మనిషి చేతుల్లాంటి దానిముళ్ళ కొమ్మలబారినుంచి తప్పించుకోలేదు.

జంతువుల్ని గాని, మనుషుల్ని గాని అది ఆ పంజాల్లో బంధించి మాంసాన్ని పీల్చేస్తుంది.

కెవ్వున అరుస్తోంది శాన్యోరా గింజుకుంటూ. చేతుల్లాంటి వేళ్ళతో ఆమెను బలంగా బంధించిందా వృక్షం...

బూటు సాక్సులోంచి తటాలున కత్తిలాగి వాటిని ముక్కలుముక్కలుగా నరికేశాను విద్యుత్ వేగంతో.

స్పృహతప్పి పడివున్న శాన్యోరా దబ్బున నేలమీద పడింది.

చటుక్కున యివతలికి లాగి ఆమెను భుజంమీద వేసుకుని చేతిలోని తుపాకీతో ముందుకు నడిచాను.

'దీర్ఘాయుస్సు' మాట ఎలావున్నా 'దినదిన గండం' మాత్రం ఎదురౌతోంది మాకనుక్షణం! ఎన్ని ఆపదలు ఇలా తప్పించుకోగలం!

ఏదో గండంలో కాలుజారక తప్పదేమో!

ఆలోచన కట్టిపెట్టేను.

ఎదురుగా ఓ కొండగుహ కన్పడుతోంది.

అందులో మకాం వేస్తే?

ఊహుఁ... నామనసంగీకరించలేదు.

ఏవో జంతువులందులో ఉండొచ్చు. నా అనుమానాన్కి ఆధారంవుంది. ఆ గుహముందు ఏవో అస్తికలు కన్పడుతున్నాయి!

ఏ పెద్దపులో ఎప్పుడో ఎవర్నో లాక్కొచ్చి అక్కడ చంపేసుంటుంది.

కొద్దిదూరంలోవున్న చెట్టు నన్నాకర్షించింది.

ఆ చెట్టు గుబురుగావుండి రెండు బలమైన కొమ్మలు అడ్డంగా విస్తరించివున్నాయి.

వాటిమీద మంచెలాంటి దేర్పాటుచేసుకొని రాత్రి కక్కడ కాలక్షేపం చేసెయ్యొచ్చు. శాన్యోరాని నెమ్మ

దిగా చెట్టు మొదట్లో దింపాను, అది మోపన్స్‌లాంటి వృక్షం కాదన్న గ్యారంటీ కుదుర్చుకున్న తర్వాత.

ఆమెకి తెలివి తెప్పించేసరికి అరగంట గడిచిపోయింది.

"బ్రతుకుతానను కోలేదు" అంది కాన్స్యోరా నీరసంగా.

ధైర్యసూచకంగా ఆమె భుజం తట్టాను.

అరణ్యమంతా నిశ్శబ్దంగా వుంది.

సిగరెట్టు కాల్చాలనుంది.

ఆ ఆశని అర్జంటుగా చంపుకున్నాను.

దగ్గరలో అటూ ఇటూ తిరిగి చిన్న చిన్న కొమ్మలు నరికాను.

వాటి నేరుకొనొచ్చి కాన్స్యోరాముందు నిలబడ్డాను.

"ఐ విల్ హెల్ప్ యూ!" అందామె.

"వీల్లేదు, నువ్వు రెస్టుతీసుకో."

నెమ్మదిగా చెట్టెక్కాను.

పదిహేను నిముషాల్లో లతలను, తీగల్ని తాళ్ళుగా ఉపయోగించి, ఆ కొమ్మలమీద మంచెలాంటిదేర్పాటు చేసాను.

ఆకులు చల్లాను మెత్తగా వుండటానికి.

ఆ చెట్టుకు దగ్గర్లో తిరిగి పేరు తెలీని పళ్ళ కోసుకున్నాం.

కొన్ని పళ్ళుతింటే పిచ్చెక్కుతుందంటారు.

అవేమీ ఆలోచించడంలేదు.

తృప్తిగా తిని చీకటి పడేసరికి చెట్టెక్కాం.

చెట్లగుబురులోని మంచె మాకు ఆరాత్రి పట్టెమంచం అయింది.

* * *

అర్ధరాత్రి అయ్యుంటుందేమో!

క్రొత్తప్రదేశం...భయంకర వాతావరణం...కావడం వల్ల నిద్రపట్టటంలేదు మాకు.

కీచురాళ్ళరొద కర్ణపేయంగా వినబడుతోంది. మంచె యిరుగ్గావుంది మాయిద్దరికీ.

శాన్యోరా బలంగా నానడుం చుట్టూ చేయివేసి ముడిచి పెట్టుకుపడుకొని నిద్రపోడానికి ప్రయత్నిస్తోంది.

ఉన్నట్లుండి కొంచెం దూరంలో ఏదో అలికిడి వినిపించింది నాకు. త్రుళ్ళిపడి చెట్ల గుబురులోంచి అటువైపు చూసాను.

నాగుండెలు గుబగుబలాడాయి...

ఎవరో ఇద్దరు వ్యక్తులు ఆ అర్ధరాత్రి సమయంలో నగ్నంగా ఉన్న ఓ శవాన్ని మోసుకొస్తున్నారు.

వారికి ముందొక మనిషి, వెనుకొక మనిషీ కర్రకాగడాలతో నడుస్తున్నారు. కాగడా వెలుగ్లో ఆ నల్లుర్నీ పరీక్షగా చూసాను.

బిరుసెక్కి రింగురింగులుగా ముడుచుకుపోయిన జుట్టు... చీకకళ్లు...చప్పిడిముక్కు...లావాటి పెదాలు... పెద్ద పెద్ద చెవులు...గండశిలల్లా నల్లగా ఉన్నారు.

పొట్టిదేహాలు.

వాళ్ళు ఒంగినట్లుగా నడుస్తూంటే చింపాంజీలు రెండు కాళ్ళమీద నిలబడి నడిచినట్లుగా అనిపిస్తోంది. కోతిదశ నుండి రూపాంతరం పొందని మనుషుల్లావున్నారు.

మెడలో ఏదో ఎముకలదండ వ్రేలాడుతోంది...

నడుంచుట్టూ పెద్దసైజు ఆకులు ధరించారు.

శవాన్ని గుహాముందు దింపేరా ఇద్దరడవిమనుషులూ.

మిగతా యిద్దరూ కాగడాలను శవానికి ప్రక్కగా నేలలో గ్రుచ్చేరు.

నాగుండెలు పీచుపీచుమంటున్నాయి.

ఆ శవం ఎవరూ?

ఆ ఆడవిమనుషులెందుకు మోసుకువచ్చారు? ఇంత అర్థరాత్రిలో? నాగుండె హఠాత్తుగా వేగంగా కొట్టుకో సాగింది.

ఎదురుగా...!

వాంతి వచ్చినట్లవుతోంది నాలో...

ఆ నలుగు మనుషులు ... ఆ శవాన్ని ... కొరుక్కుతింటున్నారు...!!

వాడియైన గోళ్ళతో మాంసం—ముద్దలు ముద్దలుగా పీకి రాక్షసుల్లా తింటున్నారు.

అంతులేని భయంతో నా వెంట్రుకలు నిక్కబొడుచుకున్నాయ్!

కేనిబాల్స్!

నరమాంస భక్షకులు!

ఆ రాక్షసుల మాతులు ఎబ్బెగా—భయంకరంగా కనపడుతున్నాయి కాగడా వెలుగులో.

నాగుండె లవిసిపోతున్నాయ్.

ఉన్నట్టుండి నా ప్రక్కగా పడుకొన్న శాన్యోరా కదిలింది. నాతల మీదుగా ఆమె తలపెట్టి వాళ్ళవైపు చూసింది.

ఆమె భయవిహ్వలయై ఏం చెయ్యబోతుందో నాకు తెల్సు. బలంగా ఆమె నోరును అదిమేను అరచేత్తో.

"షట్ యువర్ మౌత్" అన్నానామె చెవిలో.

"డబ్...డబ్...డబ్..." గుండెలు కొట్టుకుంటున్న శబ్దం అవుతోంది.

ఆ శబ్దం నాగుండెదో, శాన్యోరా గుండెదో తెలియటం లేదు.

శాన్యోరా ముఖంపై చెమటలు తడిగా నాకు తగిలేయ్.

ఆమెనోటిపై చెయ్యి తీసివేశాను!!

అక్కడే పెద్ద పొరపాటు చేశాను!!

ఆమె నోటిమీద చెయ్యి తీస్తుండగా నాచెయ్యి తగిలి తుపాకీ మంచెమీంచి జారి దబ్బున నేలపై పడింది! నాగుండె అవిసిపోయాయి!! తుపాకీ పడిన అలికిడి విని ఓనరమాంస భక్షకుడు ఉలిక్కిపడ్డాడు.

శవాన్ని తినడం ఆపి, మూతి తుడుచుకుంటూ, అనుమానంగా కళ్ళుచిట్లించి చుట్టూ చూశాడు.

కాగడా పట్టుకుని...పైకి...లేచేడు!?

నేను భీతిల్లిపోతూ అటువేపు చూసాను.

నా శరీరం చలి, జ్వరం వచ్చినట్లు గజగజ వణుకుతోంది.

నరమాంసభక్షకుడు చేతిలోని కాగడాతో మా చెట్టుకు నాల్గుగజాల దూరంలోకొచ్చి నిలబడి గ్రద్దలా అటూఇటూ చూడసాగాడు. వణుకును ఆపుకోలేకపోతున్నాను...

శాన్యోరాకేమీ సూచనలివ్వడానికి అవకాశం లేదు. ఆమెకాని, నేనుకాని కొంచెం ప్రక్కకు కదిలినా ఆకుల చప్పుడు అవుతుంది. ఊపిరి బిగబట్టాను.

నరమాంసభక్షకుడికి తుపాకీ కంటపడింది.

అతను వంగి, దాన్ని చేతుల్లోకి తీసుకొని పరీక్షించడం మొదలెట్టాడు.

తుపాకీని అటూ, యిటూ తిప్పుతూ బారల్ కేసీ, సేఫ్టి కాచ్ కేసీ, ట్రిగ్గర్ గార్డ్ కేసీ వింతగా చూడసాగాడు.

నేనూ, శానోర్యారా ఊపిరి బిగపట్టి కిందకు చూస్తున్నాం.

నా శరీరం చెమటలతో నిండిపోయింది...

నరమాంసభక్షకుడి చేతుల్లోని తుపాకీ ఏటవాలుగా వుంది...

ఏదో అనుకుని ట్రిగ్గర్ నొక్కితే సూటిగా పైపులోంచి దూసుకువచ్చి నా గుండెల్లో దిగబడుతుంది బుల్లెట్!

ఆ ఆలోచన రాగానే నా వెన్నులోంచి చలి పుట్టుకొచ్చింది.

అలా జరుగుతుందని 'ముందు జాగ్రత్తగా'– పక్కకి కదల్లేను.

ఆకుల చప్పుడుఅయి శానోర్యారా చావుకికూడా బాధ్యుడవుతాను.

ఆ వస్తువేమిటో అతనికి అర్థంఅయి వుండదు.

నరమాంసభక్షకుడు కాస్సేపు ఆ తుపాకీని ముందు భాగం, వెనకభాగం కొఱికి, చేతితో తట్టి, విసుగ్గా దూరంగా పొదల్లోకి విసిరేశాడు తుపాకీని.

నాలో భయం అప్పటికి కొంత శాంతించింది.

మిగతావాళ్ళంతా గుహ ముందుగా, తమకేమీ పట్టనట్లుగా మౌనంగా శవాన్ని తింటూనే వున్నారు. దుర్గంధం నా ముక్కు పగలగొడుతోంది. నరమాంసభక్షకుడు వెనుదిరిగి వాళ్ళవేపు నడవసాగాడు.

"థాంక్ గాడ్!" మనసులోనే గొణుక్కుని స్వేచ్ఛగా ఊపిరి వదిలాను. సరిగ్గా అదే సమయంలో...

మా వెనుకనించి ఆకులు దబదబ కదిలాయ్.

నా గుండె ఝల్లుమంది!

అదిరిపడుతూ వెనక్కి చూసాను.

ఏదో చిన్న జంతువు పరిగె త్తింది.

ఆ అలికిడి విని, తన సహచరులవేపు నడుస్తున్న నరమాంసభక్షకుడు గిరుక్కున వెనుదిరిగాడు......

గబగబా చెట్టు మొదట్లోకి వచ్చి కాగడా పైకెత్తాడు.

విస్తృతమైన వెల్తురు మా ముఖాలమీద పడింది.

ఊహించని పరిణామం అది!

చిక్కిచిక్కిపోయి అలాగే ఉండిపోయాను ఒక్కక్షణం......

స్వేదం ముక్కుమీదుగా జారి నోటికి ఉప్పగా తగులోంది.

"భయంకర్! లుక్ దేర్!" భయంగా అర్చింది శానో్యరా.

ఉలిక్కిపడి క్రిందికి చూసాను.

రెండు కాళ్ళమీదా ఊగుతూ నరమాంసభక్షకుడు మిగతావాళ్ళని కీచుగా అరుస్తూ పిలుస్తున్నాడు......

అంతే!!

మిగతా ముగ్గురు శవాన్ని వదిలి చటుక్కున లేచారు.

కోతుల్లా గెంతుతూ మేమున్న చెట్టువేపు పరిగెట్టుకొచ్చారు.

*　　　*　　　*

"శానో్యరా! చెట్టుదూకి పరిగెట్టు... నువ్ ఎడంవేపు నేను కుడివైపు. యిద్దరం ఒకేసారి దొరికిపోకూడదు. యింతకంటే చేసేదేమీ లేదు. క్విక్!" అంటూనే ఆమెను తట్టి దబ్బున క్రింద ఉన్న నరమాంసభక్షకుడిమీదకు దూకాను.

మెరుపులా కదిలి అతని గుండెలమీద తన్నేను. వెల్ల

కితలా పడి "బాహా! బాహా!" అంటూ వికృతంగా అరవసాగాడు నరమాంసభక్షకుడు. పాదల్లో పడ్డ తుపాకీ తీసుకునే అవకాశంలేదు. యిద్దరం రివ్వున రెండువైపులా పరిగెత్తాం......

నా వెనుక ముగ్గురు నరమాంసభక్షకులు వెంటపడ్డారు పెద్ద పెద్ద కేకలు పెడ్తూ. బాణంలా పరిగెడుతూ సగం తినబడిన శవంమీంచి దూకి కుడిప్రక్కగా లంఘించాను. నా వెనుకే పాదాలచప్పుడు వినపడ్తోంది.

ఎదుట ఏముందో స్పష్టంగా కనపడ్డంలేదు.

అలవాటులేని ప్రాంతం... దారి చేసుకుంటూ పరిగెత్తడం దుస్సాహసంగా అనిపిస్తోంది.

వెనుక కదిలే కాగడాల కాంతివల్ల ఆ మృత్యుదూతలు నా వెనుకే ఉన్నారని తెలుస్తోంది.

దారి తెన్నూ లేకుండా పిచ్చిగా పరిగెడుతున్నాను.
ఆ రాక్షసులకి చిక్కితే తక్షణమే భోంచేస్తారు నన్ను!
దిక్కులేని చావు అంటారు దాన్ని!

లతలు, తీగెలు, ముళ్ళకంపలూ అడ్డం వస్తున్నాయ్.
చేతులు, భుజాలు, గీరుకుపోతున్నాయ్...
ఒగుర్పు...

ముందున్న చీకట్లోకి తారాజువ్వలా దూసుకుపోతున్నాను. ప్రాణభీతి!...ఉన్నట్టుండి మోకాలికి ఏదో టపుక్కున తగిలింది.

అంతే!

తటాలున తూలి బోర్లా ముందుకుపడ్డాను.

ఆ పడ్డంతో నుదురు తప్పున గుద్దుకుంది ఓ బలమైన చెట్టు మొదలుకి.

మెదడు పగిలినట్లనిపించింది...

ప్రపంచం నా కళ్ళముందు గిర్రున తిరగసాగింది.
గాయాన్ని అదిమిపట్టాలని చెయ్యి సగం పైకెత్తాను.
అంతే!
ఆ తర్వాత ఏమయిందో నాకు తెలియలేదు.

*　　　*　　　*

ఎప్పుడో స్పృహ వచ్చింది నాకు.
కళ్ళు తెరవాలనిపించలేదు.
శూల సూదులతో పొడిచినట్లుగా బాధ.

గాయం చేత్తో తడుముకుందామని అప్రయత్నంగా చెయ్యి పైకెత్తబోయాను.

కాని నా ప్రయత్నం ఫలించలేదు!!

ఉలిక్కిపడి కళ్ళు తెరిచేను.

అప్పుడు తెల్సింది నాకు నేను ఓ చెట్టుకు కట్టివేయబడి ఉన్నానని...

అదే క్షణంలో నాకు జీవితం మీద రోత పుట్టింది.

రాత్రి సరియైన ఆహారం లేదు.

నాలిక పిడచకట్టుకుపోయింది.

దాహం...

విపరీతమైన దాహం...

ఆశగా కళ్ళు పెద్దవి చేసుకుని ముందుకు చూశాను.

ఎదురుగా ఐదారు గజాల దూరంలో ఓ చలిమంట వేసి వుంది.

దాని చుట్టూ దాదాపు యిరవై మంది నరమాంస భక్షకులు కూర్చునివున్నారు. నలుగురు స్త్రీలు నల్లగా, బలిసిన దేహాలతో అందవికారంగావున్నారు.

తాటికాయల్లాంటి వారి వక్షోజాలు నగ్నంగా కనబడుతున్నాయ్.

స్త్రీలూ, పురుషులూ మెడవద్ద ఎముకలదండలు ధరించారు.

నెమ్మదిగా తలతిప్పి పరిసరాలను పరికించాను.

ఇప్పుడు నేనున్నది గుహాప్రాంతం కాదని గ్రహించాను. ఏదో చాటుగావున్న ప్రదేశంలా అవుపిస్తోంది. నా మెదడులో ఓ అనుమానం మొలకెత్తింది.

ఇరవైమంది పురుషులకీ, నలుగురు స్త్రీలేనా?...

ఆది సమాధానం దొరకని ప్రశ్నగా భావించి మౌనంగా చలికాగుతున్న నరమాంసభక్షకుల వేపు చూసాను.

నలుగురు స్త్రీలలో ఓ లావుపాటి స్త్రీ పిల్లకోతిలాంటి పసివాడికి పాలిస్తోంది...

మరో నరమాంసభక్షకుడ్ని తయారుచేస్తోందన్నమాట!

స్తనాల్ని పట్టుకుని చీకుతున్న కుర్రాడ్ని చూసి అదిరిపడ్డాను.

నోరుతెరిచి పాలు తాగుతున్నప్పుడు వాడి నోటికి అటూ ఇటూవున్న చిన్న కోరపళ్ళు తెల్లగా మెరిసాయ్

తళుక్కున!

ఇన్ హెరిటెన్స్!

వారసత్వం!

అవసరాన్నిబట్టీ, ఉపయోగాలబట్టీ అవయవాలు పెరగడంగాని, తరగడంగాని జరుగుతుందన్న డార్విన్ సిద్ధాంతం జ్ఞాపకంవచ్చింది.

"దా...హం..."అనబోయాను. కాని నా నోరు పెగల్లేదు.

ఎప్పట్నించి నిలబడివున్నానో?

నరనరాల్లోనూ నీరసం ఆవహిస్తోంది. (సశేషం)

# ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్ట చివరిబొమ్మ) పరిశీలించండి. రెండు ముఖ చిత్రాలకు సంబంధం ఉండేటట్లుగా ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలోగాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి ఈ నెల 10వ తేదీలోపు మాకు చేరే టట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబరుకూడా వ్రాయాలి. సభ్యులు కాని వారు తమ వ్యాఖ్యాలతో 30 పై.లు స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వాఖ్యలలో అత్యుత్తమమైన వాఖ్యకు రూ. 20లు నగదు బహుమతి పంపుతాము. ఫలితాలు వచ్చే నెల మాసపత్రికలో చూడండి.

## మీరే ఎన్నుకోండి?

ఈ నెల ప్రచురించబడిన నవలలు, కధలు, హాస్య రచనలలో ఏవి ఉత్తమమైనవో, మాస పత్రికలో ప్రచు రించబడిన బ్యాలెట్ పత్రంలో వ్రాసి పంపండి.

ఉత్తమ నవలకు రు. 200/-లు, ఉత్తమ కధకు రు. 100/-లు, ఉత్తమ జోక్ కు రు. 20/-లు బహుమతి ఇవ్వబడుతుంది. అలాగే యీ మూడు ఉత్తమ రచనలను సరిగ్గా ఎన్నిక చేసిన పాఠకులకు ఒక్కొక్కరికి రు. 10/-లు బహుమతి వుంటుంది.

## "హోమ్ డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యత్వము తీసుకుంటే, మీకు కాపీలు గ్యారంటీగా చేరుతాయి. పైగా పత్రిక ఖరీ దులో కొంత తగ్గింపు లభిస్తుంది. సభ్యత్వము కోసం మీరు రు. 5/-లు పంపండి. మీకు ప్రతినెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 5/-లకే వి.పి. ద్వారా పంపబడతాయి.



# క్రైమ్‌లో తమాషాలు

## ఫిర్యాదులు—సలహాలు

కొత్తగా హోటల్ పెట్టిన ఒకతను, తమ హోటలు యొక్క గిరాకీల అభిప్రాయాలు తెలుసుకోవాలని "ఫిర్యాదులు మరియు సలహాలు" అని వ్రాసియున్న ఒక డబ్బాను గోడకు తగలించాడు.

రాత్రి వాకిలివేసేముందు ఆ డబ్బా తెరచి చూచాడు. అందులో ఒకటే చీటివుంది అందులో యిలా వ్రాసివుంది.

"బోండాకు చట్నీ ఎక్కువ యిస్తున్నారు. కాబట్టి బోండా సైజు పెద్దది చేయవలెనని కోరిక."

—ఎస్. వాసుదేవాచార్, బెంగుళూరు.

## "కాగితాలు కావాలి!"

కొందరు దుండగులు సి. బి. ఐ. ఏజంటును బంధించారు.

దుండగులు: ఆ కాగితాలెక్కడున్నాయి?

సి. బి. ఐ. : నాకు తెలియదు.

దుండగులు ఆ సి. బి. ఐ. ఏజంట్‌ను చితగొట్టసాగారు అది చూచి అప్పుడే అటు వచ్చిన పల్లెటూరుబైతుకు కోపమొచ్చింది.

"ఏంటయ్యా అది. మీకు కాగితాలు కావలిస్తే ఏసుబ్బిశెట్టి కొట్లోనే కొనుక్కోవాలిగాని, ఇలా ఊరికి కొత్తగా

వచ్చిన వాడినడిగితే ఏం చెబుతాడు? అసలే అతనికి ఊరు కొత్తలాగుంది. —వి. నాగేశ్వరరావు, కాకినాడ.

## పోలీసులు—అబద్ధాలు!!

డాక్టరు రాజారావు తన నర్సింగ్‌హోమ్‌లో కన్సల్టింగ్ గదిలో కూర్చుని ఏదో కేసును గూర్చి తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. ఇంతలో ఆయన దగ్గరకి ఆయన కొడుకు వచ్చి-"నాన్నా! నాన్నా! మన వార్డులో నాలుగో నెంబరు బెడ్ మీదవున్న పేషంటు చచ్చిపోయాడు...." అన్నాడు.

ఆలోచనలలో మునిగివున్న రాజారావుగారు ఉలిక్కిపడ్డారు. "ఏమిటి....నాలుగో నెంబరు బెడ్ మీద ఉన్నతనా"

"అవును....ఇంతక్రితమే నర్సు ఎక్సపయిరీ అయిన ఇంజక్షన్ అతనికి చేసింది. దాంతో అతను చనిపోయాడు."

అదిరిపడ్డారు రాజారావుగారు.

"ఏమిటిరా నువ్వు చెప్పేది నర్సు ఎక్సపయిరీ అయిన ఇంజక్షన్ చెయ్యడం ఏమిటి?" ఆతృతగా ప్రశ్నించాడు.

"అవును....నేనే ఓ ఎక్సపయిరీ అయిన ఇంజక్షన్ బాటిల్ తీసి నర్సుకిచ్చి, మా నాన్నగారు అర్జంటుగా ఈ ఇంజక్షన్ నాలుగో నెంబర్ బెడ్ పేషంటుకు చెయ్యమన్నారని చెప్పాను—ఆమె అలాగే చేసింది. అతను చచ్చిపోయాడు. వాళ్ళవాళ్ళంతా ఏడుస్తున్నారు. ఎక్సపయిరీ అయిన ఇంజక్షన్ చేస్తే చనిపోతారని, మన దొడ్లోవున్న ఇంజక్షన్ బాటిల్స్ ఎక్సపయిరీడేట్ అయిపోనవని నువ్వే చెప్పావుగా...."

కొడుకు మాటలు వినగానే రాజారావుగార్కి చెమట్లు పట్టాయి. ముఖంలో కంగారు బయలుదేరింది.

"ఒరే! కొంప ముంచావు గదరా! అయినా ఆ పేషం

టుకు ఎక్స్పయిరీ. అయిన ఇంజక్షన్‌ను ఎందుకు చేయించావురా?"

"అదికాదు అతనే బాధతో గిలగిలలాడుతూ 'భగవంతుడా హాయిగా ఈ ప్రాణాలు పోనీక ఇంత బాధ నన్నెందుకు పడనిస్తున్నావని' ఏడుస్తుంటే పాపం! చూడలేక నేనే ఈ పని చేశా."

"ఓరీ! .ఎంత పాపం చేసావురా! ఒక నిండుప్రాణం బలితీసుకున్నావ్—అదీగాక ఆ పోలీసులకు ఈ విషయం తెలిస్తే ఇంకేమన్నా వుందా! నిన్ను నన్ను జైల్లో పెడ్తారు ఎంత అపఖ్యాతి!!—సరేగాని నువ్వింక నోరు మూసుకో! ఎవరికీ ఈసంగతి చెప్పకు. ఒకవేళ ఎవరైనా నిన్ను అడిగినా, నాకేం తెలియదని చెప్పు....తెలిసిందా!"

"నాన్నా ఆబద్ధం చెప్పచ్చా...."

"నోరు మూసి చెప్పినట్లు చెయ్యి" అంటూ వడివడిగా నాలుగో నెంబర్ బెడ్ వేపు నడవసాగారు. నాలుగోనెంబరు బెడ్ మీద పేషంటు హాయిగా భోంచేస్తూ ఉండటం చూసి, ఆశ్చర్యంగా కొడుకు ముఖంలోకి చూశారు రాజారావుగారు.

"నాన్నా! నిన్న ఎన్ని తిట్టావ్. వెధవా పదేళ్ళువచ్చాయి. యింకా అబద్ధాలు ఆడుతాతున్నావ్ సిగ్గులేదూ....అన్నావ్! మరి ఈరోజు నాకన్నా వయస్సులో పెద్దవాడివే పోలీసులకేసు అనేసరికి నువ్వే నన్ను అబద్ధం చెప్పమన్నావ్ ఇప్పుడు నిన్న నువ్వు తిట్టిన తిట్లు అన్నీ నీకూ వర్తిస్తాయిగా — అది తెలియజెప్పడానికే ఈ నాటకం—" అంటూ తుర్రుమన్నాడు రవి.

డా॥ రాజారావుగారు కొయ్యబారిపోయారు.

నాగ కనక[illegible] ప్రి. ఎస్. సుబ్రహ్మణ్యం, హైద్రాబాదు.

[illegible]

